


# సంస్కార విధి

(శ్రీ మద్దయానంద సరస్వతి)





పండిత గోపదేవ్

# సంస్కార విధి

(శ్రీమద్దయానంద సరస్వతి)

అనుకర్త :

దార్శనికులు "కళాప్రపూర్ణ" దర్శన తత్త్వవేత్త, వేద వేదాంగ పారంగత్

**పండిత గోపదేవ్**

ప్రకాశకులు :

అంబా దర్శన గ్రంథమాల

ఆర్యసమాజము - కూచిపూడి,

తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా - 522313

అంబా దర్శన గ్రంథమాల - 42
ఆరవ సంస్కరణము : 1000 ప్రతులు


శ్రీ మన్మథనామ సం॥ భాద్రపదము - 2015

మూల్యము : రూ. **60-00**
(తపాలా ఖర్చులు అదనము)

**పోస్టు ద్వారా ప్రతులకు :**
ఆర్యసమాజము, కూచిపూడి - 522 313,
తెనాలి తాలూకా, గుంటూరు జిల్లా. ఆం.ప్ర.

**ప్రతులకు :**
శ్రీ మాశెట్టి శ్రీనివాస్ ఆర్య, షాప్ నెం.5, మాశెట్టి బిల్డింగ్,
3-3-736 to 740, కంచరిబజార్, సికింద్రాబాద్-500 003.

విద్యా బుక్ డిపో, సుల్తాన్‌బజార్, హైదరాబాద్ - 500 095.

ఆర్యసమాజము, సుల్తాన్ బజార్, హైదరాబాద్.

ఆర్యసమాజము, మెయిన్‌రోడ్, సీతాఫలమండి - 500 061.

Printed at : **PRINTSHOP** 040-6632 0300.

# పరిచయము

యజ్ఞములు శ్రౌతయజ్ఞములు 16, స్మార్త యజ్ఞములు 16, స్మార్తయజ్ఞ విధానము గృహ్య సూత్రములలో గలదు. వానిలో నంతర్గములైనవే యీ గర్భదానాది షోడశసంస్కారములు. స్వామి దయానంద సరస్వతి మానవులందరు చేయవలెనని చెప్పిన 16 సంస్కారములే యిందు గలవు. 1. శరీరాంభమునకు గర్భాధానము, 2. గర్భము నిలిచినవుడు పుంసవనము, 3. గర్భాభివృద్ధికి సీమన్తోన్నయనము, 3. జన్మించినవుడు జాతకర్మ, 5. వేఱుగా దెలియుటకు నామకరణము, 6. శుద్ధవయులో బ్రివ్వనది నిష్క్రమణము, 7. అన్నప్రాశనము, 8. పుట్టు వెంట్రుకలు తీయునది (చూడాకర్మ) 9. చెవులు కుట్టుట (కర్ణవేధ), 10. ఉపనయనము (యజ్ఞోపవీతధారణ) 11. వేదారంభము, 12. సమావర్తనము (గురుకులమునుండి తిరివచ్చుట). 13. వివాహము (సంతానము కొఱకు), 14. గృహప్రవేశము, 15. పౌత్రదర్శనానంతరము వానప్రస్థము, 16. విరాగియై సంన్యసించుట - మరణానంతరము చేయునది అంత్యేష్టి. ఈ సంస్కారములన్నింటియందు యజ్ఞము చేయవలెను. ఈ సంస్కారములన్నింటిని శాస్త్రపద్ధతిగా జేయు విధానమును దెల్పునదే ఈ షోడశ సంస్కార విధి.

- ప్రకాశకులు

# విషయ సూచిక

ఓం నమోనమః సర్వవిధాత్రే జగదీశ్వరాయ

# షోడశ సంస్కారవిధి

ఇందు పదునాఱు సంస్కారములు గలవు. ప్రతి సంస్కారమునకు ముందుగా పురోహితుడు యజమానుని చేత సంకల్పము చెప్పించి పురోహితుని వరణము కావలయును. ఆచమన, అంగస్పర్శ మంత్రముల ద్వారా ఆచమనాదులు చేయించి, యజ్ఞోపవీతము ధరింపజేసి ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన, స్వస్తివాచన, శాంతికరణ మంత్ర పఠనము కావింప వలయును. తరువాత సామాన్య యజ్ఞముచేసి ఆయా సంస్కారములకు సంబంధించిన మంత్రములతో ఆయా సంస్కారములు పూర్తిచేయవలయును.

యజమానుడు చేయు సంకల్పము :

ఓమ్ అద్య బ్రహ్మణః ద్వితీయే ప్రహరార్ధే, శ్వేతవరాహకల్పే, సప్తమే వైవస్వత మన్వన్తరే, అష్టావింశతితమే కలియుగే, ప్రథమపాదే, జంబూద్వీపే, భరతవర్షే, భరతఖండే, ఆర్యావర్తే, పుణ్యభూమౌ, మేరోః దక్షిణ దిగ్భాగే, శ్రీశైలస్య ఈశాన్యప్రదేశే, కృష్ణా కావేర్యోః (కృష్ణా గోదావర్యోః) మధ్యప్రదేశే, ఆంధ్రప్రదేశాంతర్గతే....నగరే....గ్రామే, శుభ, శోభనగృహే, మహాజన సన్నిధౌ, అస్మిన్ వర్తమాన వ్యావహారిక చాంద్రమానే.. ......సంవత్సరే......అయనే......ఋతౌ........మాసే..........పక్షే....... ....తిథౌ........వాసరే ఏవంగుణ విశిష్టే శుభదినే.... ....గోత్రోత్పన్నః......నామ అహం...... సంస్కార కరణాయ భవంతం వృణే. అని సంకల్పించి పురోహితునెన్నుకొని "ఆవసోః సదనే సీద" కూర్చుండుడన వలయును.

పురో : సీదామి' అని ఆసనముపై కూర్చుండవలెను.

ఆచమనము :

1. ఓమ్ వాజ్మ ఆస్యే అస్తు
2. ఓమ్ నసో ర్మే ప్రాణో ऽస్తు
3. ఓమ్ అక్ష్ణోర్మే చక్షురస్తు
4. ఓమ్ కర్ణయో ర్మే శ్రోత్రమస్తు
5. ఓమ్ బాహ్వో ర్మే బలమస్తు
6. ఓమ్ ఊర్వోర్మ ఓజో ऽస్తు
7. ఓమ్ అరిష్టాని మే ऽజ్గాని తనూస్తన్వా మే సహసంతు

యజ్ఞోపవీతము యజమానుని చేతికిచ్చి

ఓమ్ యజ్ఞోపవీతం పరమం పవిత్రం
ప్రజాపతేర్యత్ సహజం పురస్తాత్,
అయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః,

అని మెడలో వేసి కుడిచేతి క్రిందికి తీయవలయును. తరువాత పై ఆచమన అంగస్పర్శ మంత్రములతో ఆచమనాదులు చేయింపవలయును.

ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనా మంత్రములు

(ప్రతి మంత్రమునకు ముందు ఓమ్ పలుకవలయును)

ఓమ్ విశ్వాని దేవ సవితర్దురితాని పరాసువ! యద్భద్రన్తన్న ఆసువ ॥1॥ యజుః. అ. 30. మం. 3.

హిరణ్యాగర్భః సమవర్త తాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్ స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ ॥2॥ యజుః. అ. 13. మం. 4॥

య ఆత్మదా బలదా యస్య విశ్వఉపాసతే ప్రశిషం యస్య దేవాః ౹ యస్యచ్ఛాయామృతం యస్య మృత్యుః కస్మై దేవాయ హవిషా విధేమ. ॥3॥ యజుః. అ. 25. మం. 13.

యః ప్రాణతో నిమిషతో మహిత్వైక ఇద్రాజా జగతో బభూవ। య ఈశే అస్య ద్విపద శ్చతుష్పదః కస్మై దేవాయ హవిషా విధేమ ॥4॥ యజుః. అ. 23. మం. 3.

యేన ద్యౌరుగ్రా పృథివీ చ దృఢా యేన స్వః స్తభితం యేన నాకః॥ యో అన్తరిక్షే రజసో విమానః కస్మై దేవాయ హవిషా విధేమ ॥5॥ యజుః. అ. 32. మం. 6.

ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా బభూవ । యత్కామాస్తే జుహమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్ ॥6॥ ఋ. మం. 10.సూ 120. మం. 10.

స నో బంధుర్జనితా స విధాతా ధామాని వేద భువనాని విశ్వా యత్ర దేవా అమృత మానశానా స్తృతీయే ధామన్నధ్యైరయన్త ॥7॥ యజుః. అ. 32. మం. 10.

అగ్నే నయ సుపథా రాయే అస్మాన్ విశ్వాని దేవ వయునాని విద్వాన్ । యుయోధ్యస్మ జ్జుహురాణమేనో భూయుష్ఠాన్తేనమ ఉక్తిం విధేమ ॥8॥ యజు. అ. 40. మం. 16.

......

# అథ స్వస్తివాచనమ్

ఓం అగ్నిమీళే పురోహితం యజ్ఞస్య దేవ మృత్విజం। హోతారం రత్నధాతమమ్ ॥1॥ స నః పితేవ సూనవేఽ గ్నే సూపాయనో భవ । స చ స్వానః స్వస్తయే ॥2॥ ఋగ్వేద. మం. 1. సూ. 1. మ. 19. స్వస్తినో మిమీతా మశ్వినా భగః స్వస్తి దేవ్యదితి రనర్వణః । స్వస్తి పూష అసురో దధాతు నః స్వస్తి ద్యావా పృథివీ సుచేతునా ॥3॥ స్వస్తయే వాయు ముప బ్రవామహై సోమం స్వస్తి భువనస్య యస్పతిః । బృహస్పతిం సర్వగణం స్వస్తయే స్వస్తయ ఆదిత్యాసో భవన్తు నః ॥4॥ విశ్వే దేవా నో అద్యా స్వస్తయే వైశ్వానరో వసురగ్నిః స్వస్తయే । దేవా అవన్త్వృభవః స్వస్తయే స్వస్తి నో రుద్రః పాత్వంహసః ॥5॥ స్వస్తి మిత్రా వరుణా స్వస్తి పథ్యే రేవతి । స్వస్తి న ఇన్ద్రశ్చాగ్ని శ్చ స్వస్తినో అదితే కృధి ॥6॥ స్వస్తి పన్థా మనుచరేమ సూర్యాచంద్రమసా వివ । పునర్దదతాఘ్నతా జానతా సంగ మేమహి ॥7॥ ఋ. మండ. 5. సూ. 51.

యే దేవానాం యజ్ఞియా యజ్ఞియానాం మనోర్యజత్రా అమృతా ఋతజ్ఞాః। తే నో రాసన్తా మురుగాయ మద్య యూయం పాత స్వస్తిభిః సదా నః ॥8॥ ఋ. మం. 8. అ. 3. సూ. 35.

యేభ్యో మాతా మధుమత్పిన్వతే పయః పీయూషం ద్యౌ రదితిరద్రి బర్హాః। ఉక్థశుష్మాన్ వృషభ రాన్త్స్వప్నసస్తాం ఆదిత్యాం అనుమదా స్వస్తయే ॥9॥ నృచక్షసో అనిమిషన్తో అర్హణా బృహద్దేవాసో అమృతత్వ మానశుః జ్యోతీరథా అహిమాయా అనాగసో దివో వర్ష్మాణం వసతే స్వస్తయే ॥10॥ సమ్రాజో యే సువృధో యజ్ఞమాయయు రపరిహ్వృతా దధిరే దివి క్షయమ్ । తాం ఆవివాస నమసా సువృక్తిభి ర్మహో ఆదిత్యాం అదితిం స్వస్తయే ॥11॥ కో వః స్తోమం రాధతి యం జుజోషథ విశ్వే దేవాసో మనుషో

యతిష్ఠన । కోహోధ్వరం తు విజాతా అరం కర ద్యోనః పర్షదత్యంహః స్వస్తయే ॥12॥ యేభ్యో హోత్రాం ప్రథమామాయేజే మనుః సమిద్ధాగ్ని ర్మనసా సప్తహోతృభిః । త ఆదిత్యా అభయం శర్మ యచ్ఛత సుగానః కర్త సుపథా స్వస్తయే ॥13॥ య ఈశిరే భువనస్య ప్రచేతసో విశ్వస్య స్థాతుర్జగతశ్చ మన్తవః । తే నః కృతాదకృతాదేన సస్పర్యద్యా దేవాసః పిపృతా స్వస్తయే ॥14॥ భరేష్విన్ద్రం సుహవం హవామహేం౽ం హోముచం సుకృతం దైవ్యం జనమ్ । అగ్నిం మిత్రం వరుణం సాతయే భగం ద్యావా పృథివీ మరుతః స్వస్తయే ॥16॥ విశ్వే యజత్రా అధి వోచతోతయే త్రాయధ్వం నో దురేవాయా అభిహ్రుతః । సత్యయా వో దేవహూత్యా హువేమ శృణ్వతో దేవా అవసే స్వస్తయే ॥17॥ అపామీవామప విశ్వామనాహుతి మపారాతిం దుర్విదత్రా మఘాయతః । ఆరే దేవా ద్వేషోఅస్మద్యుయోతనోరుణః శర్మయచ్ఛతా స్వస్తయే ॥18॥ అరిష్టః సమర్తో విశ్వ ఏధతే ప్ర ప్రజాభిర్జాయతే ధర్మణ స్పరి । యమాదిత్యాసో నయథా సునీతిభి రతి విశ్వాని దురితా స్వస్తయే ॥19॥ యం దేవాసోవథ వాజసాతౌ యం శూరసాతా మరుతో హితే ధనే । ప్రాతర్యావాణం రథమిన్ద్ర సానసి మరిష్యన్త మారుహేమా స్వస్తయే ॥ ॥ స్వస్తి నః పథ్యాసు ధన్వసు స్వస్త్యప్సు వృజనే స్వర్వతి । స్వస్తి నః పుత్రకృథేషు యోనిషు స్వస్తి రాయే మరుతో దధాతన ॥21॥ స్వస్తి రిద్ధి ప్రపథే శ్రేష్ఠా రేక్ణస్వస్త్యభియా వామ మేతి। సానో అమాసో అరణే నిపాతు స్వావేశా భవతు దేవగోపా ॥22॥ ఋ. మం. 10. సు. 63.

ఇషే త్వోర్జేత్వా వాయవ స్థ దేవో వః సవితా ప్రార్పయతు శ్రేష్ఠతమాయ కర్మణ ఆప్యాయధ్వమఘ్న్యా ఇంద్రాయ భాగం ప్రజావతీరనమీవా అయక్ష్మా మావస్తేన ఈశత, మాఘశంగ్సో ధ్రువా అస్మిన్ గోపతౌ స్యాత బహ్వీ ర్యజమానస్య పశూన్ పాహి ॥23॥ యజు. అ. 1. మం. 1.

ఆనో భద్రాః క్రతవో యంతు విశ్వతోఽదబ్ధాసో అపరీతాస ఉద్భిదః । దేవా నో యథా సదమిద్వృధే అసన్నప్రాయువో రక్షితారో దివే దివే ॥24॥ దేవానాం భద్రా సుమతి ర్ఋజూయతాం దేవానాగ్ం రాతిరభి నో నివర్తతామ్ । దేవానాగ్ం సఖ్యముపసేదిమా వయం దేవా న ఆయుః ప్రతిరంతు జీవసే ॥25॥ తమీశానం జగతస్తస్థుషస్పతిం ధియం జిన్వమవసే హూమహే వయమ్ । పూషా నో యథా వేదసా మసద్వృధే రక్షితా పాయు రదబ్ధః స్వస్తయే ॥26॥ స్వస్తిన ఇంద్రో వృద్ధశ్రవాః స్వస్తినః పూషా విశ్వ వేదాః । స్వస్తిన స్తార్క్ష్యో అరిష్టనేమిః స్వస్తినో బృహస్పతి ర్దధాతు ॥27॥ భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రం పశ్యేమాక్షభి ర్యజత్రాః । స్థిరైరంగై స్తుష్టువాగ్ం సస్తనూభి ర్వ్యశేమహి దేవ హితం యదాయుః ॥28॥ యజు. అ. 25 మం. 14, 15,18, 19, ॥21॥

అగ్న ఆ యాహి వీతయే గృణానో హవ్యదాతయే । నిహోతా సత్సి బర్హిషి॥29॥ త్వ మగ్నే యజ్ఞానాం హోతా విశ్వేషాం హితః । దేవేభి ర్మానుషే జనే ॥30॥ సామ ఛంద - ఆ ప్రపా. 1 మం. 1-2.

యే త్రిషప్తాః పరియన్తి విశ్వారూపాణి బిభ్రతః । వాచస్పతి ర్బలా తేషాం తన్వో అద్య దధాతు మే ॥31॥ అథర్వ. కాం. 1 అను. సూ 1 మం. 1.

ఇతి స్వస్తివాచనమ్

# అథ శాన్తికరణమ్

ఓమ్ శన్న ఇన్ద్రాగ్నీ భవతామవోభిః శన్న ఇన్ద్రా వరుణా రాతహవ్యా। శమిన్ద్రా సోమా సువితాయ శంయోః శన్న ఇన్ద్రా పూషణా వాజసాతౌ ॥1॥ శన్నో భగః శము నః శంసో అస్తుశన్నః పురంధిః శము సంతు రాయః। శన్నః సత్యస్య సుయమస్య శంసః శన్నో అర్యమా పురుజాతో అస్తు ॥2॥ శన్నో ధాతా శము ధర్తా నో అస్తు శన్న ఉరూచీ భవతుస్వధాభిః శం రోదసీ బృహతీ శం నో అద్రిః శంనో దేవానాం సుహవాని సంతు ॥3॥ శన్నో అగ్ని ర్జ్యోతిరనీకో అస్తు శన్నో మిత్రావరుణా వశ్వినా శమ్। శన్నః సుకృతాం సుకృతాని సంతు శన్న ఇషిరో అభివాతు వాతః ॥4॥ శన్నో ద్యావా పృథివీ పూర్వహూతౌ శమంతరిక్షం దృశయే నో అస్తు శం న ఓషధీ ర్వనినో భవన్తు శం నో రజసస్పతి రస్తు జిష్ణుః ॥5॥ శన్న ఇన్ద్రో వసుభి ర్దేవో అస్తు శమాదిత్యేభి ర్వరుణః సుశంసః । శం నో రుద్రో రుద్రేభి ర్జలాషః శం న స్త్వష్టాగ్నాభిరిహ శృణోతు ॥6॥ శం నః సోమో భవతు బ్రహ్మ శం నః శం నో గ్రావాణః శముసస్తు యజ్ఞాః । శం నః స్వరూణాం మితయో భవంతు శం నః ప్రస్వః శం వస్తు వేదిః ॥7॥ శం నః సూర్య ఉరుచక్షా ఉదేతు శం న శ్చతస్రః ప్రదిశో భవంతు। శం నః పర్వతా ధ్రువయో భవంతు శం నః సింధవః శము సన్త్వాపః ॥8॥ శం నో అదితి ర్భవతు వ్రతేభిః శం నో భవంతు మరుతః స్వర్కాః । శం నో విష్ణుః శము పూషా నో అస్తు శం నో భవిత్రం శం వస్తు వాయుః ॥9॥ శం నో దేవః సవితా త్రాయమాణః శం నో భవంతూషసో విభాతీః । శం నః పర్జన్యో భవతు ప్రజాభ్యః శం నః క్షేత్రస్య పతి రస్తు శంభుః ॥10॥ శం నో దేవా విశ్వ దేవా భవంతు శం సరస్వతీ సహధీభి రస్తు । శమభిషాచః శము రాతిషాచః శం నో దివ్యాః పార్థివాః శం నో అప్యాః ॥11॥ శం నః సత్యస్య, పతయో భవంతు శం నో అర్వంత శ్శము సంతు గావః శం న ఋభవ స్సుకృతస్సుహస్తా శ్శం నో భవంతు పితరో హవేషు ॥12॥ శం నోఅజ ఏకపాద్దేవో అస్తు శం నోZ హిర్బుధ్న్య శ్శం సముద్రః। శం నో అపాం న పాత్పేరు రస్తు శం నః పృశ్నిర్భవతు దేవగోపాః ॥13॥ ఋ. మ. 7. సూ. 35 మం. 1-31.

ఇంద్రో విశ్వస్య రాజతి శం నో అస్తు ద్విపదే శం చతుష్పదే ॥14॥ శన్నో వాతః పవతాగ్ం శం న స్తపతు సూర్యః । శం నః కనిక్రతద్దేవః పర్జన్యో అభి వర్షతు ॥15॥ అహాని శం భవంతు న శ్శగ్ం రాత్రీః ప్రతిధీయతాన్నః । శం న ఇంద్రాగ్నీ భవతా మవోభి శ్శం న ఇంద్రావరుణా రాతహవ్యా । శం న ఇంద్రాపూషణా వాజసాతౌ శమింద్రా సోమా సువితాయ శంయోః ॥16॥ శం నో దేవీ రభిష్టయ ఆపో భవంతు పీతయే । శంయో రభిస్రవంతు నః ॥17॥ ద్యౌ శ్శాంతిరంతరిక్షగ్ం శాంతిః పృథివీ శాంతిరాప శ్శాంతి రోషధయః శాంతిః । వనస్పతయ శ్శాంతిర్విశ్వేదేవాః శాంతిర్బ్రహ్మ శాంతిః సర్వగ్ం శాంతిః శాంతిరేవ శాంతి స్సామా శాంతిరేధి ॥18॥ తచ్చక్షుర్దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్ । పశ్యేమ శరద శ్శతం జీవేమ శరద శ్శతగ్ం శృణుయామ శరద శ్శతం ప్రబ్రవామ శరద శ్శతమదీనా స్స్యామ శరద శ్శతం భూయశ్చ శరద శ్శతాత్ ॥19॥ యజు. అ. 36. మం. 8, 10, 11, 12, 17, 42.

యజ్జాగ్రతో దూరముదైతి దైవం తదు సుప్తస్య తథైవైతి । దూరంగమం జ్యోతిషాం జ్యోతి రేకం తన్మే మనః శివసంకల్పమస్తు ॥20॥ యేన కర్మాణ్యపసో మనీషిణో యజ్ఞే కృణ్వంతి విదథేషు ధీరాః । యదపూర్వం యక్షమన్తః ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥21॥ యత్ప్రజ్ఞానముత చేతో ధృతిశ్చ యజ్జ్యోతిరంత రమృతం ప్రజాసు । యస్మాన్న ఋతే కించన కర్మక్రియతే తన్మే మనః శివసంకల్ప మస్తు ॥22॥ యేనేదం భూతం భువనం భవిష్య త్పరిగృహీత మమృతేన సర్వమ్। యేన యజ్ఞ స్తాయతే సప్తహోతా తన్మే మనః శివసంకల్పమస్తు ॥23॥ యస్మి న్నృచః సామ యజూగ్ంషి యస్మిన్ ప్రతిష్ఠితా రథనాభావివారాః । యస్మిం శ్చిత్తగ్ం సర్వమోతం ప్రజానాం తన్మే మనః శివసంకల్పమస్తు ॥24॥ సుషారథి రశ్వానివ యన్మనుష్యాన్నేనీయ తేభీషుభి ర్వాజిన ఇవ । హృత్ప్రతిష్ఠం యదజరం జవిష్ఠం తన్మే మనః శివసంకల్పమస్తు ॥25॥ యజు. అ. 34. మం. 1-6.

స నః పవస్వ శం గవే శం జనాయ శమర్వతే । శం రాజన్నోషధీభ్యః ॥26॥ సామ. ఉత్తరార్చికే ప్రపా. 1. మం. 1.

అభయం నః కరత్యంతరిక్ష మభయం ద్యావాపృథివీ ఉభే ఇమే । అభయం పశ్చా దభయం పురస్తా దుత్తరా దధరా దభయం నో అస్తు ॥27॥ అభయం మిత్రా దభయ మమిత్రా దభయం జ్ఞాతా దభయం పరోక్షాత్ అభయం నక్త మభయం దివా నః సర్వా ఆశా మమ మిత్రం భవంతు ॥28॥ అథర్వ. కా. 19. సూ. 15. మం. 5-6.

ఇతి శాంతికరణమ్

# సామాన్య యజ్ఞ విధానము

యజ్ఞ వేదికయందు, నేయి, హవన సామగ్రి, సమిధలు, ఆచమనాదుల కావశ్యకములగు పాత్రలు సమాయత్త పఱపవలయును. విశేషాహుతులకు గాను మెత్తగా వండిన అన్నము కొంచెము ఒక కంచు గిన్నెలో కాని, వెండి గిన్నెలో కాని ఉంచి దానియందు నేయి, పాలు, పంచదార పోసి కలిపి పలచని రసముగా జేసి యుంచుకొనవలయును.

తరువాత శుద్ధ వస్త్రములను ధరించి (భార్యా భర్తలు యజ్ఞ కుండమునకు పూర్వదిశలో పశ్చిమాభిముఖులై ఆసనములపై కూర్చుండ వలయును. ఉత్తరమున దక్షిణాభిముఖముగానో లేక దక్షిణమున ఉత్తరాభిముఖముగానో ఇష్టానుసారము గూర్చుండనగును, అని సంస్కార విధిలోనున్నది.) కాని, భార్యా భర్తలు పశ్చిమమున పూర్వాభిముఖులై కాని దక్షిణమున నుత్తరాభి ముఖులై కాని కూర్చుండుట ఉచితము.

తరువాత సంకల్ప పూర్వకముగ పురోహితుని వరణము, ఓం అమృతోపస్తరణమసి మొదలగు వానితో ఆచమనము, ఓం వాఙ్మే ఆస్యే అస్తు మొదలగువానితో అంగస్పర్శము మొదలైనవి పూర్తిచేసి యీ క్రింది మంత్రములతో అగ్న్యాధానము చేయవలయును.

1. ఓమ్ భూర్భువః స్వః –అగ్నిని వెలిగించునది. (కర్పూరాదులతో)
2. ఓమ్ భూర్ భువః స్వః ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా తస్యాస్తే పృథివి దేవయజని పృష్ఠేఽగ్ని మన్నాద మన్నాద్యాయాదధే" అని అగ్నిని కుండ మున నుంచవలయును.
3. ఓమ్ ఉద్బుధ్యస్వాగ్నే ప్రతి జాగృహి త్వమిష్టా పూర్తే సగం సృజేథామయం చ, అస్మిన్ త్సధస్థే అధ్యుత్త రస్మిన్ విశ్వేదేవా యజమానశ్చ సీదత" అను నీ మంత్రము జదివి కొంచెము నేయివేసి అగ్నిని ప్రజ్వలింప జేయునది.
4. క్రింది మంత్రములతో–సమిధాధానము :

(1) ఓమ్ అయన్త ఇధ్మ ఆత్మా జాతవేద స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్ ప్రజయా పశుభిర్ బ్రహ్మ వర్చసే నాన్నాద్యేన సమేధయ

స్వాహా" ఇదమగ్నయే జాతవేదసే ఇద న్న మమ అని పఠించి ఒక సమిధను నేతిలో ముంచి అగ్నికుండమున నుంచునది.

(2) ఓమ్ సమిధా ఽ గ్నిం దువస్యత ఘృతైర్ బోధయతాతిథిమ్, ఆస్మిన్‌హవ్యా జుహోతన............................................................
ఓమ్ సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం జుహోతన, అగ్నయే జాతవేదసే స్వాహా" ఇదమగ్నయే జాతవేదసే ఇదన్న మమ-అను నీ రెండు మంత్రములు చదివి రెండవ సమిధను అగ్ని కుండమున నుంచునది.

(3) ఓమ్ తన్త్వా సమిద్భి రంగిరో ఘృతేన వర్ధయామసి బృహచ్ఛోచా యవిష్ఠ్య స్వాహా । ఇద మగ్నయే అంగిరసే ఇదన్న మమ అను మంత్రముతో మూడవ సమిధను యజ్ఞకుండమున నుంచునది.

తదుపరి :- ఓమ్ అయన్త ఇధ్మ ఆత్మా జాత వేద స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్, ప్రజయా పశుభిర్ బ్రహ్మ వర్చసే నాన్నా ద్యేన సమేధయ స్వాహా। ఇదమగ్నయే జాతవేదసే ఇదన్నమమ అను మంత్రమును పఠించుచు నైదు పర్యాయము లైదు ఘృతా హుతుల నిచ్చి యగ్నిని ప్రజ్వలింపజేయునది.

జలప్రసేచనము :-

యజమానుడు తన కుడిచేతిలో జలపాత్రను తీసికొని క్రింది మంత్రములను పఠించుచు యజ్ఞకుండమునకు నలువైపుల నీరు ధారగా పోయవలయును.

1. ఓమ్ అదితేఽనుమన్యస్వ – అని కుండమునకు తూర్పున దక్షిణమునుండి ఉత్తరమునకు నీరు పోయునది.

2. ఓమ్ అనుమతేఽనుమన్యస్వ – అని కుండమున పశ్చిమ భాగమున దక్షిణమునుండి ఉత్తరమునకు నీరు పోయునది.

3. ఓమ్ సరస్వత్యనుమన్యస్వ – అని కుండమునకు ఉత్తరమున పశ్చిమమునుండి తూర్పునకు నీరు పోయునది.

4. ఓమ్ దేవ సవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ, దివ్యో గంధర్వః కేతపూః కేతన్నః పునాతు, వాచ స్పతిర్ వాచంనః స్వదతు అని కుండమునకు దక్షిణమున తూర్పునుండి పశ్చిమమునకు నీరుపోసి కుండమునకు చుట్టును నీరుపోయునది.

తరువాత – ఆఘారా వాజ్య భాగాహుతులు.

ఈ క్రింది మంత్రములతో నేతి యాహుతు లిచ్చునది

ఓమ్ అగ్నయే స్వాహా – ఇదమగ్నయ ఇదం న మమ (ఉత్తరమున)
ఓమ్ సోమాయ స్వాహా – ఇదం సోమాయ ఇదం న మమ (దక్షిణమున)
ఓమ్ ప్రజాపతయే స్వాహా – ఇదం ప్రజాపతయ ఇదం న మమ (మధ్యలో)
ఓమ్ ఇంద్రాయ స్వాహా – ఇద మింద్రాయ ఇదం న మమ (మధ్యలో)

వ్యాహృత్యాహుతులు – నేతితో

ఓమ్ భూరగ్నయే స్వాహా – ఇదమగ్నయ ఇదం న మమ
ఓమ్ భువర్వాయవే స్వాహా – ఇదం వాయవ ఇదం న మమ
ఓమ్ స్వరాదిత్యాయ స్వాహా – ఇద మాదిత్యాయ ఇదం న మమ
ఓమ్ భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా
ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ–

స్విష్టకృత్ – ఆహుతి (ఘృతము, తీపిపదార్థము)

ఓమ్ యదస్య కర్మణో z త్యరీరిచమ్ యద్వా న్యూన మిహాకరమ్
అగ్నిష్ట త్స్విష్టకృ ద్విద్యాత్సర్వం స్విష్టం సుహుతం కరోతు మే
అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానామ్
సమర్ధయిత్రే, సర్వాన్నః కామాన్ త్సమర్ధయ స్వాహా-
ఇది మగ్నయే స్విష్టకృతే ఇదం న మమ.

## ప్రధానహోమాహుతులు -

ఈ క్రింది మంత్రములు చదువుచు భర్త నేతిని ఆహుతిగా నిచ్చునది. భార్య హవన సామగ్రి అగ్నిలో నుంచవలెను

1. ఓమ్ భూర్భువః స్వః అగ్న ఆయూంషి పవస ఆసువోర్జ
   మిషం చ నః ఆరేబాధస్వదుచ్ఛునాం స్వాహా
   ఇద మగ్నయే పవమానాయ ఇదం న మమ
2. ఓమ్ భూర్భువః స్వః అగ్నిర్ ఋషిః పవమానః
   పాంచజన్యః పురోహితః తమీమహే మహాగయం స్వాహా
   ఇద మగ్నయే పవమానాయ ఇదం న మమ.
3. ఓమ్ భూర్భువః స్వః అగ్నే పవస్వ స్వపా అస్మే వర్చ
   స్సు వీర్యం దధద్రయిం మయి పోషం స్వాహా
   ఇద మగ్నయే పవమానాయ ఇదం న మమ.
4. ఓమ్ భూర్భువః స్వః ప్రజాపతే న త్వ దేతాన్యన్యో
   విశ్వాజాతాని పరితా బభూవ, యత్కామాస్తే
   జుహుమస్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణామ్ స్వాహా॥
   ఇదం ప్రజాపతయ ఇదం న మమ.

తదుపరి అష్టాజ్యాహుతులు– ఈ ఆహుతులను ఆయా సంస్కారము లలో తగుచోట్ల నిచ్చునది.

క్రింది మంత్రములతో నేతితో ఆహుతులిచ్చునది.

1. ఓం త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేడోz వ
   యాసిసీష్ఠాః యజిష్ఠో వహ్నితమః శోశుచానో
   విశ్వాద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా
   ఇద మగ్నీ వరుణాభ్యాం ఇద న్న మమ.
2. ఓం సత్వన్నో అగ్నేz వమో భవోతీ నేదిష్ఠో అస్యా
   ఉషసో వ్యుష్టౌ, అవయక్ష్వ నో వరుణం రరాణో
   వీహి మృళీకం సుహవో న ఏధి స్వాహా
   ఇద మగ్నీ వరుణాభ్యాం ఇదం న మమ.

3. ఓం ఇమం మే వరుణ శ్రుధీహవమద్యా చ మృడయ,
త్వామవస్యురాచకే స్వాహా
ఇదం వరుణాయ ఇదం న మమ.

4. ఓం తత్త్వా యామి బ్రహ్మణా వందమాన స్తదా
శాస్తే యజమానో హవిర్భిః, అహేళమానో
వరుణేహ బోధ్యు రుశగ్ంసమాన ఆయుః, ప్రమోషీః స్వాహా
ఇదం వరుణాయ ఇదం న మమ.

5. ఓం యేతే శతం వరుణ, యే సహస్రం యజ్ఞియాః
పాశా వితతా మహాన్తః, తేభిర్ నో అద్య సవితోత
విష్ణుర్ విశ్వే ముంచంతు మరుతః స్వర్కాః స్వాహా
ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో దేవేభ్యో
మరుద్భ్యః స్వర్కేభ్య ఇదం న మమ.

6. ఓం అయాశ్చాగ్నే z స్యనభిశస్తి పాశ్చ సత్యమిత్వ
మయాసి, అయానో యజ్ఞం వహాస్యయానోధేహి భేషజగ్ం స్వాహా
ఇదమగ్నయే అయసే ఇదం న మమ

7. ఓం ఉదుత్తమం వరుణ పాశమస్మదవాధమం
విమధ్యమం శ్రథాయ, అథావయ మాదిత్య
వ్రతే తవానాగసో అదితయే స్యామ స్వాహా
ఇదం వరుణా యాదిత్యా యాదితయే చ ఇదం న మమ.

8. ఓం భవతన్నః సమనసౌ సచేత సావరేపసౌ, మా యజ్ఞగ్ం
హిగ్ంసిష్టం మా యజ్ఞపతిం జాతవేదసౌ
శివౌ భవత మద్య నః స్వాహా.
ఇదం జాతవేదోభ్యాం ఇదం న మమ.

..........

# గర్భాధాన సంస్కారము

(గర్భాధానవిధి)

"నిషేకాది స్మశానాంతో మంత్రైర్ యస్యోదితో విధిః"

(మను. అ 2. శ్లో. 16)

అర్థము : మనుష్యుల శరీరము, ఆత్మయు ఉత్తమము లగుటకు గర్భాధానము మొదలు అంత్యేష్టి వఱకు గల 16 సంస్కారములు విధి పూర్వకముగ చేయవలెను. (ఆసంస్కారములు చేయు (విధి) పద్ధతి మంత్రముల ద్వారమున జెప్పబడినది. స్మశానాంతము = అంత్యేష్టి– మరణానంతరము మృతదేహము - శవమునకు జేయు సంస్కారము)

గర్భాధానముతో శరీర మారంభమగును. శరీరాంతము భస్మము చేయుటవలన నగును. శరీరమేర్పడి యది యంతమగు వఱకు దానికి పదునాఱు ఉత్తమ సంస్కారములు చేయవలయును.

గర్భాశయమున వీర్యము స్థిరము సేయు విధానమునకు గర్భాధానమని పేరు - "గర్భస్యాధానం వీర్య స్థాపనం స్థిరీకరణం

యస్మిన్ యేన వా కర్మణా తద్ గర్భాధానమ్."

బీజము - విత్తనము క్షేత్రము రెండును ఉత్తమములైనపుడు అన్నాదులు - ధాన్యములు ఉత్తమములగును. అట్లే ఉత్తములు, బలవంతులునగు స్త్రీపురుషుల వలన నేర్పడు సంతానము కూడ నుత్తమ మగును. కావున ప్రథమమున బాలబాలికలు యువావస్థ వచ్చువఱకు తగిన విధమున బ్రహ్మచర్యమును బాలించుచు విద్యాభ్యాసము చేయవలయును. బాలిక తక్కువలో తక్కువ (16) పదునాఱు సంవత్సరముల వఱకు, బాలుడు (25) ఇరువది యైదు వర్షముల వఱకును బ్రహ్మచర్యమును బాలింపవలయును. ఇంతకంటెను ఎక్కువ కాలము బ్రహ్మచర్యమును పాలించిన నెక్కువ మేలు కలుగును. కనీసము బాలికకు 16

పదునాజేండ్లు అయినను రాకున్న ఆమె గర్భాశయమున సంతానము చక్కగా పెరుగుట కవకాశముండదు. గర్భమును ధరించుటకు గాని, పోషించుటకు గాని ఆమెకు సామర్థ్యము కలుగదు. బాలునకు 25 ఇరువదియైదేండ్లు అయిన నిండవిద్దే ఉత్తమ వీర్యమతనిలో నేర్పడదు. ఇందులకు ప్రమాణము.

"పంచవింశే తతో పుమాన్, నారీ తు షోడశే
సమత్వాగత వీర్యా తౌ జానీయాత్ కుశలో భిషక్."
(సుశ్రుతే సూత్రస్థానే. అ. 35) 1

"ఊనషోడశ వర్షాయామ్ అప్రాప్త: పంచవిశతిమ్
యధాధత్తే పుమాన్ గర్భం కుక్షిస్థ: స విపద్యతే" 2

"జాతో వా న చిరం జీవే జ్జీవేద్వా దుర్బలేంద్రియ:
తస్మా దత్యంత బాలాయాం గర్భాధానం న కారయేత్" 3
(సుశ్రుతే శరీరస్థానే అ. 10)

ఇవియన్నియు సుశ్రుత శ్లోకములు. శరీరము యొక్క యున్నతికి, యువనతికి సంబంధించిన విధి వైద్యక శాస్త్రమున జెప్పబడినట్లు మఱి యెక్కడను జూడము. దీనికి సంబంధించిన మూల విధానము ముందు వేదారంభమున వ్రాయబడును. ఏ సంవత్సరమున నేయేధాతువు లెట్లు వృద్ధిక్షయములు శరీరమున బొందునో యవి యన్నియు వైద్యక శాస్త్రమున వివరింపబడి యున్నవి. కావున గర్భాధానాది సంస్కారములను జేయుటలో వైద్యక శాస్త్రము ననుసరించుట మిక్కిలి శ్రేష్ఠము.

విద్వాంసులెల్లరు ప్రమాణముగ నంగీకరించు పరమ వైద్యుడు సుశ్రుత గ్రంథకర్త. వివాహ గర్భాధానములకు కన్యకు (16) పదునాఱేండ్లు, యువకునకు (25) ఇరువదియైదేండ్లు కనీసపు వయస్సు తప్పక ఉండవలయు ననుచున్నాడు.

ఇరువదియైదేండ్ల (25) వయస్సుగల యువకుని శరీరమున నెంత సామర్థ్యముండునో పదునాఱేండ్ల వయస్సు గల కన్య శరీరమున నంతటి సామర్థ్యముండును. కావున వైద్యులు వారి నిరువురను సమ వీర్యులు - సమాన సామర్థ్యము గల వారినిగా నెంచుచున్నారు. (1)

పదునాఱేండ్లకంటె తక్కువ వయస్సు గల స్త్రీ యందు, ఇరువదియైదేండ్ల కంటె తక్కువ వయస్సు గల పురుషుడు గర్భాధానము చేసినచో నాగర్భము గర్భాశయముననే చెడిపోవును. (2)

అట్టియెడ సంతానము కలిగినను ఎక్కువ కాలము జీవింపదు. ఒకవేళ జీవించినను ఆ సంతానము శరీరేంద్రియములు దుర్బలములై యుండును. కావున మిక్కిలి చిన్న వయస్సుగల - పదునాఱేండ్లయిన నిండని స్థితిలో స్త్రీకి గర్భాధానము జరుగరాదు. (3)

"చతస్రోఽవస్థాః శరీరస్య వృద్ధిర్ యౌవనం సంపూర్ణతా కించిత్ పరిహాణి శ్చేతి. ఆషోడశాత్ వృద్ధి రాచతుర్వింశతేర్ యౌవన మాచత్వా రింశతః సంపూర్ణతా, తతః కించిత్ పరిహాణి శ్చేతి".

అర్థము : మనుష్య శరీరమున పదునాఱేండ్లకు తదుపరి సర్వధాతువులు వృద్ధిపొందును. ఇరువదియైదు నుండి యువావస్థ ప్రారంభించును. నలువది (40) యవయేట యువావస్థ పూర్ణతను బొందును - ధాతువు లన్నియు పూర్తిగా బలపడును. తదుపరి ధాతువు - వీర్యమునకు కొంచెము కొంచెము హానికలుగును. నలువది (40) యేండ్లకు అవయవములన్నియు పూర్తిగా పెరుగును. తదుపరి అన్నపానాదుల వలన నేర్పడు ధాతువు వీర్యము కొంచెము క్షీణింప నారంభించును.

కావున నెవరేని త్వరగా వివాహము చేసికొన దలచినచో కన్యకు (16) పదునాఱు, వరునకు (25) ఇరువదియైదు సంవత్సరములు తప్పక యుండునట్లు చూడవలయును. అంతకు తక్కువ వయస్సుగల వారు వివాహమాడరాదని భావము. ఇక మధ్యమ సమయమున కన్యకు (20) ఇరువది యేండ్ల వయస్సుండ వలయును. ఉత్తమ సమయము కన్యకు (24) ఇరువదినాల్గు పురుషునకు (48) నలుబదియెనిమి దేండ్లు ఉండవలయును.

తమ వంశము శ్రేష్ఠతను, తమ సంతానము దీర్ఘాయువును సుశీలత, ఉత్తమబుద్ధి, బలపరాక్రమములు కలిగి యుండుటను గోరు వారు పదునాఱు సంవత్సరములు కన్యకు, ఇరువదియైదు వర్షములు బాలునకు రాకముందెన్నడును వివాహము చేయరాదు. ఇదియే సంస్కారములకు సంస్కారము, ఎల్ల సౌభాగ్యములకు

సౌభాగ్యము. ఉన్నతులకు నున్నతి నొనర్చు కర్మగా నెంచునది. ఈ వయస్సులో బ్రహ్మచర్యపాలనము, విద్యాభ్యాసము చేయించి సుశిక్షితుల జేయవలయును. అందువలన నుత్తమ సంతాన మేర్పడును.

## ఋతుదానకాలము

"ఋతుకాలాభిగామీ స్యాత్ స్వదారనిరతః సదా,
పర్వ వర్జం వ్రజేచ్చైనాం తద్వ్రతో రతి కామ్యయా" 1

"ఋతుః స్వాభావికః స్త్రీణాం రాత్రయః షోడశ స్మృతాః,
చతుర్భి రితరైః సార్థ మహోభిః సద్విగర్హితైః !" 2

"తాసా మాద్యాశ్చతస్రస్తు నిందితైకాదశీ చ యా
త్రయోదశీ చ శేషా స్తు ప్రశస్తా దశరాత్రయః !" 3

"యుగ్మాసు పుత్రా జాయన్తే స్త్రియోఽయుగ్మాసు రాత్రిషు
తస్మా ద్యుగ్మాసు పుత్రార్థీ సంవిశే దార్తవే స్త్రియామ్" 4

"పుమాన్ పుంసోఽధికే శుక్రే స్త్రీ భవ త్యధికే స్త్రియాః
సమే పుమాన్ పుంస్త్రియౌ వా క్షీణేఽల్పే చ విపర్యయః" 5

"నింద్యా స్వష్టాసు చాన్యాసు స్త్రియో రాత్రిషు వర్జయన్
బ్రహ్మచార్యేవ భవతి యత్ర తత్రాశ్రమే వసన్" 6

మనుస్మృతి - అ.3

అర్థము : మన్వాది మహర్షులు ఋతుదానమునకు సమయమిట్లు నిశ్చయించిరి. పురుషుడెల్లపుడు ఋతు సమయముననే స్త్రీతో సమాగమము చేయవలయును. తన స్త్రీ కాక యితర స్త్రీలను నెల్లపుడు త్యజింపవలయును. అట్లే స్త్రీ కూడ తన వివాహిత పురుషునితో దక్క ఇతర పురుషులనుండి దూరముగా నుండవలయును. పురుషుడు తన వివాహిత స్త్రీతో ప్రసన్నుడై యుండునట్లు స్త్రీయు నెల్లపుడుతన వివాహిత పతితోప్రసన్నయై యుండి యితర పురుషుల సాంగత్యము చేయరాదు.

పురుషుడు ఋతుదానమునకు తగిన 16 దినములలోను పూర్ణిమ, అమావాస్య, చతుర్దశి, అష్టమి తిథులు వచ్చిన వానిని విడిచి మిగిలిన దినములలోనే స్త్రీ సమాగమము చేయవలయును . (1)

స్త్రీలకు స్వాభావికమైన ఋతుకాలము 16 పదునాఱు రాత్రులే- రజోదర్శనమైన నాటనుండి (16) పదునాఱవ దినము వఱకే ఋతుదాన సమయము. అందునను మొదటి నాలుగు రాత్రులు (రజస్వలయైన దినము మొదలు నాలుగు రోజులు) నిందితములు. ఈ దినములలో స్త్రీ పురుషులు పరస్పరము తాకక యుండవలయును. సంబంధమెన్నడు తగదు. రజస్వలయైన స్త్రీ తాకిన నీరుకూడ తాకరాదు. ఆ స్త్రీ పనిచేయక యొకచోట గూర్చుండుట మంచిది. ఈ నాలుగు రాత్రులలో సమాగమమొనర్చుట వ్యర్థమగుటయే కాక మహారోగమునకు కారణము నగును. రజస్సు అనగా స్త్రీ శరీరమునుండి యొక విధమగు వికృతమైన వేడిరక్తము కురుపు నుండి చీముకాని రక్తముకాని వచ్చునట్లు బయటికి వచ్చును. (2)

మొదటి నాలుగు రాత్రులు నిందితములు - తగనివియైనట్లు పదునొకండవ పదమూడవ రాత్రులు కూడ సమాగమమునకు పనికి రావు. మిగిలిన పదిరాత్రులు ఋతుదానమునకు శ్రేష్ఠములు. (3)

పుత్ర సంతానము గోరువారు ఋతుదానమునకు తగిన రాత్రులలో ఆఱవ, ఎనిమిదవ, పదవ, పంద్రెండవ, పదునాల్గవ, పదునాఱవ రాత్రులలో ఋతుదాన మొనర్చుట యుత్తమము. వీనిలోను పూర్వ పూర్వ రాత్రులు శ్రేష్ఠములని యెఱుగునది - స్త్రీసంతానము నపేక్షించువారు 5, 7, 9, 15వ, నాలుగు రాత్రులు ఉత్తమములుగా నెఱుగునది. దీనింబట్టి పుత్రులను గోరువారు యుగ్మరాత్రులందు స్త్రీ సమాగమము చేయవలయును. (4)

పురుషుని వీర్యమధికమైన పుత్రుడు, స్త్రీ ఆర్తవ మధికమైన బాలిక సమములైన నపుంసవుకుడో వంధ్యయో కలుగును. అల్పవీర్యమైన గర్భమేర్పడకుండుటయో లేక గర్భస్రావమో జరుగును. (5)

పూర్వము చెప్పిన నిందిత రాత్రులు స్త్రీ సాంగత్యమును విడిచిన పురుషుడు గృహస్థాశ్రమమున నుండియు బ్రహ్మచారి యనియే చెప్పబడును. (6)

"ఉపనిషది గర్భలంభనమ్" ఆశ్వ - గృహ్య 1 - 16. 1.

ఇది ఆశ్వలాయన గృహ్య సూత్రవచనము. ఉపనిషత్తునందు 'గర్భస్థాపన విధి' వ్రాసియున్న విధమున నాచరింపవలయును. పూర్వము వర్ణించినట్లు వివాహము చేసికొని, కనీసము పదునాఱవ యేటనో, అధికాధికముగ నిరువదియైదవ యేటనో స్త్రీ వివాహము చేసికొని, ఋతుధానము చేయవలయుననియే యుపనిషత్తు నందును విధానము చూడనగును.

అథ గర్భాధానం స్త్రియాః పుష్పవత్యాశ్చతురహాదూర్ధ్వం స్నాత్వా విరుజాయా స్తస్మి న్నేవ దివా 'ఆదిత్యం గర్భ మితి'

(ఇది పారస్కర గృహ్య సూత్ర వచనము) ఇట్లే గోభిలీయ శౌనక గృహ్య సూత్రములందును విధానమున్నది.

**సంస్కారము జరుపు విధి - విధానము :**

స్త్రీ - కన్య రజస్వలయైన నాల్గవ దినమునకు పిదప ఐదవ దినము స్నానము చేసి రజోరోగ రహితయైయున్న పక్షమున ఆరోజుననే సాయంకాలమున సూర్యు డస్తమింపక పూర్వమే 'ఆదిత్యం గర్భమ్' అనునిట్టి మంత్రములతో యజ్ఞమున విశేషాహుతుల నియ్యవలయును లేక యేరాత్రి గర్భాధానము జరుప నిశ్చయింతురో యానాడు సాయంకాలమున సూర్యాస్తమయము కాకముందే దంపతులచే యజ్ఞకార్యమును నిర్వర్తింప జేయవలెను.

(విశేష ఘృతాహుతులు)

(ఈ క్రింది మంత్రములతో నేతి నాహుతులుగా నిచ్చుచు ఆహుతి శేషమును ఒకటి రెండు బిందువులు ఒక కంచుగిన్నెలో పెట్టి యుంచిన నీళ్లలో వేయుచుండ వలయును. పత్ని హవన సామగ్రి నాహుతులుగా నిచ్చునది.)

మంత్రములు :

1. ఓమ్ అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి బ్రాహ్మణ స్త్వా నాథకామ ఉపధావామి యాస్యాః పాపీ లక్ష్మీస్తనూ స్తామస్యా అపజహి స్వాహా - ఇద మగ్నయ ఇద న్న మమ

2. ఓమ్ వాయో ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి బ్రాహ్మణస్త్వా నాథకామ ఉపధావామి యాస్యాః పాపీ లక్ష్మీ స్తనూస్తామస్యా అపజహి స్వాహా ఇదం వాయవ ఇద న్న మమ.

3. ఓమ్ చంద్ర ప్రాయశ్చిత్తే త్వం ... అపజహి స్వాహా
ఇదం చంద్రాయ ఇద న్న మమ.

4. ఓమ్ సూర్య ప్రాయశ్చిత్తే త్వం ... అపజహి స్వాహా
ఇదం సూర్యాయ ఇద న్న మమ.

5. ఓమ్ అగ్ని వాయు చంద్ర సూర్యాః ప్రాయశ్చిత్తయో యూయం దేవానాం ప్రాయశ్చిత్తయః స్థ బ్రాహ్మణో వో నాథకామ ఉపధావామి యస్యాః పాపీ లక్ష్మీస్తనూస్తా మస్యా అపజహత స్వాహా. ఇద మగ్నివాయు చంద్ర సూర్యేభ్య ఇద న్న మమ.

6. ఓమ్ అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి బ్రాహ్మణ స్త్వానాథకామ ఉపధావామి యాస్యాః పతిఘ్నీ తనూస్తా మస్యా అపజహి స్వాహా ఇదమగ్నయ ఇద న్న మమ.

7. ఓమ్ వాయో ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం వాయవ ఇద న్న మమ.

8. ఓమ్ చంద్ర ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం చంద్రాయ ఇద న్న మమ.

9. ఓమ్ సూర్య ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం సూర్యాయ ఇద న్న మమ.

10. ఓమ్ అగ్ని వాయు చంద్ర సూర్యాః ప్రాయశ్చిత్తయో యూయం దేవానాం ప్రాయశ్చిత్తయః స్థ బ్రాహ్మణో వో నాథకామ ఉపధావామి యాస్యాః పతిఘ్నీతనూస్తా మస్యా అపహత స్వాహా. ఇద మగ్నివాయు చంద్ర సూర్యేభ్యః ఇద న్న మమ.

11. ఓమ్ అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి బ్రాహ్మణ స్త్వా నాథకామ ఉపధావామి యాస్యా అపుత్ర్యా తనూస్తా మస్యా అపజహి స్వాహా ఇదమగ్నయ ఇద న్న మమ.

12. ఓమ్ వాయో ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం వాయవ ఇదం న మమ.

13. ఓమ్ చంద్ర ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం చంద్రాయ ఇద న్న మమ.

14. ఓమ్ సూర్య ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం సూర్యాయ ఇద న్న మమ.

15. ఓమ్ అగ్ని వాయు చంద్ర సూర్యాః ప్రాయశ్చిత్తయో యూయం దేవానాం ప్రాయశ్చిత్తయః స్థ బ్రాహ్మణో వో నాథకామ ఉపధావామి యాస్యా అపుత్రాస్తనూస్తా మస్యా అపహత స్వాహా. ఇద మగ్ని వాయు చంద్ర సూర్యేభ్య ఇద న్న మమ.

16. ఓమ్ అగ్నే ప్రాయశ్చిత్తే త్వం దేవానాం ప్రాయశ్చిత్తి రసి బ్రాహ్మణస్త్వా నాథకామ ఉపధావామి యాస్యా అపసవ్యా తనూస్తా మస్యా అపజహి స్వాహా ఇదమగ్నయ ఇద న్న మమ.

17. ఓమ్ వాయో ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం వాయవ ఇదం న మమ.

18. ఓమ్ చంద్ర ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం చంద్రాయ ఇద న్న మమ.

19. ఓమ్ సూర్య ప్రాయశ్చిత్తే ... అపజహి స్వాహా
ఇదం సూర్యాయ ఇద న్న మమ.

20. ఓమ్ అగ్ని వాయు చంద్ర సూర్యాః ప్రాయశ్చిత్తయో యూయం దేవానాం ప్రాయశ్చిత్తయః స్థ బ్రాహ్మణో వో నాథకామ ఉపధావామి యాస్యా అపసవ్యా తనూస్తా మస్యా అపహత స్వాహా. ఇద మగ్ని వాయు చంద్ర సూర్యేభ్య ఇద న్న మమ.

ఈ యిరువది మంత్రములతో నేతియాహుతు లిచ్చి ప్రతి యాహుతి శేషము ఒకటి రెండు బొట్లు నీటి గిన్నెలో వేయుచుండునది.

(పై మంత్రముల అభిప్రాయము : పదార్థ దోషముల హరించు అగ్ని వాయు చంద్ర సూర్యులలోనున్న పరమేశ్వర! నేను శరణు జొచ్చు చున్నాడ. ఈ కన్య శరీరమున గల పాపపు లక్ష్మి, పతిహింసకత, అపుత్రత్వము, అపసవ్యత, అను శారీరిక దోషములను దొలగింప ననుగ్రహింతువుగాక !)

పిదప ఈక్రింది మంత్రములతో సిద్ధముచేసి యుంచిన అన్నరసము నాహుతులియ్య నగును. ఆహుతి శేషము నీటిగిన్నెలో వదలు చుండవలయును.

1. ఓమ్ అగ్నయే పవమానాయ స్వాహా
ఇద మగ్నయే పవమానాయ ఇద న్న మమ

2. ఓమ్ అగ్నయే పావకాయ స్వాహా
ఇద మగ్నయే పావకాయ ఇద న్న మమ

3. ఓమ్ అగ్నయే శుచయే స్వాహా
ఇద మగ్నయే శుచయ ఇద న్న మమ

4. ఓమ్ ఆదిత్యై స్వాహా
ఇదమాదిత్యై ఇద న్న మమ

5. ఓమ్ ప్రజాపతయే స్వాహా
ఇదం ప్రజాపతయ ఇద న్న మమ

6. ఓమ్ యదస్య కర్మణోஉత్యరీరిచం "యద్వాన్యూనమిహాకరమ్"
అగ్నిష్టత్ స్విష్టకృద్విద్యాత్ సర్వం స్విష్టం సుహుతం కరోతు మే
అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం
కామానాం సమర్థయిత్రే సర్వా న్నః కామాన్ త్సమర్థయ స్వాహా
ఇద మగ్నయే స్విష్టకృతే ఇద న్న మమ

తదుపరి అష్టాజ్యాహుతులు, అన్నాహుతులు మఱియు నీక్రింది మంత్రములతోను నేతి యాహుతులీయనగును. మంత్రములు.

1. "ఓమ్ విష్ణుర్ యోనిం కల్పయతు త్వష్టా రూపాణి పింశతు
ఆసించతు ప్రజాపతి ర్ధాతా గర్భం దధాతు తే స్వాహా"

2. ఓం గర్భం ధేహి సినీవాలి గర్భం ధేహి సరస్వతి
గర్భం తే అశ్వినా దేవావాధత్తాం పుష్కరస్రజా స్వాహా"

3. ఓం హిరణ్మయీ అరణీ యం నిర్మంథతో అశ్వినా
తంతే గర్భం హవామహే దశమే మాసి సూతవే స్వాహా"

ఋ10-మం. 184 సూ

4. ఓం రేతో మూత్రం విజహాతి యోనిం ప్రవిశ దింద్రియమ్, గర్భో జరాయుణావృత ఉల్బం జహాతి జన్మనా, ఋతేన సత్య మింద్రియం విపానగ్ం శుక్రమన్ధస ఇంద్రస్యేంద్రియ మిదం పయోஉమృతం మధు స్వాహా"

5. ఓం యత్తే సుసీమే హృదయం దివి చంద్రమసి శ్రితమ్, వేదాహం తన్మాం తద్విద్యాత్. పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతగ్ం శృణుయామ శరదః శతం ప్రబ్రవామ శరదః శత మదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్ స్వాహా"

6. ఓం యథేయం పృథివీ మహీ భూతానాం గర్భమాదధే ఏవాతే ధ్రియతాం గర్భో అనుసూతుం సవితవే స్వాహా"

7. ఓం యథేయం పృథివీ మహీ దాధారేమాన్ వనస్పతీన్, ఏవాతే ధ్రియతాం గర్భో అనుసూతుం సవితవే స్వాహా"

8. ఓం యథేయం పృథివీ మహీ దాధార పర్వతాన్ గిరీన్, ఏవాతే ధ్రియతాం గర్భో అనుసూతుం సవితవే స్వాహా"

9. ఓం యథేయం పృథివీ మహీ దాధార విష్ఠితం జగత్ ఏవాతే ధ్రియతాం గర్భో అనుసూతుం సవితవే స్వాహా"

తరువాత నీ క్రింది మంత్రములతో నేతి ఆహుతులిచ్చునది.

1. ఓం భూరగ్నయే స్వాహా ఇద మగ్నయ ఇదం న మమ
2. ఓం భువర్ వాయవే స్వాహా ఇదం వాయవ ఇదం న మమ
3. ఓం స్వరాదిత్యాయ స్వాహా ఇద మాదిత్యాయ, ఇద న్న మమ
4. ఓం అగ్ని వాయ్వాదితేభ్యః ప్రాణాపానవ్యానేభ్యః స్వాహా ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్యః ప్రాణాపానవ్యానేభ్యః ఇదం న మమ

ఈరెండు మంత్రములతోను ఆజ్యాహుతుతే ఇయ్యనగును.

1. ఓం అయా స్యగ్నేర్ వషట్కృతం యత్ కర్మణోత్యzరీరిచం దేవా గాతు విదః స్వాహా ఇదందేవేభ్యోగాతువిద్భ్యః ఇద న్న మమ
2. ఓం ప్రజాపతయే స్వాహా ఇదం ప్రజాపతయ ఇద న్న మమ
3. ఓం యదస్య కర్మణోత్యzరీరిచంయద్ వా న్యూన మిహాకరమ్, అగ్నిష్టత్ స్విష్టకృద్ విద్యాత్ సర్వం స్విష్టం సుహుతం కరోతు మే అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమర్ధయిత్రే సర్వా న్నః కామాన్ త్సమర్ధయ స్వాహా - ఇద మగ్నయే స్విష్టకృతే ఇదం న మమ.

తదుపరి నీటి గిన్నెలో వేయబడిన ఆహుతి శేషము నంతటిని ఆహుతులు వేయగా మిగిలిన ఘృతమును తీసికొనిపోయి, వధువు - భార్య దానిని దేహము నంతట రాచుకొని బాగుగా స్నానము చేయవలయును. అనంతరము శుద్ధ వస్త్రముల ధరించి యజ్ఞకుండము సమీపమునకు వచ్చి తన భర్తతోబాటు కుండమునకు ప్రదక్షిణము చేయవలయును. ఆపైన బయటకి వెళ్ళి సూర్యదర్శన మొనరింప వలయును.

అప్పుడు - దర్శన సమయమున వధువు ఈ క్రింది మంత్రములతో పరమేశ్వరుని ఉపస్థానము చేయునది.

1. ఓం ఆదిత్యం గర్భం పయసా సమజ్ఞ
సహస్రస్య ప్రతిమాం విశ్వరూపమ్
పరివృఙ్ధి హరసా మాభిమంస్థాః
శతాయుషం కృణుహి చీయమానః

2. ఓం సూర్యో నో దివస్పాతు వాతో అంతరిక్షాత్
అగ్నిర్ నః పార్థివేభ్యః

3. ఓం జోషా సవిత ర్యస్య తే హరః శతం
సవాం అర్హతి, పాహి నో దిద్యుతః పతన్త్యాః

4. ఓం చక్షుర్ నో దేవః సవితా చక్షు ర్న ఉత పర్వతః
చక్షుర్ ధాతా దధాతు నః

5. ఓం చక్షుర్ నో ధేహి చక్షుషే చక్షుర్విఖ్యై తనూభ్యః
సం చేదం వి చ పశ్యేమ

6. ఓం సుసందృశం త్వా వయం ప్రతిపశ్యేమ సూర్య
వి పశ్యేమ నృచక్షసః

పై మంత్రములతో పరమేశ్వరుని ఉపస్థానమొనర్చి తదుపరి వధువు -

"ఓమ్ - గోత్రా శుభదా అహం భో భవంతమభివాదయామి"

ఈ వాక్యము నుచ్చరించి పతికి నమస్కరింపవలయును - "ఇట భర్తయొక్క గోత్రమును తన గోత్రముగా చెప్పవలయును.

తరువాత భర్తయొక్క తల్లి దండ్రులకు ఇతర బంధువులకు స్త్రీలకు పురుషులకు నిట్లే నమస్కరింపవలయును.

తదుపరివేదిక మీద పతి పత్నులు పూర్వాభిముఖులై ఆసనముపై కూర్చుండి వామ దేవ్యగానము చేయునది.

## వామదేవ్యగానము

ఓమ్ భూర్భువః స్వః। కయా న శ్చిత్ర ఆభువ దూతీ సదావృధః సఖా। కయా శచి ష్ఠయా వృతా ॥1॥ ఓమ్ భూర్భువః స్వః। కస్త్వా సత్యో మదానాం మంహిష్ఠో మత్స దన్ధసః దృఢా బిదారుజే వసు ॥2॥ ఓమ్ భూర్భువః స్వః। అభీషుణః సఖీనామ వితా జరిత్ౄణామ్ । శతం భవా స్యూతయే ॥3॥ మహావామదేవ్యమ్॥ కాz5 యా। నశ్చా 3 యిత్రా 3 ఆభువాత్। ఊ తీ సదావృధః స ఖా। ఔ 3। హో హా యి। కయా 23 శచా యి। ష్ఠయౌహో 3। హుమ్మా 2। వా z2ర్తో 3z5 హాయి ॥1" కాz5 స్త్వా। సత్యో 3 మా 3 దానామ్ ।మా। హిష్ఠోమాత్సా దన్ధ। సా ఔ 3 హో హా యి। దృఢా 23 చిదా। రు జౌహో 3। హుమ్మా 2। వా z2 సో 3z5 హాయి ॥2॥ ఆz5 భీ। షుణా 3: సా 3 ఖీనామ్। ఆ। వితా జరాయిత్ౄణామ్। ఔ 23 హోహాయి। శతా 23 మ్భవా। సియో హో 3 హుమ్మా 2। తాz2 యో 3z5 హాయి ॥3॥ సామ. ఉత్తరార్చికే. అధ్యాయే 1 ఖం 4 మం 1. 2. 3.

తరువాత భోజనాదు లొనర్తురు. పురోహితుడు మున్నగు వారికి భోజనాదులతో తగిన సత్కారము చేయవలయును.

తదుపరి రాత్రి యందు నియత సమయమున భార్యా భర్తలిరువురు ఆరోగ్యవంతులై మిక్కిలి ప్రసన్నులై యున్నప్పుడు గర్భాధాన క్రియ నొనర్తురు. గర్భాధాన సమయము ఒక జాము రాత్రి గడచిన మీదట, ఒకజాము రాత్రి మిగిలియుండగా – అనగా రాత్రి మధ్య రెండుజాముల కాలము – తగినది. వీర్యము గర్భాశయమున ప్రవేశించునపుడు ఇరువురు తమ శరీరములను స్థిరముగా నుంచుకొని ప్రసన్న వదనులై ఒకరి ముఖనాసి కాద్యవయవయములు మఱియొకరి యవయ వముల కెదురుగా నుంచు కొనవలయును. వీర్యము స్త్రీ శరీరమున ప్రవేశించినపుడు స్త్రీ తన మూలేంద్రియమును (గుద) యోనిని పైకి సంకోచింపజేసి వీర్యమును గర్భాశయమున స్థిరపఱచుకొనవలయును. తదుపరి కొంచెము తడవు గడపి స్నానము చేయునది. చలికాలమగు నెడల కుంకుమపువ్వు, కస్తూరి, జాజికాయ, జాపత్రి, ఏలకులు, వేసి కాచి యుంచిన చల్లని పాలను ఇష్టము వచ్చినట్లు త్రాగి భార్యా భర్తలు వేఱు వేఱుగా పరుండునది. నాడు గర్భమేర్పడినట్లు నిశ్చయమైనచో మఱునాడు కాని, ఒక మాసము తరువాత నిశ్చిత సమయమునకు రజస్వల కానిపక్షమున గర్భమేర్పడినట్లు నిశ్చయించుకొని అప్పుడైనను ఈ క్రింది మంత్రములతో ఆహుతు లిచ్చునది.

మంత్రములు :

1. ఓం యథా వాతః పుష్కరిణీం సమింగయతి సర్వతః
   ఏవా తే గర్భ ఏజతు నిరైతు దశమాస్యః స్వాహా
2. ఓం యథా వాతో యథా వనం యథా సముద్ర ఏజతి
   ఏవా త్వం దశమాస్య సహావేహి జరాయుణా స్వాహా
3. ఓం దశమాసాఞ్ఛ శయానః కుమారో అధిమాతరి
   నిరైతు జీవో అక్షతో జీవో జీవన్త్యా అధి స్వాహా

(ఋగ్వేద 5. 78.)

1. ఓం ఏజతు దశమాస్యో గర్భో జరాయుణా సహ
   యథాయం వాయు రేజతి యథా సముద్ర ఏజతి
   ఏవాయం దశమాస్యో అస్రజ్జరాయుణా సహ స్వాహా

2. ఓం యస్యై తే యజ్ఞియో గర్భో యస్యై యోని ర్హిరణ్యయీ
అంగాన్యహ్రుతా యస్య తం మాత్రా సమజీగమగ్ం స్వాహా
యజు. అ. 8. 28. -29

1. ఓం పుమాగ్ంసౌ మిత్రావరుణౌ పుమాగ్ంసా వశ్వినావుభౌ
పుమానగ్నిశ్చ వాయుశ్చ పుమాన్ గర్భ స్తవోదరే స్వాహా

2. ఓం పుమానగ్నిః పుమా నింద్రః పుమాన్ దేవో బృహస్పతిః
పుమాగ్ంసం పుత్రం విందస్వ తం పుమా ననుజాయతాగ్ం స్వాహా
సా. మం. బ్రా. 1 ఖం. 4. మం. 8,9

అగ్నిహోత్ర విధిననుసరించి యజ్ఞకుండమున అగ్న్యాధాన, సమిధాధానాదులొనర్చి పై మంత్రములతో నాహుతులిచ్చి (ఆజ్య సామగ్రులతో) తదుపరి శాంతి కరణ మంత్రములతో గూడ నాహుతులిచ్చి పూర్ణాహుతి నియ్యవలయును. తరువాత స్త్రీ తగిన భోజనాది నియమములు పాటింపవగును. మాదక ద్రవ్యములు, రేచకములగు కరక్కాయ మున్నగునవి, ఎక్కువ ఉప్పు, ఎక్కువ పులుసు, ఎక్కువ కారము స్త్రీ వాడరాదు. నేయి, పాలు, పెరుగు, తీపిపదార్థములు, తిప్పసత్తు మున్నగు ఓషధులు వాడుచుండవలయును. ఆహారము పుష్టికరముగా నుండుట మంచిది. చలికాలములో కుంకుమపువ్వు, కస్తూరి మున్నగు వేడినిచ్చు పదార్థములు వాడవలయును. పాలలో సొంటి వేసికొని త్రాగుట మంచిది. ఇట్టి యాహారవిహారముల వలన మంచి సంతానము కలుగును.

........

# 2. పుంసవన సంస్కారము

గర్భస్థితి యేర్పడినట్లు తెలిసిన తరువాత రెండవ మాసమున గాని, మూడవ మాసమున గాని, పుంసవన సంస్కారము చేయనగును. దాని వలన పురుషత్వము – వీర్య లాభము కలుగును. సంతానము కలిగిన తదుపరి రెండు నెలలు గడచు వఱకు పురుషుడు – పతి బ్రహ్మచర్యము వహించి స్వప్నము నందును వీర్యము నష్టపడకుండునట్లు వ్యవహరింపవలయును. వీర్యము శరీరము స్థిరపడునట్లు భోజనాచ్ఛాదన శయన జాగరణాది వ్యవహారములలో జాగ్రత్త పడవలయును అందువలన రెండవ సంతానము కూడ నుత్తమ మగును.

ఇందు ప్రమాణములు –

1. ఓం పుమాగ్ంసౌ మిత్రావరుణౌ పుమాగ్ంసా వశ్వినా పుభౌ
పుమా నగ్ని శ్చ వాయు శ్చ పుమాన్ గర్భ స్తవోదరే"

2. ఓం పుమా నగ్నిః పుమా నింద్రః పుమాన్ దేవో బృహస్పతిః
పుమాగ్ంసం పుత్రం విందస్వ తం పుమా ననుజాయతామ్

(సామవేదము)

1. ఓం శమీ మశ్వత్థ ఆరూఢ స్తత్ర పుంసవనం కృతమ్
తద్వై పుత్రస్య వేదనం తత్ స్త్రీష్వాభరామసి"

2. ఓం పుంసి వై రేతో భవతి తత్ స్త్రియా మనుషిచ్యతే
తద్ వై పుత్రస్య వేదనం తత్ ప్రజాపతి రబ్రవీత్

3. ఓం ప్రజాపతి రనుమతిః సినీవా ల్యచీక్లపత్
స్త్రైషూయ మన్యత్ర దధత్ పుమాంస ముదధ దిహ

(అథర్వ కాం 6 సూ 11)

పురుషుడు వీర్యవంతుడై యుండవలయు ననుటయే పై మంత్రముల యభిప్రాయము.

ఇందు అశ్వలాయన గృహ్య సూత్ర ప్రమాణము :

1. "అథాస్యై మండలాగారచ్ఛాయాయాం దక్షిణస్యాం
   నాసికాయా మజీతా మోషధీం నస్తః కరోతి"

2. "ప్రజావజ్జీవ పుత్రాభ్యాం హైకే"

గర్భమేర్పడిన తరువాత రెండవ మాసముననో మూడవ మాసముననో మఱ్ఱిచెట్టు ఊడకాని, చిగురుటాకులు గాని తీసికొని స్త్రీ - దక్షిణ నాసికాపుటములో వాసన చూచునట్లు చేయవలయును. మఱియు తిప్పసత్తు, బ్రాహ్మి మున్నగు ఔషధములు తినిపింప వలయును.

ఇట్లే పారస్కర గృహ్య సూత్ర ప్రమాణము :

"అథ పుంసవనం పురా స్పందత ఇతి మాసే
ద్వితీయే తృతీయే వా"

తదుపరి 'పుంసవన' మనగా ఋతుదానమైన తరువాత గర్భస్థితి కలిగిన మీదట రెండవ మూడవ మాసమున పుంసవన సంస్కారము జరుపబడును.

గోభిలీయ శౌనక గృహ్య సూత్రములందును ఇట్లే వ్రాయబడి యున్నది.

(విధి : క్రియారంభము)

సంస్కారము జరుపదలచిన రోజున యజ్ఞ స్థలమును చక్కగా నలంకరించి యటకు కావలసిన ఆసనాదుల నమర్చవలయును. యజ్ఞకుండము, ఆచమనాదుల కావశ్యకములగు పాత్రలు, సమిధలు, నేయి, సామగ్రి, మఱ్ఱిఊడ, చిగురుటాకులు - అన్నియు చేకూర్చవలయును.

యజమానుడు, అతని పత్ని ఆసనముల నలంకరించి పురోతుని ఎన్నుకొని సంకల్పము చేయవలయును – తదుపరి ఆచమనము, అంగస్పర్శచేసి, అగ్నిహోత్ర సామాన్య ప్రకరణమున వ్రాసినట్లు ఈశ్వరస్తుతి ప్రార్థనో పాసన మంత్రములు, స్వస్తి వాచన, శాంతికరణ మంత్రములు పఠింపవలయును. తదుపరి అగ్న్యాధానము, సమిధాధానము, ప్రజ్వలనము, జలప్రసేచనము చేసి, ఆఘారావాజ్య భాగాహుతులు

నాలుగు, వ్యాహృతులు నాలుగు నేతితో నిచ్చి, స్విష్టకృదాహుతి, ప్రాజాపత్యాహుతి అను రెండాహుతులిచ్చి తరువాత నిమ్నలిఖిత రెండు మంత్రములతో రెండు ఘృతాహుతులివ్వునది.

1. ఓం ఆ తే గర్భో యోని మేతు పుమాన్ బాణ ఇవేషు
   ధిమ్ ఆ వీరో జాయతాం పుత్ర స్తే దశమాస్యః స్వాహా"

2. ఓం అగ్నిరైతు ప్రథమో దేవతానాం సోఽస్యై
   ప్రజాం ముంచతు మృత్యుపాశాత్, తదయం రాజావరుణో
   ఽనుమన్యతాం యథేయం స్త్రీ పౌత్రమఘం న రోదాత్ స్వాహా"

తరువాత యేకాంతమున పత్ని హృదయము మీద పతి తన హస్తముంచి యీ మంత్రము నుచ్చరింపవలయును.

ఓం యత్తే సుసీమే హృదయే హితవంతః ప్రజాపతౌ మన్యే
ఽహం మాం తద్విద్వాంసం మాహం పౌత్రమఘం నియామ్"

(ఓ సుకేశీ! నీ గర్భమున గల బిడ్డను పాలించుటలో నీకు గల హితభావమును నేనెఱుగుదును. నేను మన పుత్రునకు హానికలిగించు నెట్టి కార్యమును చేయను.)

తదనంతరము సామాన్య ప్రకరణమున గల సామవేదీయ వామ దేవ్యగాన మొనర్చి యజ్ఞము సమాప్తము చేయునది. సంస్కారమున కరుదెంచిన స్త్రీ పురుషులను బంపి, మఱ్ఱిఊడ, చిగురుటాకులు, తిప్పసత్తు బాగుగనూరి శుద్ధమైన వస్త్రమున గాలించి దానిని ఆ గర్భిణీ స్త్రీ కుడిముక్కు పుటములో పీల్చవలయును-వాసన చూడవలయును. తరువాత -

1. ఓం హిరణ్యగర్భః సమవర్తతాగ్రే భూతస్య జాతః పతి రేక ఆసీత్
   స దాధార పృథివీం ద్యాముతేమాం కస్మై దేవాయ హవిషా విధేమ
   - యజు. 13-4

2. ఓమ్ అద్భ్యః సంభృతః పృథివ్యై రసాచ్చ విశ్వకర్మణః సమవర్తతాగ్రే
   తస్య త్వష్టా విదధద్ రూపమేతి తన్మర్త్యస్య దేవత్వ మాజాన మగ్రే
   -యజు. 31-17

ఈరెండు మంత్రముల నుచ్చరించి భర్త తన కుడిచేతిని గర్భిణియైన పత్ని యొక్క గర్భాశయముపైన ఉంచి యీక్రింది మంత్రమును పఠింపవలయును.

ఓమ్ సుపర్ణో ऽసి గరుత్మాన్ స్త్రివృత్తే శిరో గాయత్రం చక్షుర్ బృహద్రథంతరే పక్షౌ, స్తోమ ఆత్మా ఛందా గ్ం స్యంగాని యజూగ్ంషి నామ, సామ తే తనూ ర్వామదేవ్యం యజ్ఞాయజ్ఞియం పుచ్ఛం ధిష్ణ్యాః. శఫాః సుపర్ణో ऽసి గరు త్మాన్ దివం గచ్ఛ స్వః పత" - యజు. 12-4

అర్థము :- ఓగర్భస్థ జీవ! నీవు మంచి రెక్కలు గల పక్షివంటి వాడవు. నీమస్తిష్కము ముప్విధముల (జ్ఞాన, కర్మ, ఉపాసన) వ్యవహరించుగాక! గాయత్రము నీకు చక్షువు - నీ జ్ఞానమునకు దృష్టి కోణము గాయత్రియగుగాక - బృహత్ రథంతరములు నీకు రెండు రెక్కలు. స్తోమము నీకు ఆత్మ - నీయుపాసనకు స్తుతికి పరమాత్మ లక్ష్యము. నీయంగములు యజుర్వేద ఛందస్సులు, సామవేదీయ వామదేవ్య గానము నీ శరీరము. యజ్ఞాయజ్ఞియములు - కర్తవ్యా కర్తవ్యములు నీకు పక్షికి తోకవంటివి. నీకు బుద్ధి పక్షికి కాళ్లగోళ్లవలె ఆధారము : ఇట్లు నీవు సుందర పక్షివంటి వాడవు. పక్షి ఆకాశమున నెగురునట్లు నీవును దివ్యగుణప్రాప్తికి ప్రయత్నింపుము. ఇట్లు(స్వః పత) సుఖమును పొందుము.

ఇట్లు సంస్కారము ముగిసిన మీదట గర్భిణీ స్త్రీ నియమముగా యుక్తాహార విహారముల నొనర్పవగును. తిప్పసత్తు, బ్రాహ్మి ఓషధి సొంటి కొంచెము కొంచెము పాలతో సేవించుచుండ వలయును. అధికశయనము అధిక భాషణాదులు విడువ వలయును.

ఎక్కువ ఉప్పు, పులుపు, కారము వాడరాదు. రేచకములగు కరక్కాయ మున్నగు పదార్థములను వాడతగదు. క్రోధము, ద్వేషము మున్నగు వికారములకు లోనుగారాదు. అతి భోజనము తగదు. చిత్తము నెల్లపుడు ప్రసన్నముగా నుంచుకొనునది.

సమాప్తము

........

# 3. సీమంతోన్నయనము

సీమంతోన్నయనము మూడవ సంస్కారము. ఈ సంస్కారము వలన గర్భిణీ స్త్రీ మనస్సు సంతుష్టమగును. ఆరోగ్యమేర్పడును. గర్భము స్థిరపడును. ఉత్కృష్ట మగును. దినదినము వర్ధిల్లును. ఇందు ప్రమాణములు.

"చతుర్థే గర్భమాసే సీమంతోన్నయనమ్"

"ఆపూర్యమాణపక్షే యదా పుంసా నక్షత్రేణ చంద్రమాయుక్తః స్యాత్"

"అథాస్యై యుగ్మేన శలాలు గ్రప్సేన త్ర్యేణ్యా చ
శలల్యా త్రిభిశ్చ కుశపింజూలై రూర్ధ్వం సీమన్తం
వ్యూహతి భూర్భువః స్వరోమితి త్రిః చతుర్వా

(ఆశ్వలాయన గృహ్యసూత్రము)

"పుంసవనవత్ ప్రథమే గర్భే మాసే షష్ఠేఽష్టమే వా"

(పారస్కర గృహ్యసూత్రము)

ఇట్లే గోభిలీయ శౌనకగృహ్యసూత్రములందును జూడనగును.

గర్భమేర్పడిన మాసము మొదలు నాల్గవ మాసమున శుక్లపక్షమున మూల మున్నగు పురుష నక్షత్రముతో చంద్రుడున్ననాడు సీమంతోన్నయన సంస్కారము జరుపవలయును. మఱియు పుంసవన సంస్కారమునకు తుల్యముగా ఆఱవ మాసమునగాని, ఎనిమిదవ మాసమున గాని శుక్లపక్షమున చంద్రుడు పురుష నక్షత్రయుక్తుడై యున్ననాడు సీమంతోన్నయన సంస్కారము జరుపవలయును.

విధి :

ఈ సంస్కారమునకు కావలసిన విశేష పదార్థములు :-

బియ్యము, నువ్వులు, పెసలు మూడును సమాన భాగములుగ (ఓం ప్రజాపతయే త్వా జుష్టం నిర్వపామి అని పలికి) యొక పాత్రమున తీసికొని (ఓం

ప్రజాపతయే త్వా జుష్టం (ప్రోక్షామి అని పలికి) వానిని శుభ్రముగా కడిగి పులగముగా వండి దానిలో కొంత భాగమొక గిన్నెలో నుంచి యందు పుష్కలముగా నేయి పోసి (పులగముపైన నేయి తేలి యుండునంత) సిద్ధముగా నుంచుకొనవలయును.

క్రియారంభము :

సామాన్య ప్రకరణమున వర్ణించిన విధమున యజ్ఞవేదిక యందు ఆసన పాత్రాదులను, నేయి, సామగ్రి, సమిధలు సమకూర్చుకొన వలయును. పతి పత్ని పూర్వాభిముఖముగ యజ్ఞకుండమునకు పశ్చిమమున కూర్చుండవలయును. పురోహిత వరణము, సంకల్పము అయిన పిదప ఆచమనాంగస్పర్శలు చేయునది. ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన, స్వస్తి వాచన, శాంతికరణ మంత్రములు పఠించి, అగ్న్యాధానము సమిధాధానము, ప్రజ్వలనము జల ప్రసేచనము మంత్రములతో జరుపనగును.

తదుపరి ఆఘారావాజ్య భాగాహుతులు (4) నాలుగు, వ్యాహృత్యాహుతులు (4) నాలుగు నేతితో నియ్యనగును.

తరువాత పూర్వమే సిద్ధపఱచి యుంచిన పులగముతో నీక్రింది మంత్రములను పఠించుచు (8) ఎనిమిది ఆహుతు లియ్యవలయును.

1. ఓం ధాతా దదాతు దాశుషే ప్రాచీం జీవాతు మక్షితామ్
   వయం దేవస్య ధీమహి సుమతిం వాజినీవతః స్వాహా"
   ఇదం ధాత్రే ఇద న్న మమ.

2. ఓం ధాత్రా ప్రజానా ముత రాయ ఈశే ధాతేదం విశ్వం
   భువనం జజాన, ధాతా కృష్టి రనిమిషాభిచష్టే
   ధాత్ర ఇద్ధవ్యం ఘృతవ జ్జుహోత స్వాహా
   ఇదం ధాత్రే ఇద న్న మమ.

3. ఓం రాకా మహం సుహవాం సుష్టుతీ హువే శృణోతు
   నః సుభగా బోధతు త్మనా, సీవ్యత్వపః సూచ్యా
   చ్ఛిద్యమానయా దదాతు వీరం శతదాయ ముక్థ్యం స్వాహా
   ఇదం రాకాయై ఇద న్న మమ.

4. ఓం యాస్తే రాకే సుమతయః సుపేశసో యాభిర్
దదాసి దాశుషే వసూని, తాభిర్ నో అద్య
సుమనా ఉపాగహి సహసపోషం సుభగే రరాణా స్వాహా
ఇదం రాకాయై ఇద న్న మమ.

5. ఓం నేజమేష పరా పత సుపుత్రః పునరాపత, అస్యై మే
పుత్రకామాయై గర్భ మాధేహి యః పుమాన్ త్స్వాహా

6. ఓం యథేయం పృథివీ మహ్యుత్తానా గర్భమాదధే
ఏవం తం గర్భ మాధేహి దశమే మాసి సూతవే స్వాహా

7. ఓం విష్ణోః శ్రేష్ఠేన రూపేణాస్యాం నార్యాం గవీన్యామ్
పుమాంసం పుత్రా నాధేహి దశమే మాసి సూతవే స్వాహా

8. ఓం ప్రజాపతే న త్వదేతాన్యన్యో విశ్వా జాతాని పరితా
బభూవ, య త్కామా స్తే జుహుమ స్తన్నో అస్తు
వయం స్యామ పతయో రయీణామ్ స్వాహా
ఇదం ప్రజాపతయ ఇద న్న మమ.

ఈ మంత్రముల యభిప్రాయము :

(1) ఓ బలముగల వధూ! సర్వబలధారి యగు ధాత - పరమేశ్వరుడు, ఇచ్చువానికి క్రమముగా నభివృద్ధి నందుచు, నశింపని జీవనశక్తిని ప్రసాదించుగాక! మనమట్టి భగవంతుని సుమతిని ధ్యానింతము.

(2) ఆ భగవంతుడు ప్రజలను ధరించువాడు - ప్రజల జీవనమునకుపయుక్త ధనాది భోగసాధనముల కీశుడు. ఆధాతయే యీ విశ్వము నుత్పన్న మొనర్చెను. అతడే వీనికాధారము. సమస్త మానవులను ఏకదీక్షగా చూచుచున్నాడు. అతనినే లక్ష్యముననుంచుకొని నేతితో గూడిన సామగ్రిని అగ్నియందు హోమము చేయుము.

(3) శిష్టభాషణ చేయదగు పతినగు నేను చంద్రునివలె సుందరమైన పత్నిని ప్రశంసనీయ భాషతో నాహ్వానింతును. సౌభాగ్యవతియగు పత్నియు మామాటలను ధ్యానముతో వినును. విని నాభావనను హృదయంగమము చేసికొనును. అచ్ఛిద్యమానము తీక్ష్ణమునగు సూది వస్త్రములను కుట్టగలుగునట్లు ఈమె గృహ్య కర్మలను సంపాదించును. సంకటములలోను భయపడదు. అట్టి పత్ని శత హస్తములతో లోకమున కుపకారమొనర్చుచు జనుల ప్రశంసకు పాత్రుడగు శూరుడు వీరుడునగు పుత్రుని సమాజమున కర్పించునుగాక.

(4) ఓ చంద్రవదనా! నీరూప సౌందర్యములతోను శుభాలోచనలతోను నీకు సర్వస్వము నర్పించు నీపతికి నీవంతయు నర్పించు చున్నావు. నీ సౌందర్యాది సంపదలతోనే నీవు సుమనస్కవై నేడు నాకు లభించుచున్నావు. ఓ సుభగే! వేయిరెట్లు పుష్టిని గలిగించుచు నీవు నాకు ప్రాప్తించుచున్నావు.

(5) పుత్రుని గోరు నాయందు గర్భము నాధానము చేసిన నా యీ పురుషుడు అక్రియాధీనతను - సోమరితనమును బోనాడి సుపుత్ర వంతుడై మరల నాకడకు వచ్చుగాక!

(6) ఓ నారీ! ఉన్నతమై విశాలమైన యీ పృథివి అనేకములయిన ఓషధి వనస్పతులను తన గర్భమున ధరించియున్నట్లు పత్నివైన నీవు పది నెలలు పాలించుటకు సంతానరూప గర్భమును ధరించి సంబాళింతువు గాక!

(7) శాస్త్రోపదేశము :- ఓ పురుషుడా! సుందరములైన నఖశిఖాదీంద్రియములు గల యీ నీభార్యయందు విష్ణువువంటి శ్రేష్ఠ సుందరరూపులు పౌరుష శాలురునగు పుత్రులను పదియవ మాసమున నుత్పన్నులగుటకు ధారణ సేయుము.

(8) ఓ ప్రజావతీ! నీకంటె భిన్నుడైన వాడెవడును ఈ జగత్తున నుత్పన్నజడచేతనాత్మక పదార్థములను తిరస్కరింపజాలడు - అనగా నీవే సర్వోపరి విరాజిల్లుచున్నావు. ఏయే కోరికలతో నిన్నాశ్రయించుచున్నామో

యవి యన్నియు మాకు సిద్ధించునుగాక. అందువలన మేము ధనాడ్యై శ్వర్యముల కధిపతులమగుదుము గాక!

తదుపరి : "ఓం ప్రజాపతయే స్వాహా" అను నీ మంత్రము పఠించి అన్నముతో నొక యాహుతి నిచ్చునది.

తరువాత : ఓం యదస్య కర్మణో zత్యరీరిచం యద్వాన్యూన మిహాకరమ్. అగ్నిష్టత్ స్విష్టకృద్ విద్యాత్ సర్వం స్విష్టం సుహుతం కరోతు మే అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమర్ధయిత్రే సర్వాన్నః కామాన్ త్సమర్ధయ స్వాహా" ఇద మగ్నయే స్విష్టకృతే ఇద న్న మమ.

అని యీ మంత్రము జదివి పులగముతో నొక యాహుతి నిచ్చునది. తదుపరి యీక్రింది మంత్రములతో నెనిమిది నేతి యాహుతుల నియ్యవలయును.

(1) ఓం త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేళో zవయాసి సీష్ఠాః, యజిష్ఠో వహ్నితమః శోశుచానో విశ్వా ద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా ఇద మగ్నీ వరుణాభ్యాం ఇద న్న మమ.

(2) ఓం స త్వన్నో అగ్నే z వమో భవోతీ నేదిష్ఠో అస్యా ఉషసో వ్యుష్టౌ, అవయక్ష్వ నో వరుణం రరాణో వీహి మృళీకం సుహవో న ఏధి స్వాహా ఇద మగ్నీ వరుణాభ్యాం ఇద న్న మమ.
ఋ. మం. 4 సూ. 1 మంత్ర. 4. 5.

(3) ఓం ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృడయ త్వా మవస్యురాచకే స్వాహా - ఇదం వరుణాయ ఇద న్న మమ. (ఋ. 1-25-19)

(4) ఓం తత్త్వా యామి బ్రహ్మణా వందమాన స్తదాశాస్తే యజమానో హవిర్భిః, అహేళమానో వరుణేహ బోధ్యు రుశగంస మాన ఆయుః ప్రమోషీః స్వాహా ఇద వరుణాయ ఇద న్న మమ.(ఋ. 1-24-11)

(5) ఓం యే తే శతం వరుణయే సహస్రం యజ్ఞియాః పాశా వితతా మహాన్తః, తేభిర్ నో అద్య సవితోత విష్ణుర్ విశ్వే ముంచంతు మరుతః స్వాహా ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో దేవేభ్యో మరుద్భ్యః స్వర్కేభ్య ఇదం న మమ.

(6) ఓమ్ అయా శ్చాగ్నే ౽ స్యనభిశస్తి పాశ్చ సత్యమి త్వ మయాసి, అయానో యజ్ఞం వహాస్యయానో ధేహి భేషజగ్ం స్వాహా.
ఇద మగ్నయే అయసే ఇద న్న మమ.

(7) ఓమ్ ఉదుత్తమం వరుణ పాశమస్మ దవాధమం విమధ్యమం శ్రథాయ అథావయ మాదిత్యవ్రతే తవానాగసో అదితయే స్యామ స్వాహా - ఇదం వరుణా యాదిత్యా యాదితయే చ ఇదం న మమ.
(ఋ. 1-24-15)

(8) ఓం భవతన్నః సమనసౌ సచేతసావరేపసౌ
మా యజ్ఞగ్ం హిగ్ంసిష్టం మాయజ్ఞపతిం జాతవేదసౌ
శివౌ భవత మద్య నః స్వాహా
ఇదం జాతవేదోభ్యాం ఇద న్న మమ. (యజు 5-3)

తదుపరి– ఓం భూరగ్నయే స్వాహా
ఇద మగ్నయ ఇద న్న మమ.
ఓం స్వరాదిత్యాయ స్వాహా
ఇద మాదిత్యాయ ఇద న్న మమ.
ఓం భూర్భువః స్వ రగ్ని వాయ్వాది త్యేభ్యః స్వాహా
ఇద మగ్నివాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ.

ఈ మంత్రములతో 4 ఆహుతులు నేతితో నిచ్చునది.

తదుపరి పతి పత్నులు ఏకాంత ప్రదేశమునకేగి ఆసనములపై పత్ని వెనుక పతి కూర్చుండి, ఈ క్రింది మంత్రముల నుచ్చరించుచు పత్ని వెంద్రుకలకు సుగంధ యుక్త తైలమును రాచి దువ్వెనతో దువ్వి తిన్నగా పాపట తీసి జడవేసి యజ్ఞమండపమునకు గొని తేవలయును.

మంత్రములు :

1. ఓం సుమిత్రియా న ఆప ఓషధయః సంతు, దుర్మిత్రియా స్తస్మై సంతు యో஽స్మాన్ ద్వేష్టి యంచ వయం ద్విష్మః. యజు. 6-22

2. ఓం మూర్ధానం దివో஽ రతిం పృథివ్యా వైశ్వానరమృత ఆ జాతమగ్నిమ్ కవిగ్ం సమ్రాజ మతిథిం జనానా మాసన్నా పాత్రం జనయన్త దేవాః. య. అ. 7-24.

3. ఓం అయ మూర్జావతో వృక్ష ఊర్జీవ ఫలినీ భవ పర్ణం వనస్పతే஽ను త్వా஽ను త్వాసూయతాగ్ంరయిః

4. ఓమ్ యేనాదితేః సీమానం నయతి ప్రజాపతిర్ మహతే సౌభగాయ, తేనాహ మస్యై సీమానం నయామి ప్రజామస్యై జరదష్టిం కృణోమి

5. ఓమ్ రాకామహగ్ం సుహవాగ్ం సుష్టుతీ హువే శృణోతు నః సుభగా బోధతు త్మనా, సీవ్యత్వపః సూచ్యా ఛిద్యమానయా దదాతు వీరగ్ం శతదాయు ముఖ్యమ్.

6. ఓమ్ యాస్తే రాకే సుమతయః సుపేశసో యాభిర్ దదాసి దాశుషే వసూని, తాభిర్ నో అద్య సుమనా ఉపాగహి సహస్రపోషగ్ం సుభగే రరాణా.

7. ఓమ్ కిం పశ్యసి ప్రజాం పశూన్ త్వాభాగ్యం మహ్యాం దీర్ఘాయుష్ట్వం పత్యుః.

పతి యనుచున్నాడు :

(1) మన యిరువురకు జలము ఓషధులు, మంచి మిత్రములవలె నగుగాక! మనలను ద్వేషించుచు మన ద్వేషమునకు పాత్రుడైన వానికి దుర్మిత్రములవలె నగుగాక!

(2) భార్యా భర్తలమగు మన మిరువురము దివ్యగుణములలో సర్వోత్కృష్టము, ప్రపంచమునందుండియు ప్రపంచ పదార్థములందాసక్తి లేనట్టియు, నెల్లరిచే కొనియాడ దగినట్టియు సంతానమును గనుటకు ఉద్యుక్తుల మగుదుముగాక!

(3) ఫలపుష్పములతో నిండియుండు వృక్షమువలె నీవు సిరి సంపదలతో తులదూగు సంతాన యుక్తవగుదువుగాక! వృక్షపత్రములను నూరి వానినుండి రసమును దీయునట్లు మన మిరువురము కలిసి సిరిసంపదలతో కూడియుండు సంతానము కందుము గాక!

(4) పరమేశ్వరుడు పృథివిని ధన సంపదలకు గనిగా నుత్పన్నము చేసియున్నాడు. దానినుండి మానవునకు సమస్తము లభించును. అట్లే పత్నియు జీవిత ధనరూప సంతానమునకు ఆశ్రయము. ఆమె నుండి కలుగు సమాజ ధనరూప సంతానమును చిరంజీవి యగునట్లు పతి ప్రయత్నింపవలయును.

తదుపరి పులగముంచిన గిన్నెలో నేయిపోసి, ఆగిన్నెను పత్ని చేతికిచ్చి, యామెను తన ముఖము ప్రతిబింబము నందు చూడు మని యీ క్రింది మాటలతోనను. భర్త– కింపశ్యసి :- ఏమి చూచు చున్నావు?

భార్య– (గిన్నెలో తన ముఖ ప్రతిబింబమును చూచుచు)– ప్రజాం, పశూన్, సౌభాగ్యం మహ్యామ్, దీర్ఘాయుష్ట్వం పత్యుః - నాకొఱకు సంతానమును, పశువులను, సౌభాగ్యమును, భర్త కొఱకు దీర్ఘాయుష్యమును చూచుచున్నాను– అనును.

పై క్రియలు జరుగునపుడు మంగళ వాద్యములను వీణామున్నగు వానిని మ్రోయించుట ఉల్లాస కరమగును. తరువాత సామవేదీయ వామదేవ్య గాన మొనర్ప వలయును. ఈ క్రింది మంత్రమును ముందుగా పఠించి తరువాత మిగిలిన వానిని చదువ వలయును.

"ఓం సోమ ఏవ నో రాజేమా మానుషీః ప్రజాః, అవిముక్తచక్ర ఆసీరంస్తీరే తుభ్యమ్ అసౌ. ఈ పదస్థానమున నొక నదీనామము నుచ్చరించునది-

తదుపరి వచ్చిన బంధువుల ద్వారమున గర్భిణీ స్త్రీని ఆశీర్వదింపజేసి కార్యక్రమము ముగింప వలయును.

ఆశీర్వాదము :

“ఓం వీరసూ స్త్వం భవ, జీవసూ స్త్వం భవ, జీవపత్నీ త్వం భవ

అను నీ మాటలతో పతి పత్నుల నాశీర్వదింప నగును.

సంస్కారమునకు వచ్చిన బంధువులు ముఖ్యముగా స్త్రీలు గర్భిణీ స్త్రీతో సంతోషముగా సంభాషింపనగును.

స్త్రీలకు పురుషులకు నెల్లరకు సత్కారముచేసి పంపుట యుచితము.

సమాప్తము

.........

# 4. జాతకర్మ సంస్కారము

దీని సమయము - ప్రమాణము - చేయువిధి

"సోష్యంతీ మద్భి రభ్యుక్షతి".

పారస్కర గృహ్య. 1-16-1

ఇట్లే ఆశ్వలాయన గోభిలీయ శౌనక గృహ్యసూత్రములందును చూడనగును.

ప్రసవ సమయము రాగానే యీ క్రింది మంత్రములతో గర్భిణీ స్త్రీ శరీరము పై జలమును మార్జనము చేయవలయును.

1. ఓం ఏజతు దశమాస్యో గర్భో జరాయుణా సహ, యథాయం వాయు రేజతి యథా సముద్ర ఏజతి, ఏవాయం దశమాస్యో అస్రజ్జరాయుణా సహ. య. అ 8-28

తదుపరి యీ క్రింది మంత్రములను జపించి మరల జలము నామెపై చల్లవలెను.

2. ఓం అవైతు పృశ్ని శేవలగ్ంశుభే జరాయ్వత్తవే నైవ మాగ్ంసేన పీవరీం న కస్మింశ్చనాయతన మవ జరాయు పద్యతామ్ పా. గృ 1-16-2 కుమారం జాతం పురాzన్యై రాలంభాత్ సర్పిర్ మధునీ హిరణ్య నికాషం హిరణ్యేన ప్రాశయేత్" అశ్వ గృ 1-15-1.

శిశువు జన్మించగానే మంత్రసాని మున్నగు స్త్రీలు ముందుగా బాలకుని శరీరముపై నుండు జరాయువు (మాయ) ను తొలగించి ముఖము, నాసిక, కన్నులు మున్నగు నవయవములపై నున్న మలమును త్వరగా తుడిచి వైచి మృదువైన వస్త్రముతో తుడిచి శుభ్రపఱచి యాబిడ్డను తండ్రి యొడిలో నుంచ వలయును. తండ్రియు చల్లగాలి తగలని చోట గూర్చుండి జానెడు పొడుగు నాడిని వదలి యాపైన నాడిని దారముతో బంధించి యా బంధమునకు పై భాగమున దానిని ఖండించి గోరువెచ్చని నీళ్ళతో బాలకునకు స్నానము చేయింప వలయును. శుద్ధ వస్త్రముతో తుడిపించి నూతన శుద్ధ వస్త్రమును ధరింపజేసి, ప్రసూతి గృహమునకు వెలుపల ద్వార సమీపమున పూర్వమే సిద్ధపఱచి యుంచిన యజ్ఞకుండమున

సామాన్య ప్రకరణమున వివరించినట్లు ఆచమన, ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనా పూర్వకముగ నగ్న్యాధాన సమిధాధానాదుల నొనర్చి యగ్నిని ప్రదీప్తమొనర్పవలయును.

ఇట్లు యజ్ఞము చేయుటకు ముందు యజమానుడు (శిశువు తండ్రి) వేదికపై పూర్వాభిముఖుడై కుండమునకు పశ్చిమ భాగమునను, పురోహితుడు దక్షిణ భాగమున ఉత్తరాభి ముఖుడుగాను కూర్చుండునది. హవన సామగ్రి, ఘృతము, సమిధలు నావశ్యకరములగు వస్తువులు నన్నియు సమీపమున నుంచుకొనవలయును. పురోహితుని ఎన్నిక, యజమానుని సంకల్పము, ఆచమనము, అంగస్పర్శ, అగ్న్యాధానము, 3 సమిధలు, 5 ఘృతాహుతులు, జలప్రసేచనము, ఆఘూరావాజ్యభాగాహుతులు, వ్యాహృత్యాహుతులు, అయిన తరువాత నీక్రింది విశేషాహుతు లీయవలయును.

పతి ఇంకను రెండు నేతి యాహుతులు ఇయ్యనగును.

1. ఓం యా తిరశ్చీ నిపద్యతే అహం విధరణీ ఇతి, తాం త్వా ఘృతస్య ధారయా యజే సగ్ంరాధనీ మహమ్. సగ్ం రాధిన్యై దేవ్యై దేష్ట్రై స్వాహా. ఇదం సంరాధిన్యై ఇదం న మమ
2. ఓం విపశ్చిత్ పుచ్ఛమభరత్ తద్ధాతా పునరాహరత్ పరే హి త్వం విపశ్చిత్ పుమానయం జనిష్యతేऽసౌ నామ స్వాహా. ఇదం ధాత్రే ఇద న్న మమ

పై మంత్రాభిప్రాయములు :

(1) పతి అనును– ఈ నా భార్య కుటిలగామిని కాదు. అనుకూల చారిణి. నే నామెను ధరించువాడను. సత్కార్యములను సిద్ధము చేయు నా యీ భార్యకు ఘృతభండారమును పూర్ణ మొనర్తును. ఇది యామె కొఱకు నా శుభవచనము.

(2) పత్నీ వచనము– విద్వాంసుడగు నాభర్త గర్భస్థ శిశువును గర్భాశయమున నింపెను. అతనిని పరమేశ్వరుడు బయటికి తీసెను. విద్వాంసుడవగునో నాథ! ఇప్పుడు నీవు నాకు దూరముగనుండుము. కొండొక నామముగల యీ సంతానము పుంస్త్వ శక్తిని బొందును గాక!

ఈ మంత్రాభిప్రాయమునుబట్టి సంతానము గలిగిన మీదట ఆ సంతానము శక్తిమంతమగు వఱకు భార్యా భర్తలు చాల తడవు సమాగమము చేయరాదని తెలియుచున్నది.

తదుపరి మంగళ కార్యము– వామదేవ్యగానము, మహావామ దేవ్యగానము చేయవలయును. తరువాత ఈశ్వరస్తుతి ప్రార్థ నోపాసన మంత్రముల చదువ వలయును.

తదుపరి సమపాళ్ళలో నేయి, తేనె కలిపి దాని నొక గిన్నెలోనుంచి యందు బంగారపు తీగెను ముంచి దానితో శిశువు జిహ్వపై "ఓ౩మ్" అక్షరమును వ్రాయవలయును. ఆ శిశువు కుడిచెవిలో "వేదో z సీతి" –నీ గుప్త నామము వేదము, అని వినిపించి, నేయికలిపి యుంచిన తేనెతో బంగారపు కడ్డీని (శలాకను) ముంచి యీ క్రింది మంత్రములను పఠించుచు తండ్రి కొంచెము కొంచెము శిశువుచే నాకింప జేయవలయును.

1. ఓం వ్రతే దదామి మధునో ఘృతస్య వేదం సవిత్రా
   ప్రసూతం మఘోనామ్, ఆయుష్మాన్ గుప్తో
   దేవతాభిః శతం జీవ శరదో లోకే అస్మిన్.
2. ఓం భూస్త్వయి దధామి.
3. ఓం భువస్త్వయి దధామి.
4. ఓం స్వస్త్వయి దధామి
5. ఓం భూర్భువః స్వస్సర్వం త్వయి దధామి.
6. ఓం సదసస్పతి మద్భుతం ప్రియమింద్రస్య కామ్యమ్.
   సనిం మేధామయాసిషగ్ం స్వాహా.

ఇట్లు ఆఱు పర్యాయములు నేయి కలిపిన మధువును బంగారపు తీగతో బాలునిచే నాకింప జేయునది.

తరువాత బియ్యపు గింజలు యవలు కొంచెము తీసికొని బాగుగ కడిగి మెత్తగానూరి (జలముతో) దానిని వస్త్రమున వడియగట్టి ఆ రసములో బొటన వ్రేలు ఉంగరపు వ్రేలు కలిపి ముంచి యొక బిందువు బాలుని నోటియందు క్రింది మంత్రము పఠించుచు నుంచవలయును.

ఓం ఇద మాజ్య మిద మన్న మిద మాయురిద మమృతమ్

(ఇది గోభిలీయ గృహ్య సూత్రకారుని మతము –ఇతరులది కాదు.)

తరువాత తండ్రి బాలకుని కుడిచెవికి తన ముఖమానించి యీ క్రింది మంత్రముల పఠింపవలయును.

1. ఓం మేధాం తే దేవః సవితా మేధాం దేవీ సరస్వతీ
మేధాం తే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కర స్రజౌ

2. ఓం అగ్ని రాయుష్మాన్త్సవనస్పతిభి రాయుష్మాం
స్తేన త్వాzzయుషాzzయుష్మ న్తం కరోమి

3. ఓం సోమ ఆయుష్మాన్స ఓషధిభి రాయుష్మాం
స్తేన .... ..... .... కరోమి

4. ఓం బ్రహ్మ యుష్మత్ తద్ బ్రాహ్మణై
రాయుష్మత్ తేన ....................కరోమి

5. ఓం దేవా ఆయుష్మ న్త స్తే మృతేనా
యుష్మ న్త స్తేన ..................... కరోమి

6. ఓమ్ ఋషయ ఆయుష్మన్త స్తే వ్రతై
రాయుష్మన్త స్తేన ...................కరోమి

7. ఓం పితర ఆయుష్మ న్త స్తే వ్రతై
రాయుష్మ న్త స్తేన ................. కరోమి

8. ఓం యజ్ఞ ఆయుష్మాన్స దక్షిణాభి రాయుష్మాం
స్తేన ................కరోమి

9. ఓం సముద్ర ఆయుష్మాన్స్ప్రవంతీభి రాయుష్మాం
స్తేన త్వాయుషాzz యుష్మన్తం కరోమి.

ఈ మంత్రములను కుడి చెవిపై జపించి వీనినే బాలకుని యెడమ చెవిపైనను జపింపవలయును.

తదుపరి బాలకుని భుజములపై చేతినుంచి నెమ్మదిగా స్పృశించి యీ మంత్రములను పఠింప వలయును.

1. ఓం ఇంద్ర శ్రేష్ఠాని ద్రవిణాని ధేహి చిత్తిం దక్షస్య సుభగత్వ మస్మే. పోషం రయీణా మరిష్టం తనూనాం స్వాద్మానం వాచః సుదినత్వ మహ్నామ్

2. ఓం అస్మే ప్రయంధి మఘవన్ నృజీషి న్నింద్ర రాయో విశ్వవారస్య భూరేః, అస్మే శతం శరదో జీవసే ధా అస్మే వీరాన్ శశ్వత ఇంద్ర శిప్రిన్

3. ఓం అశ్మా భవ పరశుర్భవ హిరణ్యామ స్ప్రుతం భవ వేదో వై పుత్ర నామాసి స జీవ శరదః శతమ్

మంత్రాభిప్రాయములు :

(1) ఓ పరమైశ్వర్యశాలివగు దేవ! మాకు శ్రేష్ఠధనము, చతురుని చిత్తము, సౌభాగ్యము, ధనవృద్ధి, ఆరోగ్యము, మధురవాణి సుదినములు ప్రసాదింపుము.

(2) ఓ యింద్ర! ఆపత్తులను దొలగించు విపుల ధనము మాకిమ్ము. మా జీవనమునకు నూతేండ్లిమ్ము. ఎల్లప్పుడు నుండు వీరులను ప్రసాదింపుము.

(3) ఓ బాలక! ఱాయివలె దృఢపడుము. శత్రువులకు గొడ్డలివంటి వాడవగుము. మేలిమి బంగారమువంటి వాడవగుము. పుత్ర! వేదమను నామముతో నీవు జ్ఞానమయుడవు. అట్టి నీవు నూతేండ్లు వర్ధిల్లుము.

తరువాత నీ క్రింది మంత్రమును మువ్మాఱు జపింపవలయును.

ఓం త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషం,
యద్దేవేషు త్ర్యాయుషం తన్నో అస్తు త్ర్యాయుషమ్

అర్థము : అగ్నిహోత్ర మొనర్చువారికి, కృషికులకు, దివ్య వ్యక్తులకు గలుగు ఆయువుకంటే మూడు రెట్లు ఆయువు మాకు గలుగు గాక!

ఇట్లు జపముచేసి బాలకుని భుజములపైనుండి చేతులు తొలగించి ప్రసూతి గృహములో ప్రవేశించి భర్త యీ క్రింది మంత్రము జపించునది.

(ప్రసూతి గృహమున మంత్రజపము)

ఓం వేద తే భూమి హృదయం దివి చంద్రమసి శ్రితమ్,
వేదాహం తన్మాం తద్విద్యాత్ పశ్యేమ శరదః శతం
జీవేమ శరదః శతగ్ం శృణుయామ శరదః శతమ్
పా. గృ. 1-16-17

మంత్రార్థము : భూమివలె సంతానముగనునో దేవి! నీ హృదయము చంద్రునివలె నాహ్లాదకరమని నేనెఱుగుదును. సంతానమును గనిన నీకెంతటి యాహ్లాదము కలుగుచున్నదో యంతటి యాహ్లాదము నాకు గలుగు చున్నదని నీవెఱుంగుము. మన మిరువురము నూఱు సంవత్సరములు జీవింతుము, చూతుము, విందుము గాక!

తరువాత నీ క్రింది మంత్రములు పఠించుచు బాలింత శరీరము మీద సుగంధిత జలము - పన్నీరు - చిలకరించునది.

1. ఓం యత్తే సుసీమే హృదయగ్ం హితమంతః ప్రజాపతౌ వేదాహం
మన్యే తద్ బ్రహ్మ మాహం పౌత్రమఘం నిగామ్
2. ఓం యత్ పృథివ్యా అనామృతం దివి చంద్రమసి శ్రితమ్,
వేదామృతస్యేహ నామ మాహం పౌత్రమఘగ్ం రిషమ్.
3. "ఓం ఇంద్రాగ్నీ శర్మ యచ్ఛతం ప్రజాయై మే ప్రజాపతీ
యథాయం న ప్రమీయతే పుత్రో జనిత్ర్యా అధి.

4. "ఓం యదద శ్చంద్రమసి కృష్ణం పృథివ్యా హృదయగ్ం శ్రితమ్, తదహం విద్వాగ్ం స్తత్ పశ్యన్ మాహం పౌత్రమఘగ్ం రుదమ్.

మంత్రార్థములు :

(1) ఓ సుకేశినీ ! సంతాన పాలనలో నీ హృదయము హితమొనర్చుటలో లగ్నమైయున్నది. అది గొప్పది యని నే నంగీకరింతును. నేనును పుత్రసంబంధి దుఃఖమును పొందకుందునుగాక! అనగా పుత్రుడు నీకు ప్రియుడైనట్లు నాకును ప్రియుడే.

(2) భూమియందు, చంద్రునందును గల మృత్యుధర్మమును నేనెఱుగు దును. కాని పుత్రునితో మనముండు నీ గృహమున పారస్పరిక ప్రేమవలన అమరత్వమునే యెఱుగుదును. పుత్రనాశశోకము (మనకు) నాకు కలుగకుండు గాక!

(3) సంతానమును పాలించు నింద్రాగ్నులు-సూర్యాగ్నులు నా పుత్రునకు శరణము - సుఖమునిత్తురు గాక! అందువలన ఈ జననీ పుత్రుడు (న అధి ప్రమీయతే) నాశము నందకుండు గాక!

(4) చంద్రునియందు నల్లని భూచ్ఛాయ పడుటను నే నెఱుగుదును. దానినిచూచుచు నేను పుత్రసంబంధమైన దుఃఖమును బొంది యేడ్చు స్థితి నాకు గలుగకుండు గాక!

సంతానము నాశీర్వదించుట

ఈ క్రింది మంత్రములతో సంతానము నాశీర్వదింపవలయును.

1. ఓం కోऽసి కతమోऽస్యేషోऽస్యమృతోऽసి ఆహస్పత్యం మాసం ప్రవిశాసౌ.

2. ఓం స త్వాహ్నే పరిదదా త్వహ స్త్వా రాత్ర్యై పరి దదాతు, రాత్రి స్త్వాహోరాత్రాభ్యాం పరిదదా త్వహో రాత్రౌ త్వాఽర్ధమాసేభ్యః పరిదత్తా మర్ధమాసా స్త్వా మాసేభ్యః పరిదదతు, మాసా స్త్వర్తుభ్యః పరిదదతు ఋతవ స్త్వా సంవత్సరాయ పరిదదా త్వసౌ.

మం. బ్రా. 1-5-14, 15.

అర్థములు :

(1) తండ్రి కుమారుని జూచి యనుచున్నాడు. నీ వెవడవు? (స్వయం సమాధానము చెప్పుచున్నాడు) నీవు అమరుడవు - ఓ బాలకా! సౌరమాసమును ప్రవేశింపుము- జీవనమును ప్రారంభింపుము.

(2) ఈశ్వరానుగ్రహమున ఆ సూర్యుడు నిన్ను దినమునకు, ఆదినము రాత్రికి, ఆరాత్రి దిన రాత్రులకు, ఆయహోరాత్రములు అర్ధమాసమునకు, అయ్యది మాసములకు, అవి ఋతువులకు, ఆ ఋతువులు సంవత్సరమునకు, అది నిన్ను ఆయుర్వృద్ధికి వృద్ధాప్యమునకు నందించును గాక! దిన దినము ప్రవర్ధమానుడవగుదువు గాక!

ఈ మంత్రములను పలికి బాలకుని ఆశీర్వదించునది.

1. ఓం అంగాదంగాత్ సగ్ం స్రవసి హృదయా దధిజాయసే, ప్రాణం తే ప్రాణేన సందధామి జీవ మే యావదాయుషమ్.

2. ఓం అంగాదంగాత్ సంభవసి హృదయా దధి జాయసే వేదో వై పుత్ర నామాసి స జీవ శరదః శతమ్

3. ఓం అశ్మా భవ పరశుర్భవ హిరణ్య మస్తృతం భవ ఆత్మాఽసి పుత్ర మా మృథాః స జీవ శరదః శతమ్

4. ఓం పశునాం త్వా హింకారేణాభిజిఘ్రామ్యసౌ

అర్థములు :

(1) ఓ పుత్ర ! నీవు నాప్రత్యంగమునుండియు స్రవించితివి. నీవు నా హృదయమునుండియు నుత్పన్నమైతివి. నీప్రాణమును నా ప్రాణముతో జోడించుచున్నాను - కలుపుచున్నాను. పూర్ణాయువు ననుభవింపుము.

(2) నీవు జ్ఞానము గల పుత్ర నామము గల వాడవు. నూఱువత్సరములు జీవింపుము. నీవు (వేదః) తెలిసిన వాడవు.

(3) నీవు ఱాయి వలె దృఢమైన శరీరము గల వాడవు. శత్రువులకు గొడ్డలివంటి వాడవు. నీవు శుద్ధమైన బంగారము వంటి వాడవు. నీవు శరీరము కాదు, ఆత్మవు. మృత్యువును బొందకు. శతవర్షములు జీవింపుము.

పరదేశమునకు వెళ్ళునపుడు, వచ్చినపుడును మూర్ధాఘ్రాణము చేసి ఆశీర్వదించుచుండుట వలన పరస్పర ప్రేమ వర్ధిల్లును.

ఆ తరువాత నీక్రింది మంత్రములతో పరమేశ్వరుని బ్రార్థించి బాలెంతను సంతోషపెట్టునది.

ఓం ఇడాసి మైత్రావరుణీ వీరే వీర మజీజనథాః
సా త్వం వీరవతీ భవ యాऽస్మాన్ వీరవతోऽకరత్.

ఓ వీర వనితా! నీవు మిత్రావరుణులు గల దానవైనబుద్ధిస్వరూపవు. నీవు వీరపుత్రుని కంటివి. నన్ను వీరసంతానవంతుని జేసితివి. అట్టి నీవు వీరపుత్రవతివగుము. (ఈ మాటలలో పత్నీస్తుతియుగలదు)

(స్తన్యపానము)

తదుపరి బాలెంత స్తనములను గోరువెచ్చని సుగంధిత జలములతో కడిగి–శుద్ధిచేసి, ఈ క్రింది మంత్రములను జదివి మొదట కుడి స్తనమును బాలకుని ముఖమున నుంచునట్లుచేయునది.

1. ఓం ఇమగ్ం స్తన మూర్జస్వంతం ధయాపాం ప్రపీన మగ్నే సరిరస్యమధ్యే. ఉత్సం జుషస్వ మధుమంత మర్వన్త్స ముద్రియగ్ం సదన మా విశస్వ.

తదుపరి యీ క్రింది మంత్రమును జదివి వామస్తనమును బాలకుని ముఖమునసుంచునది - పాలియ్యవలయునని భావము.

2. ఓం యస్తే స్తనః శశయో యో మయో భూర్యో రత్నధా వసువిద్య సుదత్రః, యేన విశ్వా పుష్యసి వార్యాణి సరస్వతి తమిహ ధాతవే కః.

మంత్రార్థములు :

(1) అగ్నివంటి ఓ బాలకా! దుగ్ధభరితమగుటచే స్థూలమై బలమునిచ్చు నీ మాతృస్తనమును నోట నుంచుకొని దుగ్ధపాన మొనర్చుము. మధువు వంటి దుగ్ధముతో నిండిన స్తనమును పానము చేయుము. మధువుతో సముద్రమువలె నుప్పొంగు సదనమున ప్రవేశింపుము.

(2) ఓ జ్ఞానవతీ! నీ స్తనము బాలకునకు శాంతి ప్రదము, సుఖదాయకము, దుగ్ధరూపరత్న ధారకము, పయోరూప ధనమిచ్చునది. ఇచ్చుటయే దానికి తెలియును. దానితో నీవు వరణీయములగు సర్వాంగములను పోషింతువు - బలపఱుచుదువు. ఆస్తనమును బాలకున కందింపుము.

కలశస్థాపన

ఈ క్రింది మంత్రము పఠించి బాలెంత శిరస్సువైపు జలపూర్ణ కలశము నొకదానిని పదిదినముల వఱకు నుంచునది.

"ఓం ఆపో దేవేషు జాగ్రథ యథా దేవేషు జాగ్రథ
ఏవ మస్యాగ్ం సూతికాయాగ్ం సపుత్రికాయాం జాగ్రథ.

ఓ జలమా! నీవంతరిక్షమున జాగరూకతతో నుందువు - అట్లే సపుత్రయినయీ
ఈ ప్రసవగృహమునను జాగరూకత కలిగియుండుము.

తదుపరి బాలెంత ప్రసూతిగృహమున పదిదినములు వసింపవలయును. అందు ప్రతి దినము సాయం ప్రాతః సంధి వేళలందు ఈ క్రింది మంత్రములతో ఆవాలు కలిపిన అన్నపుటాహుతుల నిచ్చుచుండవలయును.

1. ఓం శణ్డా మర్కా ఉపవీరః శౌణ్డికేయ ఉలూఖలః మలిమ్లుచో ద్రోణాస శ్చ్యవనో నశ్యతాదితః స్వాహా,
   ఇదం శండామర్కాభ్యా ముపవీరాయ శౌండికేయా యోలూఖలాయ మలిమ్లుచాయ ద్రోణేభ్య శ్చ్యవనాయ ఇదం న మమ.

2. ఓం ఆలి ఖన్ననిమిషః కిం వద న్త ఉపశ్రుతిర్ హర్యక్షః కుంభీశత్రుః పాత్రపాణిర్ నృమణిర్ హన్త్రీముఖః సర్ష పారుణ శ్చ్యవనో నశ్యతాదితః స్వాహా,
   ఇద మాలిఖతే z నిమిషాయ కింవదద్భ్య ఉపశ్రుతయే హర్యక్షాయ కుంభీశత్రవే పాత్రపాణయే నృమణయే హన్త్రీముఖాయ సర్షపారుణాయ చ్యవనాయ నశ్యతాదితాయ ఇదం న మమ.

మంత్రార్థములు :

(1) ఈ మంత్రమున శండామర్కములు, ఉపవీరము, శౌండికేయము, ఉలూఖలము, మలిమ్లుచము, ద్రోణాసము, చ్యవనము నను రోగము లీబాలకునినుండి నష్టమగు గాక! అని వర్ణింప బడియున్నది.

(2) లేఖలతో నితరులకు హానిచేయువారు, నిర్నిమేష దృష్టితో నితరులకు దుఃఖము కలిగించువారు, చాడీలు చెప్పువారు, నీలనేత్రులు–క్రోధులు, ఇతరులను శోషింపజేసి తమపొట్ట - (ఘటము) నింపు కొనువారు, శత్రువులు, భిక్షుకులు, మానవ హంతకులు, నోటి నుండి హింస నాలక జేయువారు, ఊసరవెల్లి - తొండవలె వేషములు మార్చువారు, ధర్మచ్యుతి

నానరించువారు అను నిట్టి దుష్టులీబాలకునకు దూరముగ నుందురుగాక!
(ఇట్టివారి బారినుండి బాలకుని రక్షింపవలయునని భావము)

ఇట్లు పదిదినములు ఆహుతులిచ్చి భర్త ప్రసూతి గృహమునందును, ఇతర వైదిక ధర్మావలంబులైన విద్వాంసులు పెద్దలు బయటను ఉండి ఈ క్రింది మంత్రములతో ప్రసన్నులై ఆశీర్వాదముల నొసంగునది.

## ఆశీర్వాద మంత్రములు

1. ఓం మా నో హాసిషుర్ ఋషయో దైవ్యా యే
తనూపా యే నస్తన్వ స్తనూజా:, అమర్త్యామర్త్యాగ్ం
అభి న: సచధ్వ మాయుర్ధత్త ప్రతరం జీవసే న:
అథర్వ. కాం. 6. అను 4. సూ 41 మం. 3.

2. ఓం ఇమం జీవేభ్య: పరిధిం దధామి మైషాం ను
గాదపరో అర్థమేతమ్, శతం జీవంత: శరద:
పురూచీస్తిరో మృత్యుం దధతాం పర్వతేన.
అథర్వ కాం. 12 అను 2 సూ 2 మం, 23.

3. ఓం వివస్వాన్నో అభయం కృణోతు, య: సుత్రామా
జీరదాను: సుదాను:. ఇహేమే వీరా బహవో భవన్తు
గోమద్ అశ్వవ న్మయ్యస్తు పుష్టమ్.
అథర్వ కాం. 18. అను 3. సూ 3 మం., 61.

అర్థములు :

(1) శరీర రక్షకులు, దివ్యగుణయుక్తులగు ఋషులు, మాతనూజాలగు పుత్ర పౌత్రాదులు, మమ్ములను విడువకుందురు గాక! అమరులగు దేవతలు - విద్వాంసులు మర్త్యులగు మా సంబంధమును వదలకుందురు గాక! జీవనము కొఱకు ప్రకృష్టతరమగు నాయువు నొసంగుదురు గాక!

(2) పరమేశ్వరుని ఉపదేశము : మనుజాల కొఱకే సీమను నియతము చేయుచున్నాను. ఇతరుడెవడు నీసీమ నుల్లంఘింపరాదు. మనుష్యుడు నూఱేండ్లు జీవించుగాక! ఇదియే నాయభిప్రాయము. మనుష్య జీవనమునకు సీమ నూఱేండ్లు - నూఱేండ్లు జీవింపుడు. అధికముగా కూడ జీవింపుడు. ఇంతకు ముందు మృత్యువును పర్వతమున కవతల దూరముగా నుంచుడు.

(3) సురక్షకుడు, జీవనదాతయు, సర్వస్వమునిచ్చువాడు, అవిద్యాంధకారమును దూరమొనర్చు పరమేశ్వరుడు మన కభయ మిచ్చుగాక! ఈ గృహమున మాకనేకులు శూరవీరులు జన్మింతురు గాక! నాలో గోవులు, అశ్వములు మున్నగు పశుసంపద గలిగియుండు శక్తి యుండునుగాక - పరమేశ్వరుని కృపవలననది కలుగును గాక యని యభిప్రాయము.

సమాప్తము

......

# 5. నామకరణ సంస్కారము

అత్రప్రమాణమ్

1. నామ చాస్మై దద్యుః
2. ఘోషవ దాద్యన్తరంతఃస్థ మభినిష్ఠానాన్తం ద్వ్యక్షరమ్
3. చతురక్షరం వా
4. ద్వ్యక్షరం ప్రతిష్ఠాకామ శ్చతురక్షరం బ్రహ్మవర్చసకామ
5. యుగ్మాని త్వేవ పుంసామ్
6. అయుజాని స్త్రీణామ్
7. అభివాదనీయం చ సమీక్షేత తన్మాతాపితరౌ విదధ్యాతా మోపనయనాత్

ఇత్యాశ్వలాయన గృహ్యసూత్రేషు. 1-15-4 నుండి 10

"దశమ్యా ముత్థాప్య పితా నామ కరోతి, ద్వ్యక్షరం వా చతురక్షరం ఘోషవ దాద్యన్తరన్తఃస్థం దీర్ఘాభినిష్ఠానాం తం కృతం కుర్యాన్న తద్ధితమ్ అయుజాక్షర మాకా రాన్తగ్ం స్త్రియై శర్మ బ్రాహ్మణస్య వర్మ క్షత్రియస్య గుప్తేతి వైశ్యస్య" పా. గృ 1-17-1 నుండి 4.

ఇట్లే గోభిలీయ శౌనక గృహ్య సూత్రములందును వ్రాయబడి యున్నది.

నామకరణము - పుట్టిన బాల బాలికలకు పేరు పెట్టుట.

నామకరణ కాలము :

పుట్టిన రోజునుండి 11 పదునొకండవ, 101 నూటయొకటవ దినమునగాని, రెండవ సంవత్సరము పుట్టిన దినమునగాని నామకరణము చేయవలయును.

పేరు పెట్టదలచిన దినమున మిక్కిలి సంతోషముతో ఇష్ట మిత్రులను, హితైషులను, బంధు బాంధవులను పిలుచుకొని యథావిధి సంస్కారము చేయవలయును. క్రియారంభము యజమానుడగు బాలకుని తండ్రి పురోహితుడు - ఋత్విజాలు చేయుదురు.

యజ్ఞక్రియలు :

యజ్ఞవేదిక యందు యజ్ఞకుండము, ఆసనములు, జలపాత్రలు, సామగ్రి, సమిధలునన్నియు నమర్చి యజమానుడు పూర్వాభిముఖుడై కుండమునకు పశ్చిమమున గూర్చుండును. ఋత్విజాలు యథాస్థానము నలంకరింతురు. యజమానుని పత్ని యజమానునకు వామ భాగమున గూర్చుండును.

"ఓం అమృతో పస్తరణమసి"

(అనునిట్టి మంత్రములతో సామాన్య ప్రకరణమున జెప్పినట్లు)

ఆచమనము - అంగస్పర్శము– సంకల్పము (పూర్వ సంస్కారములందు జూపినట్లు) పురోహిత వరణము జరుపనగును. ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన, స్వస్తివాచన, శాంతికరణ మంత్రముల నుచ్చస్వరముతో పఠింపనగును.

" ఓం భూర్భువః స్వః" అని కర్పూరము వెలిగించి

" ఓం భూర్భువః స్వర్ ద్యౌరివ భూమ్నా ..."

అను మంత్రముతో అగ్న్యాధానము, సమిధాధానము, ప్రజ్వలనము, జలప్రసేచనము చేయవలయును. అఘారావాజ్య భాగాహుతులు 4,వ్యాహృత్యాహుతులు నాలుగు, 'త్వన్నో అగ్నే........' ఇత్యాది మంత్రములతో నెనిమిది (8) ఆహుతులు నేతితో నీయదగును.

తరువాత స్నానము చేయించి శుద్ధ వస్త్రములు ధరింపజేసి యుంచిన బాలకుని, తల్లి తన ఎడమ చేతిలో ఉంచుకొని కుడిచేతిలో బాలకుని తలనుంచి పట్టుకొని వేదిక దగ్గఱకు తెచ్చి భర్తకు కుడిచేతివైపున నిలబడి యాబాలకుని తండ్రి చేతులలో తల ఉత్తర దిశకు, కాళ్ళు దక్షిణ దిశకు నుండునట్లుంచి, తాను భర్తకు

వెనుక వైపుగా వచ్చి యతని వామభాగమున గూర్చుండి బాలకుని తన యొడిలోనికి తీసికొన వలయును- బాలకుని శిరస్సు ఉత్తరదిశకే యుండవలయును.

తరువాత నామకరణ సంస్కారమున ప్రత్యేకముగ జేయదగు క్రియల నాచరింప వలయును.

"ఓం ప్రజాపతయే స్వాహా"

అని నేతి యాహుతి నియ్యదగును. తదుపరి బాలకుడు జన్మించిన తిథి, నక్షత్రముల నామములతో రెండు నేతి యాహుతులు, జన్మతిథి నక్షత్రముల దేవతల పేర్లతో రెండు ఆహుతులు కలిపి నాలుగు (4) ఆహుతుల నియ్యవలయును.

1. తిథి ఆహుతి  2. తిథి దేవత ఆహుతి
3. నక్షత్రముపేర ఆహుతి  4. నక్షత్ర దేవతపేర ఆహుతి

ఈ క్రమమున ఆహుతులియ్య దగును, తిథి, నక్షత్రములయు దాని దేవతలయు నామములు చతుర్థీ విభక్తిలో నుచ్చరించి స్వాహా యని ఆహుతినియ్య వలయును. ఉదాహరణ కొఱకు - ఒక బాలుడు పాడ్యమి నాడు పుట్టిన-

1. ఓం ప్రతిపదే స్వాహా  2. ఓం బ్రహ్మణే స్వాహా
3. ఓం అశ్విన్యై స్వాహా  4. ఓం అశ్విభ్యాం స్వాహా

అని ఇట్లా ఆహుతులియ్యవలయును.

---

| | తిథి | దేవత |
|---|---|---|
| 1. | ఓం ప్రతిపదే స్వాహా | ఓం బ్రహ్మణే స్వాహా |
| 2. | ఓం ద్వితీయాయై స్వాహా | ఓం త్వష్ట్రే స్వాహా |
| 3. | ఓం తృతీయాయై స్వాహా | ఓం విష్ణవే స్వాహా |
| 4. | ఓం చతుర్థ్యై స్వాహా | ఓం యమాయ స్వాహా |
| 5. | ఓం పంచమ్యై స్వాహా | ఓం సోమాయ స్వాహా |

| | | |
|---|---|---|
| 6. | ఓం షష్ట్యై స్వాహా | ఓం కుమారాయ స్వాహా |
| 7. | ఓం సప్తమ్యై స్వాహా | ఓం మునయే స్వాహా |
| 8. | ఓం అష్టమ్యై స్వాహా | ఓం వసవే స్వాహా |
| 9. | ఓం నవమ్యై స్వాహా | ఓం శివాయ స్వాహా |
| 10. | ఓం దశమ్యై స్వాహా | ఓం ధర్మాయ స్వాహా |
| 11. | ఓం ఏకాదశ్యై స్వాహా | ఓం రుద్రాయ స్వాహా |
| 12. | ఓం ద్వాదశ్యై స్వాహా | ఓం వాయవే స్వాహా |
| 13. | ఓం త్రయోదశ్యై స్వాహా | ఓం కామాయ స్వాహా |
| 14. | ఓం చతుర్దశ్యై స్వాహా | ఓం అనంతాయ స్వాహా |
| 15. | ఓం పూర్ణిమాయై స్వాహా | ఓం విశ్వేదేవేభ్యః స్వాహా |
| 16. | ఓం అమావాస్యాయై స్వాహా | ఓం పితృభ్యః స్వాహా |

| | నక్షత్రము | దేవత |
|---|---|---|
| 1. | ఓం అశ్విన్యై స్వాహా | ఓం అశ్విభ్యాం స్వాహా |
| 2. | ఓం భరణ్యై స్వాహా | ఓం యమాయ స్వాహా |
| 3. | ఓం కృత్తికాయై స్వాహా | ఓం అగ్నయే స్వాహా |
| 4. | ఓం రోహిణ్యై స్వాహా | ఓం ప్రజాపతయే స్వాహా |
| 5. | ఓం మృగశీర్షాయస్వాహా | ఓం సోమాయ స్వాహా |
| 6. | ఓం ఆర్ద్రాయై స్వాహా | ఓం రుద్రాయ స్వాహా |
| 7. | ఓం పునర్వసవే స్వాహా | ఓం అదితయే స్వాహా |
| 8. | ఓం పుష్యమ్యై స్వాహా | ఓం బృహస్పతయే స్వాహా |
| 9. | ఓం ఆశ్లేషాయై స్వాహా | ఓం సర్పాయ స్వాహా |
| 10. | ఓం మఘాయై స్వాహా | ఓం పిత్రే స్వాహా |
| 11. | ఓం పూర్వాఫల్గున్యై స్వాహా | ఓం భగాయ స్వాహా |
| 12. | ఓం ఉత్తరాఫల్గున్యై స్వాహా | ఓం అర్యమ్ణే స్వాహా |

| | | |
|---|---|---|
| 13. | ఓం హస్తాయ స్వాహా | ఓం సవిత్రే స్వాహా |
| 14. | ఓం చిత్రాయై స్వాహా | ఓం త్వష్ట్రే స్వాహా |
| 15. | ఓం స్వాతయే స్వాహా | ఓం వాయవే స్వాహా |
| 16. | ఓం విశాఖాయై స్వాహా | ఓం ఇంద్రాగ్నీభ్యాం స్వాహా |
| 17. | ఓం అనురాధాయై స్వాహా | ఓం మిత్రాయ స్వాహా |
| 18. | ఓం జ్యేష్ఠాయై స్వాహా | ఓం ఇంద్రాయ స్వాహా |
| 19. | ఓం మూలాయ స్వాహా | ఓం నిర్ఋతయే స్వాహా |
| 20. | ఓం పూర్వాషాఢాయై స్వాహా | ఓం అద్భ్యః స్వాహా |
| 21. | ఓం ఉత్తరాషాఢాయై స్వాహా | ఓం విశ్వేదేవేభ్యః స్వాహా |
| 22. | ఓం శ్రవణాయ స్వాహా | ఓం విష్ణవే స్వాహా |
| 23. | ఓం ధనిష్ఠాయై స్వాహా | ఓం వసవే-వసుభ్యః స్వాహా |
| 24. | ఓం శతభిషజే స్వాహా | ఓం వరుణాయ స్వాహా |
| 25. | ఓం పూర్వాభాద్ర పదాయై స్వాహా | ఓం అజైకపాదే స్వాహా |
| 26. | ఓం ఉత్తరాభాద్ర పదాయై స్వాహా | ఓం అహిర్బుధ్న్యాయ స్వాహా |
| 27. | ఓం రేవత్యై స్వాహా | ఓం పూష్ణే స్వాహా |

తరువాత –స్విష్ట కృదాహుతి క్రింది మంత్రములతో -

"ఓం యదస్యకర్మణోఽత్యరీరిచం యద్వాన్యూనమిహాకరం అగ్నిష్టత్ స్విష్టకృద్ విద్యాత్ సర్వం స్విష్టం సుహుతం కరోతు మే అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమర్ధయిత్రే సర్వాన్నః కామాన్ త్సమర్ధయ స్వాహా-

ఇద మగ్నయే స్విష్టకృతే ఇదం న మమ

వ్యాహృతి ఆహుతులు(4)

1. ఓం భూరగ్నయే స్వాహా –ఇద మగ్నయ ఇదం న మమ.
2. ఓం భువర్వాయవే స్వాహా– ఇదం వాయవ ఇదం న మమ.

3. ఓం స్వరాదిత్యాయ స్వాహా- ఇద మాదిత్యాయ ఇదం న మమ.

4. ఓం భూర్ భువః స్వ రగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా
ఇదమగ్ని వాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ.

ఇట్లు ఐదాహుతుల నిచ్చి తదుపరి తండ్రి తల్లి యొడిలో నున్న బాలకుని ముక్కు దగ్గఱగా తన చేతినుంచి ముక్కునుండి వెలువడు వాయువును స్పర్శించుచు నీక్రింది మంత్రములను పఠింప వలయును.

1. "ఓం కోఽసి కతమోఽసి కస్యాసి కో నామాసి,
యస్య తే నామామన్మహి యం త్వా సోమే నాతితృపామ.

2. ఓం భూర్ భువః స్వః సుప్రజాః ప్రజాభిః స్యాగ్ం
సువీరో వీరైః సుపోషః పోషైః" యజు. అ. 7-28.

3. ఓం కోఽసి కతమోఽస్యే షోఽస్యమృతోఽసి
ఆహస్పత్యం మాసం ప్రవిశాసౌ" మం.బ్రా 1-15-14.

ఈ మంత్రమున చివర గల 'అసౌ' పదస్థానమున బాలకుని పేరునుచ్చరింప వలయును. రెండుకాని, నాలుగుకాని, అక్షరములు గల నామము పెట్టవలయును. ఆ నామాక్షరములలో ఘోషసంజ్ఞగల యక్షరములు-గ ఘ ఝ,ఙ,జ ఝ ఞ, డ ఢ ణ, ద ధ న, బ భ మ, –స్పర్శసంజ్ఞ గల అక్షరములు – య ర ల వ - అను నీ యక్షరములలో నేదో యొక యక్షరము తప్పక యుండునట్లు పేరు పెట్టనగును. ఉదాహరణమునకు - దేవ, జయదేవ, అను నామములను గ్రహింపుడు - బాలకుడు బ్రాహ్మణుడగుచో దేవశర్మ, జయదేవ శర్మ అనియు, క్షత్రియుడగుచో దేవ వర్మ, జయదేవ వర్మ అనియు వైశ్యుడగుచో దేవగుప్త, జయదేవగుప్త యనియు శూద్రుడగుచో దేవదాస అనియు నామములు పెట్టనగును. ( వర్ణ వ్యవస్థ అమలులో నున్నపుడు శర్మ, వర్మ, గుప్త, దాస పదములు వాడబడుచుండెడివి. ఇప్పుడు వాని ప్రయోజనము శూన్యము -అనుకర్త)

ఇక బాలిక యగుచో ఒకటి, మూడు, ఐదు అక్షరములు గల నామము పెట్టునది. ఉదాహరణమునకు - శ్రీ, హ్రీ, సుఖదా, యశోదా, సౌభాగ్యప్రదా -ఇత్యాదులు.

ఇట్లు పెట్టబడిన నామము సంస్కారమును జూడవచ్చిన వారికి తెలియునట్లు ప్రసిద్ధముచేసి - మరల పూర్వమంత్రమును జదివి "అసౌ" 'పదస్థానమున బాలకుని నామము సంబోధనాంతముగ జెప్పవలయును.

ఓం కోఽసి కతమోఽస్యేషోఽస్యమృతోఽసి
ఆహస్పత్యం మాసం ప్రవిశ (జయదేవ)

తదుపరి తండ్రి బాలకుని మస్తకముపై తన కుడి యఱచేతినుంచి యీ క్రింది మంత్రముతో జాతకర్మమున బాలకు నాశీర్వదించినట్లాశీర్వదింపవలయును.

ఆశీర్వాద మంత్రము-

ఓం స త్వాహ్నే పరిదదా త్వహ స్త్వా రాత్ర్యై పరిదదాతు రాత్రి స్త్వాఽహోరాత్రాభ్యాం పరిదదా త్వహోరాత్రౌ త్వార్ధమాసేభ్యః పరిదత్తా మర్ధమాసా స్త్వా మాసేభ్యః పరి దదతు. మాసా స్త్వర్తుభ్యః పరిదదతుఋుతవస్త్వా సంవత్సరాయ పరిదదతు, సంవత్సర స్త్వాఽఽయుషేజరాయై పరిదదాతు అసౌ. (ఇక్కడను సంబుద్ధ్యంత నామము నుచ్చరించునది.)

ఇట్లు బాలకు నాశీర్వదించి సంస్కారము పూర్తిచేయునది, సంస్కారమునకు వచ్చిన పెద్దల కానామము వినిపింప వలయును.

తదుపరి మహావామదేవ్యగానము చేసి వచ్చిన పెద్దలకు - పురోహితులకు ఆదరసత్కారములు చేసి సాగనంపవలయును. పెద్దలు తాము వెళ్ళుటకు ముందు పరమేశ్వరుని ప్రార్థించి యీ క్రింది వాక్యములతో బాలకు నాశీర్వదింపవలయును.

ఆశీర్వాదము :-

హే బాలకః త్వమ్ ఆయుష్మాన్ వర్చస్వీ
తేజస్వీ శ్రీమాన్ భూయాః

ఓ బాలక। (నామసంబోధనము చేసి) నీవు ఆయుష్మంతుడవు, వర్చస్వివి, తేజస్వివి, శ్రీమంతుడవు గమ్ము.

హే బాలికే! త్వం ఆయుష్మతీ, వర్చస్వినీ.
తేజస్వినీ శ్రీమతీ భూయాః

ఓ బాలికా నీవు ఆయుష్మతివి, వర్చస్వినివి, తేజస్వినివి, శ్రీమతివి అగుదువు గాక!

సమాప్తము

........................

# 6. నిష్క్రమణ సంస్కారము

బాలకుని ఇంటినుండి బయటికి తీసికొనివెళ్ళి శుద్ధమైన వాయువు గల ప్రదేశమున త్రిప్పుట నిష్క్రమణమన బడును. సమయము బాగుగ నున్నపుడెప్పుడైనను బాలకుని బయట త్రిప్పవచ్చును. నాల్గవ మాసమున తప్పక బాలుని బయట త్రిప్పవలయును.

"చతుర్థే మాసి నిష్క్రమణికా సూర్యముదీక్షయతి.

'తచ్చక్షురితి' ఇది ఆశ్వలాయన గృహ్యసూత్ర వచనము.

"జననాద్యస్తృతీయో జ్యౌత్స్నస్తస్య తృతీయాయామ్"

ఇది గోభిల గృహ్య సూత్రము. 2-8-1.

పారస్కర గృహ్య సూత్రమునను నిదియున్నది.

పై వాక్యముల అర్థములు : నిష్క్రమణ కాల విషయమున రెండు విధములగు నభిప్రాయములున్నవి.

1. బాలకుని జన్మ తరువాత మూడవ శుక్లపక్షపు తృతీయాతిథియందు నిష్క్రమణ సంస్కారము చేయనగును.

2. నాల్గవ మాసమున బాలకుడు జన్మించిన తిథియందు నిష్క్రమణము చేయనగును.

సంస్కారము చేయదలచిన రోజున ప్రాతఃసమయమున సూర్యోదయమైన పిదప బాలకునకు స్నానము చేయించి శుద్ధమైన వస్త్రములను ధరింపజేయునది. తదుపరి తల్లి యతనిని యజ్ఞవేదికకు తీసికొని వచ్చి యట కూర్చుండియున్న భర్తకు కుడివైపుగా వచ్చి యెదుట నిలబడి బాలకుని నతని చేతులలో నుంచవలయును. బాలకుని తల ఉత్తర దిశకు ఉండవలయును. కాళ్ళు దక్షిణమునకు - ఉంచి వెల్లికిల పరుండబెట్టి తాను భర్తకు వెనుక వైపుగా వచ్చి యతనికి ఎడమవైపున కూర్చుండవలయును.

అంతటు భర్త యీ క్రింది మంత్రములతో పరమాత్మ నారాధించి బాలకుని తల్లికిచ్చును.

ఆరాధన మంత్రములు :

1. ఓం యత్తే సుసీమే హృదయగ్ం హితమంతః ప్రజాపతౌ.
   వేదాహం మన్యే తద్ బ్రహ్మ మాహం పౌత్రమఘం నిగామ్.

2. ఓం యత్ పృథివ్యా అనామృతం దివి చంద్రమసి శ్రితమ్
   వేదామృతస్యాహం నామ మాహం పౌత్రమఘగ్ం రిషమ్

3. ఓం ఇంద్రాగ్నీ శర్మ యచ్ఛతం ప్రజాయై మే ప్రజాపతీ.
   యథాయం న ప్రమీయేత పుత్రో జనిత్ర్యా అధి.

మం. బ్రా 1-5-10, 11, 12

(జాతకర్మ సంస్కారమున వీని యర్థములు చూడనగును)

పై మంత్రములతో పరమేశ్వరు నారాధించి బాలకుని తల్లి కందింప వలయును.

## యజ్ఞ కార్యము

సామాన్య ప్రకరణమున నున్నట్లు ఈశ్వరస్తుతి ప్రార్థనో పాసన స్వస్తివాచనము, శాంతి కరణ మంత్రములను పఠించునది తదుపరి, ఆచమన, అంగస్పర్శ, అగ్న్యాధాన, సమిధాధాన, ప్రజ్వలన, జలప్రసేచనాదులు జరుపునది. ఆపైన ఆఘారావాజ్య భాగాహుతులు నాలుగు, వ్యాహృతి ఆహుతులు నాలుగు నేతితో నిచ్చునది.

తదుపరి బాలుని శిరస్సును స్పృశించి యీ క్రింది మంత్రములు పఠించునది.

1. ఓమ్ అంగాదంగాత్ సంభవసి హృదయా దధిజాయసే
   ఆత్మా వై పుత్ర నామాసి స జీవ శరదః శతమ్.

2. ఓమ్ ప్రజాపతే ష్ట్వా హింకారేణావజిఘ్రామి.
   సహస్రాయుషా ऽసౌ జీవ శరదః శతమ్.

3. ఓం గవాం త్వా హింకారేణావజిఘ్రామి,
సహస్రాయుషా ఽసౌ జీవ శరదః శతమ్.

బాలుని చెవిలో మంత్రజపము

1. ఓమ్ అస్మే ప్రయన్ధి మఘవన్నృజీషన్నింద్ర రాయో విశ్వవారస్య భూరేః, అస్మే శతగ్ం శరదో జీవసే ధా అస్మే వీరాఞ్ఛశ్వత ఇంద్ర శిప్రిన్

2. ఓమ్ ఇంద్ర శ్రేష్ఠాని ద్రవిణాని ధేహి చిత్తిం దక్షస్య సుభగత్వమస్మే పోషం రయీణా మరిష్టిం తనూనాగ్ం స్వాద్మానం వాచః సుదినత్వ మహ్నామ్.

పా.గృ. 1-18-4, 5.

ఇందు మొదటి మంత్రము బాలుని కుడిచెవియందును, రెండవది యెడమ చెవియందును తండ్రి జపింపవలయును. ఈ క్రియలు జరుగునపుడు బాలుడు తండ్రి యొడిలోనే యుండును. తదుపరి బాలుని తల్లి చేతులలో ఉత్తరమునకు తల, దక్షిణమునకు కాళ్ళు నుండునట్లీయవలయును....... తరువాత పత్ని శిరస్సును మౌనముతో స్పృశించును.

## సూర్యదర్శనము

తదుపరి ఆనందముతో బాలునకు సూర్యుని జూపించి యీ క్రింది మంత్రమును పఠించునది.

ఓం తచ్చక్షుర్ దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్, పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతగ్ం శృణుయామ శరదః శతం ప్రబ్రవామ శరదః శతమదీనాః స్యామ శరదః శతం భూయశ్చ శరదః శతాత్.

తదుపరి శుద్ధవాయువునందు బాలకుని కొంచెము త్రిప్పి, అందఱు క్రింది మాటలతో బాలకు నాశీర్వదించునది.

ఓం త్వం జీవ శరదః శతం వర్ధమానః

ఓ బాలక! నీవు నూఱు వత్సరములు వర్ధిల్లుచు జీవింతువు గాక!

తదుపరి సంస్కారమునకు వచ్చిన వారిని తగినట్లు సత్కరించి పంపవలయును.

తరువాత రాత్రి చంద్రు డాకాశమున ప్రకాశించు సమయమున బాలునకు శుద్ధ సుందర వస్త్రములను తొడిగి భర్త దగ్గఱకు తీసికొని వచ్చి యతనికి కుడివైపుగ ముందుకు వచ్చి పిల్లవానిని తండ్రి చేతులలో ఉత్తరమునకు శిరస్సు నుంచి వెల్లికిల పరుండజేసి తాను భర్తకు కుడివైపుగ వెనుకగా వచ్చి యతని యెడమవైపున నిలబడి చంద్రున కెదురుగా అంజలి దోసిలిలో జలమును నింపుకొని యీ క్రింది మంత్రము పఠించి -

**ఓం యదద శ్చంద్రమసి కృష్ణం పృథివ్యా హృదయగ్ం శ్రితమ్, తదహం విద్యాగ్ం స్తత్ పశ్యన్ మాహం పౌత్రమఘగ్ం రుదమ్. మం. బ్రా. 1-5.13.**

పరమేశ్వరుని స్తుతించి జలమును భూమిపై విడువ వలయును.

తదుపరి ఆమె భర్తకు వెనుకగా కుడివైపు నుండి ముందుకు వచ్చి బాలకుని తన చేతులలోనికి తీసికొని మరల వెనుకగాపోయి భర్తకు నెడమవైపున నిలబడవలయును. బాలుని తల ఉత్తరమునకు కాళ్ళు దక్షిణమునకు తన చేతులలో నుంచవలయును. అప్పుడు బాలకుని తండ్రియు దోసిలిలో జలము నింపుకొని పై మంత్రము (ఓం యదదశ్చంద్ర-పఠించి నీటిని భూమిపై విడుచునది.)

తదుపరి బాలుని ప్రసన్నవదనములతో నింటిలోనికి గొంపోవలయును.

పై మంత్రాభిప్రాయము :-

చంద్రుని యందు నల్లని భూచ్ఛాయ పడుటను నేనెఱుగుదును. దానిని జూచుచు నేను పుత్ర సంబంధమైన దుఃఖమును బొంది దుఃఖించుస్థితి నాకెన్నడు గలుగకుండు గాక!

సమాప్తము

.......................

# 7. అన్న ప్రాశన సంస్కారము

బాలకునకు అన్నము జీర్ణముచేసికొను యోగ్యత కలిగినపుడు అన్నప్రాశన సంస్కారము చేయనగును. ఇందు ప్రమాణములు.

1. షష్ఠే మాస్యన్న ప్రాశనమ్, 2. ఘృతౌదనం తేజ స్కామః 3. దధి మధు ఘృత మిశ్రిత మన్నం ప్రాశయేత్. ఆశ్వ 1-16-1, 4,5.

ఇవి ఆశ్వలాయన గృహ్య సూత్రవచనములు. ఇట్లే పారస్కర గృహ్య సూత్రాదులందును గలదు.

(1) ఆఱవ మాసమున అన్నప్రాశనము చేయింపవలయును.

(2) (3) బాలకుడు తేజస్వి కావలయుననిన ఘృతయుక్తమైన అన్నము కాని, లేక పెరుగు, తేనె, నేయి కలిపిన అన్నముగాని తినిపింపవలయును.

## యజ్ఞక్రియ

సామాన్య ప్రకరణమున జూపినట్లు ఆచమనము మొదలు వ్యాహృతి ఆహుతుల వఱకు యజ్ఞ క్రియల నాచరింపనగును.

దీనికి ముందుగానే అన్నము క్రింద జూపిన విధమున సిద్ధముచేసి యుంచుకొనవలయును.

ఓం ప్రాణాయ త్వా జుష్టం ప్రోక్షామి, ఓం అపానాయ త్వా జుష్టం ప్రోక్షామి, ఓం చక్షుషే త్వా జుష్టం నిర్వపామి, ఓం శ్రోత్రాయ త్వా జుష్టం నిర్వపామి, ఓం అగ్నయే స్విష్టకృతే త్వా జుష్టం నిర్వపామి.

అను నీ వాక్యముల నుచ్చరించుచు బియ్యము కడిగి శుద్ధము చేసి పక్వము చేయవలయును. పక్వము అగుచుండగనే-పాత్ర దించకముందే తగినంత నేయికూడ వేసి అన్నము సిద్ధము చేసి యుంచుకొనవలయును.

బాగుగ పక్వమైన తదుపరి దించి కొంచెము చల్లార్చి క్రింది వాక్యములను చెప్పుచు హోమ పాత్రమున కొంత అన్నము నుంచునది.

1. ఓం ప్రాణాయ త్వా జుష్టం నిర్వపామి 2. ఓం అపానాయ త్వా జుష్టం నిర్వపామి 3. ఓం చక్షుషే త్వా జుష్టం నిర్వపామి 5. ఓం శ్రోత్రాయ త్వా జుష్టం నిర్వపామి 5. ఓం అగ్నయే స్విష్టకృతే త్వా జుష్టం నిర్వపామి.

అన్నముంచబడిన హోమ పాత్రలు యజమానుని దగ్గఱ ఋత్విక్కుల దగ్గఱ నుంచునది.

పైన జెప్పినట్లు వ్యాహృతి ఆహుతుల వఱకు హోమము నేతితో జేసి తదుపరి సిద్ధపఱచిన అన్నముతో నీ క్రింది మంత్రములు పఠించి ఆహుతుల నియ్యవలయును.

## అన్నాహుతులు

1. ఓం దేవీం వాచ మజనయంత దేవాస్తాం విశ్వరూపాః
పశవో వదన్తి, సా నో మంద్రేషమూర్జం దుహానా
ధేనుర్ వాగస్మానుప సుష్టుతైతు స్వాహా
ఇదం వాచే ...........ఇదం న మమ

2. ఓం వాజో నోఽద్య ప్రసువాతి దానం వాజో దేవాగ్ం
ఋతుభిః కల్పయాతి, వాజో హి మా సర్వవీరం జజాన
విశ్వా ఆశా వాజ పతిర్ జయేయగ్ం స్వాహా-
ఇదం వాచే వాజాయ ఇద న్న మమ. యజు. 18-33.

ఇట్లు అన్నాహుతులిచ్చి, ఆయన్నమున నేయి వేసి, దానితో ఆహుతులిచ్చునది.

1. ఓం ప్రాణేనాన్న మశీయ స్వాహా - ఇదం ప్రాణాయ ఇదం న మమ.
2. ఓం అపానేన గంధానశీయ స్వాహా - ఇదమపానాయ ఇదం న మమ.

3. ఓం చక్షుషా రూపాణ్యా శీయ స్వాహా - ఇదం చక్షుషే ఇదం న మమ.
4. ఓం శ్రోత్రేణ యశోऽశీయ స్వాహా - ఇదం శ్రోత్రాయ ఇదం న మమ.

తదుపరి ఓం యదస్యకర్మణో అను మంత్రముతో నాక స్విష్టకృదాహుతి, ఓం భూరగ్నయేస్వాహా అను మంత్రములతో వ్యాహృతి ఆహుతులు 4, ఓం త్వంనో అగ్నే అను మంత్రములతో అష్టాజ్యాహుతులు 8–

పై మంత్రములతో నేతి ఆహుతులనిచ్చి పూర్వమాహుతులు వేయగా మిగిలియున్న అన్నమునందు కొంచెము నేయి, తేనె, పెరుగు తగినట్లు కలిపి సుగంధయుక్తములైన బియ్యముతో జేయబడిన అన్నము వేఱుగానున్న నదియు కొంచెము కలిపి, దాని నీక్రింది మంత్రము పఠించుచు బాలకునకు తినిపింపవలయును.

## ప్రాశన మంత్రము

ఓం అన్నపతేऽన్నస్య నో ధేహ్యనమీవస్యశుష్మిణః ప్ర ప్ర
దాతారం తారిష ఊర్జం నో ధేహి ద్విపదే చతుష్పదే. యజు. 11-83.

ఈ మంత్రముతో కొంచెము అన్నము బాలకుని రుచికి తగినట్లు తల్లి దండ్రులు ముఖ్యబంధువులు బాలకునిచే తినిపింపజేయవలయును. ముఖము శుభ్రము చేయవలయును. మహావామదేవ్య గానము చేసి క్రియ ముగించునది. తల్లి దండ్రులు బంధువులు నెల్లరు పరమేశ్వరుని ప్రార్థించి క్రింది వాక్యముతో బాలకునాశీర్వదింపవలయును.

ఓం త్వ మన్నపతి రన్నాదో వర్ధమానో భూయాః

నీవు అన్నపతివి, అన్నము తినువాడవు, వృద్ధి పొందువాడవు అగుము.

తదుపరి వచ్చిన పెద్దలను తగినట్లు సత్కరించి పంపునది. ఇది యజమానుని కర్తవ్యము.

సమాప్తము

.....................

# 8. చూడాకర్మ సంస్కారము

(పుట్టు వెంట్రుకలు తీయుట)

ఎనిమిదవ సంస్కారము చూడాకర్మ – కేశచ్ఛేదన మనియు దీనినందురు. ఇందు ఆశ్వలాయన గృహ్య సూత్ర మతమిట్లున్నది.

1. తృతీయే వర్షే చౌలమ్. 2. ఉత్తరతోऽగ్నేర్ వ్రీహి యవ మాషతిలానాం శరావాణి నిదధాతి.

పారస్కర గృహ్య సూత్రాదులందు నిట్లేయున్నది.

"సాంవత్సరికస్య చూడాకరణమ్" పా. గృ. 2-1-1.

గోభిలీయ గృహ్య సూత్రమతమునిదియే–ఈ చూడాకర్మ–ముండనము బాలకుడు జన్మించిన యేటగాని, మూడవ యేటగాని చేయవచ్చును. ఉత్తరాయణమున శుక్లపక్షమున నేదోయొక దినమున నెల్లరు ప్రసన్నులుగా నున్నపుడీసంస్కారము జరుపవలయును.

## జరుపు విధానము

యజ్ఞము చేయు స్థలమున నాసనాదులనన్నింటిని తగినట్లు ఏర్పఱచి జల పాత్రాదులనుంచి యజ్ఞకుండమును సిద్ధపఱచ వలయును. దానికి–వేదికి–ఉత్తర దిశయందు నాలుగు మట్టి మూకుళ్ళ నుంచునది. ఒకదానియందు బియ్యము, మఱియొక దానియందు యవలు, మూడవదానిలో మినుములు, నాల్గవ దానిలో నువ్వులు పోసి యుంచునది.

తదుపరి యజమానుడు, అతని పత్ని, పురోహితులు తమ తమ స్థానములలో గూర్చుండి, ఆచమన సంకల్పాదులను జేయునది. తరువాత ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన, స్వస్తి, శాంతికరణ మంత్రముల పఠించి ప్రజ్వలనము, జలప్రసేచనము చేసి, ఓం అగ్నయే స్వాహా అను మంత్రములతో ఆఘారావాజ్య భాగాహుతులు 4, ఓం భూరగ్నయే స్వాహా అను మంత్రములతో వ్యాహృత్యాహుతులు 4, ఓం త్వంనో అగ్నే అను మంత్రములతో అష్టాజ్యాహుతులు 8, ఓం భూర్భువః స్వః అను

మంత్రములతో ప్రధాన హోమాహుతులు 4, ఓం యదస్య కర్మణో అను మంత్రముతో నాక స్విష్టకృదాహుతి నిచ్చి యజమానుడు పరమేశ్వరుని ధ్యానించి యింతకుముందే వచ్చియున్న మంగలి వంక చూచి యీ క్రింది మంత్రమును జపించునది.

ఓమ్ ఆయమగన్ త్సవితా క్షురేణోష్ణేన వాయ ఉదకే నేహి, ఆదిత్యా రుద్రా వసవ ఉన్దన్తు సచేతసః సోమస్య రాజ్ఞో వపత ప్రచేతసః. (అథర్వ. కాం. 6-68-మం. 1)

అర్థము :- క్రొత్త వెంద్రుకలను గలిగించు - నీ మంగలి కత్తితో వచ్చియున్నాడు. వాయువువలె జలమును దెచ్చు మంగలీ ! వేడినీటితో రమ్ము - జ్ఞానులైన ఆదిత్య, రుద్ర, వసుబ్రహ్మచారులును తమ యాశీర్వాదములను బాలకునిపై వర్షింతురుగాక! దీప్తికాముడు - ప్రకాశించు - నీ బాలకునకు జ్ఞానులు ముండన సంస్కారము జరిపింతురుగాక ! అని మంత్రమును జపించి తండ్రి బాలకుని తనముందు కూర్చుండబెట్టుకొని యతని తలను ముందు పాత్రలలోనుంచిన వేడినీటిని, చల్లని నీటిని-

"ఓమ్ ఉష్ణేన వాయ ఉదకేనైధి"

అని రెండు పాత్రలలోని జలమును ఒక పాత్రలో కలిపి ఆ జలమునుండి కొంచెము జలము, కొంచెము పెరుగు తీసికొని-

1. ఓమ్ అదితిః శ్మ శ్రు వపత్వాపఉందన్తు వర్చసా, చికిత్సతు ప్రజాపతిర్ దీర్ఘాయుత్వాయ చక్షసే. అథ, కాం. 6-సూ68-2.
2. ఓమ్ సవిత్రా ప్రసూతా దైవ్యా ఆప ఉందన్తు తే తనూం దీర్ఘాయుత్వాయ వర్చసే. పా, గృ 2-1-9

(ఎక్కడను గంటుపెట్టని) యీ కత్తి వెంద్రుకల నుత్తరించును గాక, తేజ వర్చస్సుతో జలము కేశములను తడుపును, ప్రజాపతి దీర్ఘాయువు, ఉత్తమ దర్శనము కొఱకు బాలకునకు చికిత్సజేయును గాక !

ఓ బాలక ! సూర్యుని ద్వారా యేర్పడిన దివ్య జలము దీర్ఘాయువును వర్చస్సును-తేజస్సును-ఇచ్చుటకు నీశరీరమును తడుపును గాక !

అను నీ మంత్రములను జదివి బాలకుని తలపై చేతితో ముమ్మారు నిమిరి, శిరోజములను తడుపవలయును. తరువాత దువ్వెనతో వెంద్రుకలను దువ్వవలయును. తదుపరి

ఓం ఓషధే త్రాయస్వైనమ్ మం. బ్రా 1-6-5.

ఓషధీ ! ఇతనిని రక్షింపుము. అని బాలుని శిరమున దక్షిణపు వైపు కొన్ని వెంద్రుకలు దర్భపు తునకలతో కలిపి పట్టుకొని-

"ఓం విష్ణోర్ దంష్ట్రోసి" మం. బ్రా. 1-6-4

నీవు విష్ణు దంష్ట్రవు-పదునైనది అని కత్తివంక జూచి-

ఓం శివో నామాసి స్వధితిస్తే పితా నమస్తే అస్తు
మా మాహిగ్ం సీః యజు.3-63.

ఓ కత్తీ ! నీవు కల్యాణకారి నామముగల దానవు. నిన్ను పుట్టించు వాడు- నీపిత వజ్రమయమగు లోహము. నీకు నమస్కారము. నాకు హాని కలిగింపకుము- అని కత్తిని కుడిచేతితో పట్టుకొని-

1. ఓం స్వధితే మైనగ్ం హిగ్ం సీః మం. బ్రా. 1-6-6
2. ఓం నివర్తయా మ్యాయుషేz న్నాద్యాయ
   ప్రజననాయ, రాయస్పోషాయ సుప్రజాస్త్వాయ
   సువీర్యాయ. యజు. 3-63

తండ్రి–నేను ఆయువు వృద్ధికొఱకు, అన్నము జీర్ణింప జేసికొనుటకు, జననశక్తి కొఱకు, ధన, పోషణల కొఱకు, ఉత్తమ సంతాన ప్రాప్తికి, బలపరాక్రమము కొఱకు, నీ వెంద్రుకలను శిరస్సునుండి తొలగించుచున్నాను.

అని కత్తిని దర్భలతో కలిపి పట్టుకొనియున్న వెంద్రుకల దగ్గఱకు తీసికొని పోయి-

ఓం యేనావపత్ సవితా క్షురేణ సోమస్య రాజ్ఞో
వరుణస్య విద్వాన్, తేన బ్రహ్మణో వపతేద
మస్య గోమా నశ్వవా నయమస్తు ప్రజావాన్.

అథర్వ 6-68-3

తెలివిగల మంగలి, సౌమ్యుడు శ్రేష్ఠుడునైన నా కుమారుని వెండ్రుకలు ఖండించునట్లు, జ్ఞానులు ఈ బాలకుని అజ్ఞాన రూప కేశములను ఖండింతురుగాక!

అను నీ మంత్రమును జెప్పి దర్భలతోబాటు వెండ్రుకలను ఖండింప వలయును.

ఖండించిన కేశములు దర్భలతోను, జమ్మి ఆకుతోను కలిపి యొక మట్టి పాత్రలో నుంచునది–ఖండించునపుడిటు వటుపడిన కేశములను గూడ గోమయముతో ఖండిత కేశములతో నుంచవలయును. (దర్భలు జమ్మి ఆకు, గోమయము పూర్వమే తెచ్చియుంచుకొనవలయును.)

తరువాత పూర్వము వలెనే రెండవవైపు-
ఓం యేన ధాతా బృహస్పతే రగ్నే రింద్రస్య చాయు
షే z వపత్, తేన త ఆయుషే వపామి సుశ్లోక్యాయ
స్వస్తయే, ఆశ్వ.గృ. 1-17-12

ధాత-పరమేశ్వరుడు, బృహస్పతి, అగ్ని, ఇంద్రుడు వనువారి మార్గమున గల కంటకములను దొలగించినట్లు నేనును కీర్తి కల్యాణము, దీర్ఘాయువు నీకు లభించుటకు నీముండనము చేయుచున్నాను.

అని రెండవవైపు కేశములను ఖండించి మట్టిపాత్రలో నుంచవలయును-తరువాత-

ఓం యేన భూయశ్చ రాత్ర్యాంజ్యోక్ చ పశ్యాతి సూర్యమ్.
తేన త ఆయుషే వపామి సుశ్లోక్యాయ స్వస్తయే.
ఆ. గృ. 1-17-12

మనుష్యుడు రాత్రియందు చంద్రుని, పగటియందు సూర్యుని జ్యోతిని (భూయః పశ్యతి) మాటిమాటికి చూచునట్లు నేను నీ కీర్తి, కల్యాణము దీర్ఘాయువుల కొఱకు ముండనము చేయుచున్నాను. అని మూడవవైపు వెండ్రుకల పూర్వమువలె యుత్తరించి మట్టి పాత్రలో నుంచవలయును.

తదుపరి పై మూడు మంత్రములు–ఓం యేనావపత్–ఓం యేన ధాతా–

....ఓం యేన భూయశ్చ............ అను నీ మంత్రములు చదివి నాల్గవదియైన యీ క్రింది-

ఓం యేన పూషా బృహస్పతే ర్వాయో రింద్రస్య
చావపత్, తేన తే వపామి బ్రహ్మణా జీవాతవే
జీవనాయ దీర్ఘాయుష్ట్వాయ వర్చసే, మం. బ్రా. 1-6-7

పూషా–పరమేశ్వరుడు, బృహస్పతి, వాయువు, ఇంద్రుడు నను వారి యాయువును రక్షించుటకెట్లు వారి మార్గబాధలను తొలగించునో నేనును నీ దీర్ఘాయువు మున్నగువాని కొఱకు నీ ముండనము చేయుచున్నాను.

మంత్రము జదివి నాల్గవ వైపు వెంద్రుకలను ఖండించి–కత్తితో గాని, కత్తెరతో గాని–మట్టి పాత్రలో నుంచునది.

కాని నాల్గవమాటు కేశఖండనము చేయునపుడు పైన జూపిన "యేన పూషా......." అను మంత్రమునకు బదులు ఈ క్రింది మంత్రమును పఠించి ఖండించ వలయును.

ఓం యేన భూరిశ్చరాదివం జ్యోక్చ పశ్చాద్ధి సూర్యమ్.
తేన తే వపామి బ్రహ్మణా జీవాతవే జీవనాయ
సుశ్లోక్యాయ స్వస్తయే పా. గృ. 2-1-16.

తరువాత :-

ఓం త్ర్యాయుషం జమదగ్నేః కశ్యపస్య త్ర్యాయుషం,
యద్దేవేషు త్ర్యాయుషం తన్నో అస్తు త్ర్యాయుషమ్.
యజు. 3-62

అను నీ మంత్రమును జదివి బాలకుని శిరస్సు వెనుకవైపు వెంద్రుకలను ఖండించి, యీ మంత్రమునే పఠించుచు తండ్రి తనచేతితో పిల్లవాని శిరస్సు బాగుగ తడిపి కత్తిని మంగలికిచ్చి పదును బెట్టించవలయును.

ఓం యత్ క్షురేణ మర్చయతా సుపేశసా వప్తా
వపసి కేశాన్, శుంధి శిరో మాస్యాయుః ప్రమోషీః
ఆ. గృ. 1-17-15

మంగలితో "ఓ మంగలీ! బాలకుని శిరస్సును శీతోష్ణ జలముతో తడిపి ఎక్కడను గంటు పడకుంటునట్లు జాగ్రత్తగా వెండ్రుకలన్నింటిని ఖండింపుము." అని చెప్పవలయును. పిల్లవానిని మంగలిముందు పూర్వాభిముఖముగా కూర్చుండబెట్టునది. పంచశిఖలు ఉంచి కాని, ఒక శిఖయుంచికాని, మిగిలిన వెండ్రుకలన్నియు తీసివేయించవలయును. లేదా, శిరస్సంతయు ముండనము చేయించవచ్చును. ముందు రానున్న వెండ్రుకలు బాగుండును కావున అప్పుడు శిఖను ఉంచుకొనవచ్చును.

ఇట్లుక్షౌర కార్యము ముగిసిన తదుపరి కుండమునకు ఉత్తర దిశయందుంచిన ధాన్య పూర్ణ పాత్రలు మంగలికిచ్చి వేయునది. అతనికి వస్త్రాదులు దక్షిణ ఇచ్చి పంపనగును. ఖండిత కేశములు, దర్భలు, జమ్మి ఆకు, గోమయము నన్నియు, మంగలి ద్వారా ఇంటికి వెలుపల కాళీ ప్రదేశమున గొయ్యి త్రవ్వించి యందు వానినుంచి పూడ్పింప వలయును. నదీతీరముననో, చెఱువు సమీపముననో, గోశాల దగ్గఱనో పూడ్పింప జేయవచ్చును.

బాలుని తలపై పెరుగుగాని, మీగడగాని రాచి బాగుగ స్నానము చేయింపవలయును. శుద్ధ వస్త్రములను ధరింపజేసి పుష్పమాలచే నలంకరించి బాలకుని తన సమీపమున పూర్వాభిముఖునిగా గూర్చుండబెట్టి, వామదేవ్యగాన మొనర్చిన పిదప ఈ క్రింది వాక్యముతో బాలకునాశీర్వదింపజేయునది.

ఆశీర్వాదము :-

ఓం త్వం జీవ శరదః శతం వర్ధమానః.

"ఓ బాలక ! నీవు నూఱు సంవత్సరములు వర్ధిల్లుచు జీవింపుము" అని ఆశీర్వదించునది. తదుపరి వచ్చిన పెద్దలకు బాలకుని తండ్రి మగవారికి తల్లి స్త్రీలకు తగిన సత్కారముచేసి సాగనంపవలయును. తల్లిదండ్రులు ప్రసన్నులై బాలకుని ప్రసన్నుని జేయనగును.

సమాప్తము

.....................

# 9. కర్ణవేధ సంస్కారము

(చెవులు కుట్టుట)

అత్ర ప్రమాణము :-

కర్ణ వేధో వర్షే తృతీయే పంచమే ఆ. గృ. 1-17

ఇది ఆశ్వ లాయన గృహ్య సూత్ర వచనము. బాలబాలికలు పుట్టిన నాటనుండి మూడవ యేటగాని, ఐదవ యేట గాని చెవులు, నాసిక కుట్టుట యుచితము.

చెవులు, నాసిక కుట్టుటకు నిర్ణయించిన దినమున ప్రాతఃకాలమున యజ్ఞవేదిక నలంకరించి యటకు కావలసిన యజ్ఞ సంబంధమైన వస్తువులనన్నిటిని సమకూర్చ వలయును. బాలకునకు చక్కగా స్నానము చేయించి శుద్ధ సుందర వస్త్రములను ధరింపజేసి బాలకుని తల్లి బాలకుని యజ్ఞవేదికకు తీసికొని రావలయును. బాలకుడు తినుటకు తగిన వస్తువును గాని, ఆటబొమ్మలను గాని యతని సమీపమున నుంచునది.

యజమానుడు పురోహితుడు యథాస్థానమున గూర్చుండి ఆచమన, సంకల్పములను జేసి యజ్ఞక్రియను ప్రారంభింపవలయును.

ఈశ్వరస్తుతి, ప్రార్థన, ఉపాసనను జేసి అగ్న్యాధానము, సమిధా ధానము, ప్రజ్వలనము, జలప్రసేచనము, ఓం అగ్నయే స్వాహా అను మంత్రములతో 4 అఘారావాజ్య భాగాహుతులు, ఓం భూరగ్నయే స్వాహా అను మంత్రములతో 4 వ్యాహృత్యాహుతులు, ఓం యదస్య కర్మణో అను మంత్రముతో నొక స్విష్టకృత్, ప్రాజాపత్యాహుతులు, ఓం భూర్భువః స్వః అగ్న–అను మంత్రములతో 4 ప్రధాన హోమాహుతులు, అష్టాజ్యాహుతులు ఓం త్వం నో–అను మంత్రములతో, దైనిక ఆహుతులు నన్నియు సామాన్య ప్రకరణమున జూపినట్లు చేయవలయును.

తదుపరి, నాడిని తప్పించి చెవులు కుట్టగలిగిన వ్యక్తి ద్వారా ఈ క్రింది మంత్రములను బఠించి క్రమముగా కుడియెడమ చెవులను గుట్టవలయును. కుట్టువ్యక్తి చరక సుశ్రుతాది వైదిక గ్రంథములను జదివిన సద్వైద్యుడుగా నుండుట శ్రేయస్కరము.

కుడి చెవిని గుట్టునపుడు–మంత్రము:-

ఓం భద్రం కర్ణేభిః శృణుయామ దేవా భద్రంపశ్యే
మాక్షభిర్ యజత్రాః, స్థిరై రంగై స్తుష్టువాగ్ంసస్తనూ
భిర్ వ్యశేమహిదేవహితం యదాయుః. యు25-21

దివ్యగుణయుక్త పరమేశ్వరుని భక్తులార! కర్ణములతో మేము శుభములను విందుముగాక ! నేత్రములతో శుభములనే చూతుముగాక. దృఢములైన అంగములతోను శరీరములతోను ప్రభువుచే నియతమైన ఆయువు ననుభవింతుము గాక!

ఎడమచెవి కుట్టునపుడు చదువు మంత్రము :-
ఓం వక్ష్యన్తీ వేదా గనీగన్తి కర్ణం ప్రియగ్ం సఖాయం
పరిషస్వజానా, యోషేవ శిఙ్క్తే వితతాధిధన్వన్ జ్యా
ఇయగ్ం సమనే పారయన్తీ యజు. 29-40

ప్రియురాలు భర్త చెవి చెంతజేరి రహస్యాలాపము లాడునట్లు, యుద్ధమున ధనుర్గుణము సారించినపుడు యోధుని చెవి చెంతజేరి గున్‌గున్ ధ్వని చేయును.

మంత్రము చదివి యెడమ చెవి కుట్టవలయును. తదుపరి యీ వైద్యుడే చెవుల ఛిద్రములు పూడకుండునట్లు వానిలో పుల్లలనుంచ వలయును. చీము పట్టకుండునట్లు ఓషధి రాయవలయును. అందువలన త్వరగా చెవులు బాగుపడును.

సమాప్తము

.......................

# 10. ఉపనయన సంస్కారము

అత్ర ప్రమాణాని :-

1 అష్టమే వర్షే బ్రాహ్మణ ముపనయేత్,2. గర్భాష్టమే వా 3 ఏకాదశే క్షత్రియమ్. 4 ద్వాదశే వైశ్యమ్. 5 ఆషోడశాద్ బ్రాహ్మణస్యానతీత: కాల: 6 ఆద్వావింశాత్ క్షత్రియస్య. ఆచతుర్వింశాద్ వైశ్యస్య. అతఊర్ధ్వం పతిత సావిత్రీకా భవంతి.

ఆశ్వలాయన గృహ్య సూత్ర వాక్యములు.1-19-1 నుండి 6

ఇవి ఆశ్వలాయన గృహ్యసూత్ర వాక్యములు. ఇట్లే పారస్కరాది గృహ్య సూత్రముల ప్రమాణములున్నవి.

అర్థములు:- జన్మించిన నాటనుండి కాని, గర్భమేర్పడిన నాటనుండి కాని ఎనిమిదవ యేట బ్రాహ్మణునకు, పదునొకండవ యేట క్షత్రియునకు, పండ్రెండవ యేట వైశ్యునకు యజ్ఞోపవీత సంస్కారములు జరుపనగును. ఆ సమయములు తప్పినచో బ్రాహ్మణ బాలకునకు పదునారు సంవత్సరములకు, క్షత్రియ బాలునకు 22 సంవత్సరములకు, వైశ్యబాలకునకు 24 వర్షములకు పూర్వమున నైనను యజ్ఞోపవీత ధారణము చేయింపనగును. ఈ చెప్పిన సమయమున సంస్కారము జరుపని పక్షమున వారు పతిత సావిత్రులుగా నెంచబడుదురు.

బ్రహ్మవర్చస కామస్య కార్యం విప్రస్య పంచమే,<br>
రాజ్ఞో బలార్థిన: షష్ఠే వైశ్యస్యేహార్థి నోఽష్టమే. మనువు 2-37

తమ పిల్లలకు క్రమముగా విద్య, బలము, వ్యవహారము – వ్యాపారము అలవడవలయునని కోరువారి పిల్లలుకూడ విద్యాబుద్ధులు నేర్చుటలో సమర్థులగు నెడల బ్రాహ్మణ బాలకునకు గర్భమునుండి కాని జన్మమునుండి కాని ఐదవ యేటను, క్షత్రియ బాలకునకు ఆఱవ యేటను, వైశ్యబాలకునకు ఎనిమిదవ యేటను యజ్ఞోపవీతము వేయవలయును.

కాని, బాలకుని తల్లి దండ్రులు పూర్ణ బ్రహ్మచర్యము పాలించి వివాహితులైయుండిన నాడే పైన జెప్పిన కాలములో ఉపనయనము జరుపుట సంభవమగును. అట్టివారి సంతానమే శ్రేష్ఠ బుద్ధి, బలము, సామర్థ్యము గలవారై వృద్ధినొందువారగుదురు. బాలకుని బుద్ధి శరీరము చదువుటకు తగిన యోగ్యత కలవియైనపుడే యజ్ఞోపవీత సంస్కారము చేయనగును.

యజ్ఞోపవీత సంస్కారసమయము :-

వసంతే బ్రాహ్మణముపనయేత్ – గ్రీష్మే రాజన్యమ్ – శరది వైశ్యమ్, సర్వకాలమేకే, ఇదిశతపథ బ్రాహ్మణ వచనము.

అర్థము :- సూర్యుడుత్తరాయణమున నున్నపుడు వసంతమున బ్రాహ్మణునకు, గ్రీష్మమున క్షత్రియునకు సంస్కారము జరుపునది. శరత్ కాలమున వైశ్యునకు యజ్ఞోపవీతము వేయవలయును. లేక, సర్వ ఋతువులందును ఉపనయనము జరుపదగుననియు కొందఱందురు.

ప్రాతఃకాలముననే సంస్కారము జరుపవలయును.
పయోవ్రతో బ్రాహ్మణో యవాగూవ్రతో రాజన్య
ఆమిక్షావ్రతో వైశ్యః.

శతపథ బ్రాహ్మణ వచనము, తై.ఆ. 2-8. యజ్ఞోపవీత సంస్కారము జరుప నిశ్చయించిన దినమునకు పూర్వము మూడు దినములు కాని లేక కనీసమొక దినము కాని బాలకునిచే వ్రతము చేయింప వలయును. బ్రాహ్మణ బాలకుడు వ్రతదినమున ఒకసారి కాని పలుమాఱులు కాని పాలుత్రాగవలయును. క్షత్రియ బాలకుడు యవలతో చేయబడిన జావ (బెల్లము కలిపి చేసినది) త్రాగవలయును. వైశ్య బాలకుడు ఆమిక్షా - శ్రీఖండమును తినవచ్చును. (శ్రీఖండము పెరుగు నాల్గు పాళ్ల పాలు ఒక భాగము తగినంత చక్కెర కుంకుమ పువ్వువేసి గుడ్డలో వడకట్టి సిద్ధము చేయబడును) దానిని త్రాగి వైశ్య బాలకుడు వ్రతమాచరింపనగును.

## -: సంస్కారము చేయువిధి :-

సంస్కారము జరుపు దినమునకు పూర్వదినముననే కావలసిన పదార్థములన్నియు సంపాదించి వాని శుద్ధము చేసియుంచు కొనవలయును. సంస్కారము జరుపు దినమున ప్రాతః బాలకునకు క్షౌరముచేయించి, స్నానము శుద్ధ జలముతో చేయించి శుద్ధ వస్త్రములను ధరింప జేయవలయును. తదుపరి కొంచెము మిష్టాన్నము తినిపించి తండ్రి కాని, ఆచార్యుడు కాని బాలకుని యజ్ఞకుండమునకు పశ్చిమ భాగమున పూర్వాభిముఖముగా నాసనముపై గూర్చుండ జేయనగును. బాలకుని తండ్రి పురోహితుడు–ఆచార్యుడు తమ తమ స్థానములందు గూర్చుందురు - ఆచమనము, అంగస్పర్శ చేయుదురు. తదుపరి కార్యకర్త బాలకునిచే–"బ్రహ్మచర్యమాగామ్ - బ్రహ్మచార్యసాని" పా. గృ. 2-2-6. అను వాక్యము ననిపించి,

ఆచార్యుడు :-

> ఓం యేనేంద్రాయ బృహస్పతిర్ వాసః పర్యదధా
> దమృతమ్; తేన త్వా పరిదధామ్యాయుషే దీర్ఘాయు
> త్వాయ బలాయ వర్చసే. (పారస్కర 2-2-7)

ఆచార్యుడు :- సాంగోపాంగ వేదము జదివి, శబ్ద, అర్థ సంబంధము, క్రియల నెఱింగి, ఛల కపటాదులు లేనివాడై, మిక్కిలి ప్రేమతో నెల్లరకు విద్యనేర్పుచు, పరోపకారియు తను మనోధనములతో నెల్లరికి సుఖము జేకూర్చువాడును, పక్షపాత రహితుడును, సత్యోపదేష్టయు, సర్వహితైషియు, ధర్మాత్మ, జితేంద్రియుడునగు వాడు ఆచార్యుడనబడును.

బృహస్పతి పూర్వమింద్రునకు నాశరహితమగు జ్ఞానరూప వస్త్రమును ధరింపజేసినట్లు నేనును యజ్ఞోపవీతరూప వస్త్రములను దీర్ఘాయువును, బలమును, తేజస్సును నిచ్చుకొఱకు నీకు ధరింపజేయుచున్నాను.

అని బాలకునకు వస్త్రముల నియ్యవలయును. తదుపరి వానిని ధరించి బాలకుడు ఆచార్యుని సమ్ముఖమున గూర్చుండును.

ఆచార్యుడు యజ్ఞోపవేతమును చేత దీసికొని -

1. ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్ యత్ సహజం పురస్తాత్, ఆయుష్య మగ్ర్యం ప్రతిముంచ శుభ్రం యజ్ఞోపవీతం బలమస్తు తేజః

2. ఓం యజ్ఞోపవీతమసి యజ్ఞస్య త్వా యజ్ఞోపవీతేన ఉపనహ్యామి. (పార.గృ. 2-2-11)

ఈ మంత్రములను పఠించి బాలకుని ఎడమభుజముపైన కంఠమునకు దగ్గఱగా శిరస్సు మధ్యలో వచ్చునట్లు దక్షిణ హస్తమునకు క్రిందుగా చంకనుండి తీసి కటి ప్రదేశమువఱకు వచ్చునట్లు యజ్ఞోపవీతమును ధరింప జేయవలయును

మంత్రార్థము :-

ఈ బ్రహ్మ సూత్రము మిక్కిలి పవిత్రమైనది. పూర్వకాలమునుండి వచ్చుచున్నది. ప్రజాపతితో బాటు వర్తించుచున్నది. ఆయువు నిచ్చునది జీవనమున ముందుండునది. దీనిని భుజముపై విడువుము - ఉంచుము పవిత్రమైనది, బలము తేజస్సు నిచ్చునది - ఓ బాలకా! నీవు యజ్ఞోపవీతుడవు యజ్ఞోపవీతముతో నిన్ను సమీపమునకు తీసికొనుచున్నాను.

తరువాత ఆచార్యుడు బాలకుని తనకు కుడివైపున గూర్చుండబెట్టుకొని- సామాన్యప్రకరణమున జూపినట్లు ఈశ్వరస్తుతి ప్రార్థనో పాసన, స్వస్తివాచనము, శాంతికరణ మంత్రములను బఠించి, అగ్న్యాధానము, సమిధాధానము, ప్రజ్వలనము, జలప్రసేచనము చేసి, ఓం అగ్నయే స్వాహా అను మంత్రములతో ఆఘారా వాజ్యభాగాహుతులు 4 , ఓం భూరగ్నయే స్వాహా అను మంత్రములతో వ్యాహృత్యాహుతులు4,ఓం త్వం నో అగ్నే–అను మంత్రములతో అష్టాజ్యాహుతులిచ్చి

ఈ మంత్రములు అన్నియు పఠించి నేతితో నాహుతులిచ్చిన పిదప-ఈ క్రింది ఓం భూర్భువః స్వః అగ్న ఆయూంషి అను 4 "ప్రధానహోమ మంత్రములను పఠించుచు బాలకునిచే పూర్వమే సిద్ధపఱచిన విశేష శాకల్యముతో నాహుతులిప్పింప వలయును.

## సత్యవ్రత మంత్రములు

1. ఓమ్ అగ్నే! వ్రతపతే వ్రతం చరిష్యామి తత్తే ప్ర బ్ర
వీమి తచ్ఛకేయం, తేనర్ధ్యాస మిద మహ మనృతాత్
సత్యముపైమి స్వాహా. ఇదమగ్నయ ఇదన్న మమ.

2. ఓమ్ వాయో! వ్రతపతే .......... సత్యముపైమి స్వాహా-
ఇదం వాయవ ఇద న్న మమ.

3. ఓమ్ సూర్య! వ్రతపతే ..........సత్యముపైమి స్వాహా.
ఇదం సూర్యాయ ఇదన్న మమ.

4. ఓం చంద్ర! వ్రతపతే ...........సత్యముపైమి స్వాహా-
ఇదం చంద్రాయ ఇదం న మమ.

5. ఓం వ్రతానాం వ్రతపతే! వ్రతం ..........సత్యముపైమి స్వాహా-
ఇద మింద్రాయ వ్రతపతయ ఇదం న మమ.

అను నీమంత్రములను పఠింపజేసి బ్రహ్మచారిచే నేతి ఆహుతుల నిప్పింప వలయును. తదుపరి ఓం భూరగ్నయే స్వాహా - అను మంత్రములతో వ్యాహృత్యాహుతులు 4, ఓం యదస్య కర్మణో అను మంత్రముతో - స్విష్టకృదాహుతి 1, ఈ పై ఆహుతులన్నియు బాలకునిచే నిప్పింపనగును.

తదుపరి ఆచార్యుడు యజ్ఞకుండమునకు ఉత్తర దిశలో కుండమునకు కొంచెము దూరములో నొక యాసనముపై పూర్వాభిముఖుడై కూర్చుండి తన యెదుట పశ్చిమాభి ముఖముగా బాలకుని గూర్చుండబెట్టుకొనవలయును. ఆచార్యుడు బాలకునివంక జూచి యీక్రింది మంత్రమును పఠించును.

ఓం ఆగన్త్రా సమగన్మహి ప్రసుమర్త్యం యుయోతన,
అరిష్టాః సంచరేమహి స్వస్తి చరతాదయమ్.

మం.బ్రా. 1-6-14.

ఇక్కడ ఆశ్రమమునకు వచ్చిన మనము పరస్పరము కలిసి కొందము. సజ్జనులతో కలియునపుడు స్వస్థ చిత్తులై భయరహితులై కలియనగును. ఈ బాలకుడు ఆశ్రమమున సుఖముగ సంచరించుగాక !

ఇట్లు మంత్రమును జపించును :-

బ్రహ్మచారి :- ఓం బ్రహ్మచర్య మా గా ముపమానయస్వ మం. బ్రా. 1-6-17. బ్రహ్మచర్యమును పాలింప దలంచితిని. దయతో నన్ను శిష్యునిగా సమీపమునకు తీసికొనుడు.

ఆచార్యుడు :- "కోనామాసి" నీ నామమేమి ? అని ప్రశ్నించును.

బ్రహ్మచారి :- "ఏతన్నామాస్మి! దేవశర్మ" నామాహమస్మి.............. ఈ నామము గల వాడను అనును. (జలాంజలి)

తదుపరి ఆచార్యుడు బాలకుని దోసిలి జలముతో నింపును. అప్పుడే క్రింది మంత్రములను పఠించును.

1. ఓం అపో హిష్ఠా మయోభువ స్తా న ఊర్జే దధాతన
   మహే రణాయ చక్షసే

2. ఓం యో వః శివతమో రసః తస్య భాజయతేహ
   నః ఉశతీరివ మాతరః.

3. ఓం తస్మా అరం గమామ వో యస్య క్షయాయ
   జిన్వథ, ఆపో జనయథా చ నః          యజు. 36-14, 15, 16.

1. ఓ జలమా! నీవు నిశ్చయముగా సుఖము నిచ్చుదానవు. ఆ సుఖము మా బలప్రాప్తికగు గాక! దానితో యుద్ధములను జాతుముగాక - జయింతుము గాక!

2. జలమా! కల్యాణ ప్రదమగు నీరసము, కాంక్షించు తల్లివలె నిట మాచే సేవింప జేయబడు గాక!

3. జలమా! ఎవని వీర్యక్షయముచే నీవు తృప్తినొందుదువో మేమును నీతోబాటు తృప్తులమగుదుము. మఱియు వీర్యప్రదమగునో జలమా! మాకు జీవనము

నొసంగుము-బాలక! వీర్యరక్షణమువలన నీవు సుఖింతువు. కావున వీర్యమును రక్షింపుము.

పై మూడు మంత్రములు పఠించుచు ఆచార్యుడు తన చేతిలో నీరు నింపుకొని నీటితో బాలకుని దోసిలి నింప వలయును.

తరువాత ఆచార్యుడు తన చేతిని జలముతో నింపుకొని-

1. ఓం తత్సవితుర్ వృణీమహే వయం దేవస్య భోజనమ్.
   శ్రేష్ఠం సర్వధాతమం తురం భగస్య ధీమహి.    ఋ.5-82-1

అను మంత్రము జదివి తన చేతిలోని నీటిని బాలకుని దోసిలిలో నున్న జలమునబోసి బాలకుని దోసిలిని అంగుష్ఠముతో బట్టుకొని-

2. ఓం దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినో ర్బా హుభ్యాం
   పూష్ణో హస్తాభ్యాం హస్తం గృహ్ణామ్యసౌ.    ఆ. గృ. 1-20-4

అని మంత్రము జదివి బాలకుని దోసిలిలో నున్న నీటిని క్రిందనున్న పాత్రలో విడిపింప జేయునది.

పై రెండు మంత్రముల అర్థము :-

1. సూర్యుని శ్రేష్ఠగుణ యుక్త భోజనమైన జలమును మనము వరింతుము. ఆ జలము మనకు శుభమును శీఘ్రముగా నొసంగును.

2. సూర్యుని పుత్రుడవైన నిన్ను నేను అశ్వినీదేవుల హస్తములతోను పోషకుల హస్తములతోను గ్రహించుచున్నాను. నీ పోషణలో నెట్టి లోటురాకుండునట్లు చూతును. అని ఆచార్యుడు చెప్పుచున్నాడు.

## ద్వితీయాంజలి

పూర్వమువలె ఆచార్యుడు బాలకుని దోసిలి నింపి పై మంత్రములను జదువుచు రెండవ సారి అంగుష్ఠ సహితముగా దోసిలి పట్టుకొని-

ఓం సవితా తే హస్త మగ్రభీత్ అసౌ.    ఆ.గృ. 1-20-5.

అను మంత్రము జదివి దోసిలి జలమును క్రింది పాత్రలో విడిపింప జేయును.

## తృతీయాంజలి

మరల మూడవసారికూడ పూర్వమంత్రములను పఠించుచు బాలకుని దోసిలిలో జలమునింపి అంగుష్ఠ సహితముగా దోసిలిని బట్టుకొని-

ఓం అగ్నిరాచార్యస్తవ అసౌ. ఆ.గృ. 1-20-5

అని దోసిలి జలమును క్రింది పాత్రలో విడిపింపవలయును.

పై వాక్యములో (అసౌ) అను పదమున్నచోట దానికి బదులు బాలకుని నామము సంబోధనము చేయుచున్నట్లు పలుకవలయును. ఉదాహరణమునకు 'ధర్మదేవా! గోపాలదేవ!' అనునట్లు.

తరువాత నాచార్యుడు బాలకుని వెలుపలికి తీసికొని వెళ్ళి సూర్యుని ఎదుట నిలబడి సూర్యుని జూచి-

ఓం దేవ సవిత రేష తే బ్రహ్మచారీ తం గోపాయ స మామృత.
ఆ. గృ. 1-20-6.

ఓ సూర్యదేవ! ఇతడు నీబ్రహ్మచారి, ఇతనిని రక్షింపుము. ఇతడు చావకుండుగాక! - చిరంజీవి యగుగాక! అని పలికి ఈ క్రింది మంత్రమును జదువును-

ఓం తచ్చక్షుర్ దేవహితం పురస్తా చ్ఛుక్రముచ్చరత్
పశ్యేమ శరదః శతం జీవేమ శరదః శతగ్ం శృణుయామ
శరదః శతం ప్రబ్రవామ శరదః శతమ్ అదీనాః స్యామ
శరదః శతమ్ భూయశ్చ శరదః శతాత్.

పరమేశ్వర! నీ వెల్లరకు మార్గదర్శకుడవు విద్వాంసులకు పరమహితకారకుడవు. తేజోమయశక్తి స్వరూపుడవు. మేము జ్ఞాననేత్రముతో నూటవర్షములు నిన్ను జూతుము గాక! నీ యుపదేశములను విందుము గాక! నిన్ను గూర్చి ప్రవచింతుము గాక! అదీనులమై-స్వస్థులమై నూటేండ్లు అంతకంటె నెక్కుడువత్సరములు జీవింతుము గాక!

అని బాలకునకు సూర్యదర్శనము చేయింపవలయును.

తరువాత ఆచార్యుడు బాలుని వెంటబెట్టుకొని లోనికివచ్చి పూర్వ స్థలమున కుండమునకు ఉత్తర దిశయందు కూర్చుండి ఈ క్రింది మంత్రమును పఠించును.

ఓం యువా సువాసా: పరివీత ఆగాత్ స ఉ శ్రేయాన్
భవతి జాయమాన: ఋ. 3-8-4
ఓం సూర్యస్యావృత మన్వావర్తస్వ అసౌ. మం.బ్రా. 1-6-20

(ఈ బాలకుడు మంచి వస్త్రములు ధరించి, యజ్ఞోపవీత ధారియై వచ్చియున్నాడు. ఇతడు నూతన జన్మము (సంస్కారము వలన) ధరించుచు ద్విజుడు ద్విజన్ముడనిపించుకొనుచున్నాడు పూర్వము కంటెనుత్తమ జన్మమును గ్రహించుచున్నాడు.)

ఓ బాలక! సూర్యుని మార్గము ననుసరింపుము - ( సూర్యుని లక్ష్యముననుంచుకొని యుత్తమ గుణములను గ్రహించుచు వర్తింపుమని భావము.)

ఆచార్యుడు పై మంత్రములను పఠించును. బాలుడు ఆచార్యునకు ప్రదక్షిణము చేసి ఆచార్యుని యెదుట గూర్చుండును.

తరువాత ఆచార్యుడు తన కుడిచేతిని వస్త్రముతో కప్పుకొని దానితో బాలకుని కుడిభుజమును స్పృశించి-

ఓం ప్రాణానాం గ్రంథిరసి మా విస్రసో ऽన్తక ఇదం తే
పరిదదామి, అముమ్. మం.బ్రా. 1-6-21

అను మంత్రమును పఠించును.

మంత్రార్థము :- ఓ నాభీ! నీవు ప్రాణముల గ్రంథివి. బాలకుని ప్రాణములు స్థిరముగానుండు గాక! ఓ యంతక! ఈ బాలకుని నీకప్పగించుచున్నాను. ఇతనిని రక్షింపుము.

తదుపరి ఆచార్యుడు వస్త్రాచ్ఛాదిత హస్తముతో ఈ క్రింది మంత్రము చదువుచు బాలకుని ఉదరమును స్పృశింప వలయును.

ఓం అహుర ఇదం తే పరిదదామి అముమ్. మం.బ్రా.1-6-22.

తదుపరి యీ క్రింది వాక్యము చదివి బాలకుని హృదయమును స్పృశించును. ఆచార్యుడు-

ఓం కృశన ఇదం తే పరిదదామి అముమ్. మం.బ్రా. 1-6-23.

తదుపరి క్రింది మంత్రముతో కుడిభుజమును-

ఓం ప్రజాపతయే త్వా పరిదదామి అసౌ. మం. బ్రా. 1-6-24

ఈ క్రింది మంత్రముతో-

ఓం దేవాయ త్వా సవిత్రే పరిదదామి అసౌ. మం. బ్రా. 1-6-25.

ఎడమ చేతితో బాలకుని ఎడమ భుజమును స్పృశింప వలయును.

తరువాత బాలకుని హృదయముపై తన చేతిని ఉంచి ఆచార్యుడీ క్రింది మంత్రమును జదువును.

ఓం తం ధీరాసః కవయ ఉన్నయంతి, స్వాధ్యో
మనసా దేవయంతః. ఋ. 3-8-4.

ధీరులు, కవులు, స్వాధ్యాయ శీలురు మనస్సుతో దివ్యశక్తి సంపన్నుని జేయుచు నీబాలుని యున్నతికి యత్నింతురు.

## హృదయస్పర్శ - ప్రతిజ్ఞ

తదుపరి ఆచార్యుడు తన యెదుటనున్న బాలకుని దక్షిణ (హృదయమున) హస్తముపై తన హస్తమునుంచి క్రింది మంత్రమును పఠించును.

ఓం మమ వ్రతే హృదయం దధామి, మమ చిత్తమను
చిత్తం తే అస్తు, మమ వాచ మేకమనా జుషస్వ బృహ
స్పతి ష్ట్వా నియునక్తు మహ్యామ్. పా. గృ. 2-2-16.

---

"అముమ్" అను పదస్థానమున బాలకుని నామము ద్వితీయాంతము నుచ్చరింపవలయును. "అసౌ" అను పదస్థానమున బాలకుని నామము ప్రథమాంతము నుచ్చరించునది.

ఓ ప్రియబాలక ! నీ హృదయము నాయధీనమున నుంచుకొందును. నీ చిత్తము నా చిత్తమున కెల్లపుడు ననుకూలముముగా నుండుగాక; నీవు నావాక్కును ఏకాగ్ర చిత్తముతో విని యర్థమును గ్రహింపుము. నేటినుండి నీ ప్రతిజ్ఞననుసరించి పరమేశ్వరుడు నిన్ను నాతో యుక్తుం జేయుగాక ! (అని యాచార్యుడు ప్రతిజ్ఞచేసి శిష్యునిచే నిట్లు ప్రతిజ్ఞ జేయించును.)

శిష్య ప్రతిజ్ఞ - ఆచార్య ! మీ హృదయమును నేను నాయున్నత శిక్షణయు. విద్యయు మున్నతియందు ధారణము చేయుదును. మీ చిత్తమునా చిత్తమునకు నెల్లప్పుడు అనుకూలమగు గాక! మీరు నావాక్యమును ధ్యానముతో వినుడు. పరమేశ్వరుడు నాకొఱకు మిమ్ముల నెల్లప్పుడు నియుక్తులను జేయును గాక!

ఇట్లు ఇరువురు ప్రతిజ్ఞలను జేయుదురు.

ఆచార్యుడు :- "కో నామాసి" నీ పేరేమి.

బాలకుడు :- అహం భోః ! .................. నామాఽస్మి (నేను..................... అను నామము గలవాడను)

ఆచార్యుడు :- "కస్య బ్రహ్మచార్యసి?" ఎవని బ్రహ్మచారివి?

బాలకుడు :- భవతః–మీ బ్రహ్మచారిని.

ఆచార్యుడు బాలకుని రక్షణ కొఱకు -

> ఓం ఇంద్రస్య బ్రహ్మచార్యసి, అగ్ని రాచర్య స్తవ, అహ మాచార్యస్తవ, అసౌ పా. గృ. 2-2-21
> ఓం కస్య బ్రహ్మచార్యసి ప్రాణస్య బ్రహ్మచార్యసి కస్త్వా క ముపనయతే, కాయ త్వా పరిదదామి.
>
> ఆ. గృ. 1-20-7

> ఓం ప్రజాపతయే త్వా పరిదదామి, దేవాయ త్వాసవిత్రే పరి దదామి, అద్భ్యస్త్వౌషధీభ్యః పరిదదామి, ద్యావా పృథివీ భ్యాం త్వా పరిదదామి, విశ్వేభ్య స్త్వా దేవేభ్యః పరిద దామి, సర్వేభ్య స్త్వా భూతేభ్యః పరిదదామ్యరిష్ట్యై పా.గృ. 2-2-21

నీ వెవని బ్రహ్మచారివి? ప్రాణము యొక్క. ఎవరు నీకు ఉపనయన సంస్కారము చేయుచున్నారు? ఎవనిగూర్చి నీకు ఉపనయనము చేయుచున్నారు? నిన్నెవరి కప్పగింతును?

భగవంతునకు నిన్నప్పగించుచున్నాను. ఇట్లే, దివ్యగుణ యుక్త సవిత్రునకు, జలమునకు, ఓషధులకు, ద్యు పృథివీ లోకములకు, సర్వ దేవతలకు, సర్వప్రాణులకు – నీ మేలుకోరి నిన్నప్పగించుచున్నాను.

అని - బ్రహ్మచారితో "ప్రాణాది విద్యలనభ్యసింప యత్నింపుము" అని ఆచార్యుడుపదేశించును.

ఇట్లు ఉపనయన సంస్కారము పూర్తిచేసి, బాలకుని తండ్రి, ఆచార్యుడు ఇరువురు

నా దినముననే వేదాంత సంస్కారము చేయదలచిన నాడే చేయవచ్చును.

వేదారంభము మఱియొక నాడు చేయదలచినచో మహావామదేవ్యగానముచేసి ఉపనయన సంస్కారము పూర్తిచేయ వలయును.

సంస్కారమునకు వచ్చిన స్త్రీ పురుషులను బాలకునితల్లిదండ్రులు తగినట్లు సత్కరించి పంపునది.

తల్లి దండ్రులు ఆచార్యుడు ఇష్టబంధువులు నెల్లరు బాలకుని ఈ క్రింది మాటలతో నాశీర్వదింప వలయును.

## ఆశీర్వాదము

ఓం హే బాలకః త్వం జీవ శరదః శతమ్ వర్ధమానః
ఆయుష్మాన్, తేజస్వీ, వర్చస్వీ భూయాః.

ఓ బాలక! నీవు నూఱు వత్సరములు వర్ధిల్లుచు జీవింపుము. ఆయుష్మంతుడవు, వర్చస్సుగలవాడవు. తేజస్సు గలవాడవునగుము.

ఆశీర్వాదము నిచ్చి యెవరి యిండ్లకు వారు పోవుదురు.

సమాప్తము

# 11. వేదారంభ సంస్కారము

గాయత్రీ మంత్రము మొదలు నాలుగు వేదములు సాంగోపాంగముగ నధ్యయనము చేయుట కావశ్యకములగు నియమములను ధారణ చేయుటకుగాను చేయు సంస్కారము వేదారంభ మనబడును.

సమయము:-

ఉపనయన సంస్కారము జరిగిన దినముననే వేదారంభ సంస్కారము చేయనగును.

ఆనాడు ప్రాతఃకాలమున శుద్ధ జలముతో స్నానమొనర్చి శుద్ధ వస్త్రములను ధరించి కార్యకర్తయైన తండ్రితో గాని, అతడు లేకున్న ఆచార్యునితోగాని వేదికకు పశ్చిమ భాగమున పూర్వాభిముఖుడై బాలకుడు గూర్చుండును.

అనంతరము ఆచమనాంగస్పర్శలొనర్చి ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన, స్వస్తి వాచన, శాంతి కరణములకు సంబంధించిన మంత్రములను బఠించి, అగ్న్యాధ్యానము, సమిధాధానము ప్రజ్వలనము, జలప్రసేచనము వఱకు గల క్రియలన్నియు సామాన్య ప్రకరణమున నిర్దేశించినట్లు జరుపవలయును.

(ఉపనయన సంస్కారము పూర్తిచేసి యప్పుడే వెంటనే వేదారంభము జరుపు నెడల పైన వర్ణించిన క్రియలన్నియు మరల చేయునావశ్యకముండదు. అప్పుడు క్రిందజూపు అగ్ని సంచయన క్రియతో ప్రారంభించి మిగిలిన సంస్కారము జరుపనగును.)

అట్లుకాక వేఱు దినమున జరుపు నెడల పై క్రియలన్నియుజేసి.

యీ క్రింది మంత్రములతో క్రమముగా సంస్కారము జరుపునది.

### ఆజ్యాహుతులు

"ఓం అగ్నయే స్వాహా అను మంత్రములతో 4. ఆఘారావాజ్య భాగాహుతులు, "ఓం భూరగ్నయే స్వాహా" అనునిట్టి మంత్రములతో 4, వ్యాహృత్యాహుతులు, "ఓం త్వం నో అగ్నే ..." ఇత్యాది మంత్రములతో 8, అష్టాజ్యాహుతులు, "ఓం భూర్భువః అగ్న ఆయూంషి ..." అను మంత్రములతో ప్రధానహోమాహుతులు నాలుగు

ఇట్లు ఏడు (7) పర్యాయములు ముఖమును లేక హస్తములతో స్పృశించి తదుపరి, అట్లే జలమును హస్తములకు రాచి కొంచెము చేతులు స్పృశించి అవయవస్పర్శ చేయునది.

1. ఓం వాక్చ మ ఆప్యాయతామ్-ముఖమును (నోటిని)
2. ఓం ప్రాణశ్చ మ ఆప్యాయతామ్-నాసికను
3. ఓం చక్షుశ్చ మ ఆప్యాయతామ్-కన్నులు
4. ఓం శ్రోత్రం చ మ ఆప్యాయతామ్-చెవులు
5. ఓం యశో బలం చ మ ఆప్యాయతామ్-రెండు భుజములు స్పృశించునది.

## ఉపస్థాన మంత్రములు

తదుపరి బాలకుడీ క్రింది మంత్రములతో పరమేశ్వరుని ఉపస్థానము చేయును.

ఓం మయి మేధాం మయి ప్రజాం మయ్యగ్నిస్తేజో దధాతు, మయి మేధాం మయి ప్రజాం మయీన్ద్ర ఇంద్రియం దధాతు, మయి మేధాం మయి ప్రజాం మయి సూర్యో భ్రాజో దధాతు. యత్తే అగ్నే తేజ స్తేనాహం తేజస్వీ భూయాసమ్, యత్తే అగ్నే వర్చ స్తేనాహం వర్చస్వీ భూయాసమ్,యత్తే అగ్నే హర స్తేనాహం హరస్వీ భూయాసమ్. ఆ. గృ. 1-21-4

ఈ మంత్రముతో నుపస్థానముచేసి బాలకుడు కుండమునకు ఉత్తర దిశయందు మోకాళ్ళను భూమికానించి పూర్వాభిముఖుడై కూర్చుండును. ఆచార్యుడు బాలకున కెదురుగా పశ్చిమాభి ముఖుడై ఆసనముపై కూర్చుండును.

## గాయత్రీ మంత్రోపదేశము

బాలకుడు :- "అధీహి భూః సావిత్రీమ్" సావిత్రి నుపదేశింపుడు-

ఆచార్యుడు :- "అను బ్రూహి" నేను చెప్పిన పిదప నీవు చెప్పుము (ఆచార్యునితో బాలకు డిట్లనును) ఆచార్య! మొదట ఓంకారము, తదుపరి మూడు మహావ్యాహృతులు తదుపరి సావిత్రి—త్రికము—మూడును కలిపి పరమాత్మ

వాచకమగు మంత్రమును నాకుపదేశింపుడు. తదుపరి ఆచార్యుడు ఒక వస్త్రమును తన యొక్కయు, బాలకుని యొక్కయు భుజములపై నుంచుకొని, తన కుడిచేతితో బాలకుని రెండు చేతుల వ్రేళ్ళను పట్టుకొని యీ క్రింద జూపిన విధమున బాలకునకు మూడు భాగములుగా గాయత్రీ మంత్రమును ఉపదేశింప వలయును.

ప్రథమ పర్యాము :

ఓం భూర్భువః స్వః తత్ సవితుర్ వరేణ్యమ్

రెండవ పర్యాయము :

ఓం భూర్భువః స్వః తత్ సవితుర్ వరేణ్యమ్,
భర్గో దేవస్య ధీమహి.

మూడవసారి :

ఓం భూర్భువః స్వః తత్ సవితుర్ వరేణ్యమ్ భర్గో
దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్.

ఈ మంత్రములలోని ప్రతి పదమును విడివిడిగా శుద్ధముగా నుచ్చరించునట్లు బాలకునకు నెమ్మదిగా చెప్పవలయును. తదుపరి యీ క్రింది విధమున మంత్రార్థమునుగూడ బాలకునకు ఆచార్యుడు వినిపింప వలయును.

మంత్రార్థము :-

ఓమ్ = ఇది పరమేశ్వరుని నామము, ఈ నామముతో నితర నామములన్నియు లగ్నమగును. భూః = పరమేశ్వరుడు ప్రాణమునకు ప్రాణము, భువః = సర్వదుఃఖములను విడిపించువాడు, స్వః = స్వయముగా సుఖస్వరూపుడై తన భక్తులకు సర్వ సుఖముల నొసంగువాడు, సవితుః = సమస్త జగత్తు నుత్పన్నము చేయువాడు, సూర్యాది జ్యోతులకు జ్యోతి నిచ్చువాడు, సంపూర్ణ ఐశ్వర్యము నిచ్చువాడు, దేవస్య = కోరదగినవాడు, అంతట విజయమును చేకూర్చునట్టి పరమేశ్వరుని, వరేణ్యమ్ = అతి శ్రేష్ఠము, గ్రహణము చేయుటకు ధ్యానించుటకును యోగ్యమైన, తత్ భర్గః = సర్వక్లేశములను భస్మమొనర్చు నాపవిత్ర శుద్ధస్వరూపమును, ధీమహి = ధరింతుము గాక! యః = ఆ పరమేశ్వరుడు, నః = మా యొక్క, ధియః = బుద్ధులను, ఉత్తమ గుణ కర్మ స్వభావములందు, ప్రచోదయాత్ = ప్రేరేపించును

గాక! ఈ ప్రయోజనము కొఱకే జగదీశ్వరుని స్తుతి ప్రార్థనోపాసనలు చేయవలెను. ఇతని కంటె భిన్నుడైన మఱియొకడు ఉపాస్యుడు ఇష్టదేవుడున్నాడని గాని, ఇతనికంటె నధికుడు గాని, ఇతనికి తుల్యుడుగాని ఉన్నాడని యంగీకరింపరాదు. ఈ యర్థమును బోధించునది. తదుపరి ఆచార్యుడు బాలకుడు నిరువురు నీ క్రింది మంత్రముతో పూర్వమువలె ప్రతిజ్ఞ చేయవలయును.

మంత్రము :-

> ఓం మమ వ్రతే హృదయం తే దధామి, మమ చిత్త
> మనుచిత్తం తే అస్తు, మమ వాచ మేకవ్రతో జుషస్వ,
> బృహస్పతి ష్ట్వా నియునక్తు మహ్యామ్. ఆ.గృ. 1-21-7

## మేఖలా ధారణము

పూర్వమే సిద్ధపఱచియుంచిన, సుందరము మృదువునైన మొలనూలును బాలుని కటియందు బంధించుచు నీ మంత్రమును పఠించును.

> ఓం ఇయం దురుక్తం పరిబాధమానా వర్ణం పవిత్రం
> పునతీ మ ఆగాత్, ప్రాణాపానాభ్యాం బల మాదధానా స్వసా దేవీ
> సుభగా మేఖలేయమ్. పా. గృ. 2-2-8

ఈ మొలత్రాడు కష్టముతో మాటలాడుటను తొలగించుచు, వర్ణమును శబ్దమును పవిత్రమొనర్చుచు, నన్ను చేరినది. ఇయ్యది సౌభాగ్యము నిచ్చు తోబుట్టువుతో సమానము. ప్రాణ అపానముల మూలమున బలమునిచ్చునది. మొలనూలు బాలుని కటియందు బంధించి ఈ క్రింది మంత్రమును పఠించి-

> ఓం యువా సువాసాః పరివీత ఆగాత్ స ఉ శ్రేయాన్ భవతి
> జాయమానః, తం ధీరాసః కవయ ఉన్నయన్తి స్వాధ్యో మనసా
> దేవయన్తః. ఋ. 3-8-4.

బాలునకు రెండు శుద్ధ కౌపీనములు, రెండు అంగవస్త్రములు, ఒక ఉత్తరీయము,రెండు కటి వస్త్రములు బ్రహ్మచారికి ఆచార్యుడిచ్చును. అందు ఒక కౌపీనము ఒకకటి వస్త్రము ఒక యుత్తరీయము ఆచార్యుడు బాలునకు ధరింపజేయును.

## దండ ధారణము

తదుపరి ఆచార్యుడొక దండమును చేతితో పట్టుకొని బాలకుని యెదుట నిలబడును. బాలకుడాచార్యుని యెదుట నిలబడి చేతులు జోడించి, యీ క్రింది మంత్రముజెప్పి-

ఓం యో మే దండః పరాపతద్ వైహాయసోऽధి భూమ్యామ్.
తమహం పునరాదద ఆయుషే బ్రహ్మణే బ్రహ్మ వర్చసాయ.
పా. గృ. 2-2-12

ఆచార్యుని చేతినుండి దండమును గ్రహించును.

## బ్రహ్మచారి కర్తవ్యములు

తదుపరి బాలకుని తండ్రి బ్రహ్మచారికి కర్తవ్యముగా నీ క్రింది యుపదేశము చేయును.

(1) బ్రహ్మచార్యసి 'అసౌ' అసౌ పద స్థానమున బ్రహ్మచారి నామము నంతటి నుచ్చరించునది. (2) ఆపోऽశాన. (3) కర్మ కురు (4) దివా మా స్వాప్సీః

---

దండమెట్లుండవలెనన:-

బ్రాహ్మణ బాలకునకు పలాశదండమో, మారేడు దండమో ఇయ్యవలయును. అది యతని లలాటము వఱకు వచ్చునంత పొడవుగలదిగా నుండునది.

క్షత్రియునకు మఱ్ఱి చంద్ర వృక్షములకు చెందిన దండము అతని కనుబొమ్మల వఱకు వచ్చునంత యెత్తుగలిగి యుండవలయును.

వైశ్య బాలకునకు పీలూ (గొలుగుచెట్టు) లేక మేడి-వృక్షములకు సంబంధించినది అతని నాసికాగ్రభాగము వఱకు వచ్చునంత యెత్తు గల దండముండుట ఉచితము. దండములు తిన్నగా నున్నగా నుండవలయును. పురుగులు తిన్నవి, వంకరవిగానున్నవి పనికిరావు. దండముతో బాటు ఒక మృగచర్మము ఒక జలపాత్ర, ఆచమనీయము (చిన్నపాత్ర) బ్రహ్మచారి కియ్యనగును.

---

(5) ఆచార్యాధీనో వేద మధీష్వ. (6) ద్వాదశవర్షాణి ప్రతి వేదం బ్రహ్మచర్యం గృహాణ వా బ్రహ్మచర్యం చర, (7) ఆచార్యాధీనో భవాన్యత్రాధర్మాచరణాత్, (8) క్రోధానృతే వర్జయ (9) మైధునం వర్జయ (10) ఉపరి శయ్యాం వర్జయ, (11) కౌశీలవగంధాంజనాని వర్జయ, (12) అత్యంతం స్నానం భోజనం నిద్రాం జాగరణం నిందాం లోభమోహభయశోకాన్ వర్జయ, (13) ప్రతి దినం రాత్రేః పశ్చిమ యామే చోత్థాయావశ్యకం కృత్వా దంత ధావనస్నాన సంధ్యోపాస నేశ్వర స్తుతి ప్రార్థనోపాసనా యోగాభ్యాసా న్నిత్య మాచర, (14) క్షురకృత్యం వర్జయ, (15) మాంసరూక్షాహారం మద్యాది పానం చ వర్జయ, (16) గవాశ్వహస్త్యుష్ట్రాదియానం వర్జయ (17) అంతర్ గ్రామనివాసోపానచ్ఛత్ర ధారణం వర్జయ, (18) అకామతః స్వయమింద్రియ స్పర్శేన వీర్య స్ఖలనం విహాయ వీర్యం శరీరే సంరక్ష్యోర్ధ్వ రేతాః సతతం భవ, (19) తైలాభ్యంగన మర్దనాత్యమ్లాతితిక్త కషాయ క్షార రేచన ద్రవ్యాణి మాసేవస్వ, (20) నిత్యం యుక్తాహారవాన్ విద్యోపార్జనే చ యత్నవాన్ భవ (21) సుశీలో మితభాషీ సభ్యో భవ (22) మేఖలాదండ ధారణ భైక్ష్యచర్య సమిధాధానోదకస్పర్శనాచార్య ప్రియాచరణ ప్రాతః సాయమభివాదన విద్యాసంచయ జితేంద్రియత్వాదీ న్యేతే తే నిత్యధర్మాః. గో. గృ. 3-1-25.

అర్థములు :-

(1) నీవు నేటినుండి బ్రహ్మచారివి. (2) నిత్యము సంధ్యోపాసన భోజనములకు పూర్వము, శుద్ధ జలముతో ఆచమనము చేయుము. (3) దుష్టకర్మలను విడిచి ధర్మమాచరింపుము. (4) దినమున నెన్నడు శయనింపకు,(5) ఆచార్యుని యధీనమున నుండి నిత్యము వేదము జదువుటలో పురుషార్థ మొనర్పుము, (6) ఒక్కొక్క వేదము సాంగోపాంగముగ జదువుటకు పంద్రెండు పంద్రెండు వత్సరములు–48 వత్సరములు–లేక నాల్గు వేదములు సాంగోపాంగముగ నధ్యయనము పూర్తియగువఱకు నఖండ బ్రహ్మచర్యమును పాలింపుము, (7) ధర్మాచరణమున ఆచార్యుని యధీనముననుండుము-కాని ఆచార్యుడధర్మము నాచరింప నాదేశించిన దాని నంగీకరింపకుము - దానిని నాచరింపకుము, (8) క్రోధమును అసత్యభాషణమును వదలుము, (9) అష్టవిధమైథనములను వర్జింపుము,

((1) స్త్రీ ధ్యానము, (2) స్త్రీలకథ, (3) స్త్రీ స్పర్శ, (4) స్త్రీలతో క్రీడించుట (5) స్త్రీ దర్శనము, (6) ఆలింగనము, (7) స్త్రీలతో నేకాంత వాసము, (8) స్త్రీ

సమాగమము) (10) భూమిపై పడుకొనుము (11) మంచము మీద పడుకొనకుము, (12) గానము, వాద్యము నృత్యము మున్నగు నిందిత కర్మలు విడిచిపెట్టుము, గంధము, అంజనము సేవింపకు, (13) అతి స్నానము, అతి భోజనము, అతి నిద్ర, అతి జాగరణము, నింద, లోభము, మోహము, భయము, శోకము నెన్నడు గ్రహింపకుము, (14) రాత్రి నాల్గవజామున లెమ్ము. అవశ్యకములగు శౌచదంతధావన, స్నాన సంధ్యోపాసనలు, ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనము యోగాభ్యాసము నిత్యమాచరింపుము, (15) క్షౌరమును వర్జింపుము,(16) మాంసము, శుష్కాన్నము తినకు, మద్యపాన మొనర్పకు, (17) ఎద్దు, గుఱ్ఱము, ఏనుగు, ఒంటె మున్నగు జంతువుల నెక్కి స్వారిచేయకు, (18) గ్రామ నివాసము, చెప్పులు తొడుగుట, ఛత్రధారణము చేయకుము, (19) లఘుశంకాసమయమున తక్క యితరవేళల మూత్రేంద్రియమును స్పృశింపక వీర్యమును శరీరమునందే రక్షించుచు ఊర్ధ్వరేతస్కుడవగుము, (20) నూనెతో శరీరమును మర్దించుట-నలుగు పెట్టుకొనుట మానుము ఎక్కువ పులుపు, ఎక్కువ కారము, ఎక్కువ వగరు, ఎక్కువ లవణములను విడువుము. (21) సుశీలుడవు, మితభాషివి, సభ్యుడవు కమ్ము. (22) యుక్తాహార విహారములతో విద్యనుగ్రహింప యత్నింపుము, (23) మొలత్రాడు ధరింపుము, దండధారణముచేయుము, భిక్షాచరణము చేయుము, అగ్నిహోత్రము,స్నాన సంధ్యోపాసనలు, ఆచార్యునకు ప్రియ మాచరించుట, ప్రాతః సాయం ఆచార్యున కభివాదనము చేయుట నీకు నిత్య కర్మలు, నిషిద్ధకార్యము లెన్నడు చేయకూడనివి.

తండ్రి యుపదేశించిన తదుపరి బాలకుడు "మీరాదేశించినట్లే చేయుదును' అని చెప్పవలయును.

బాలకుడు యజ్ఞకుండమునకు ప్రదక్షిణము చేసి, కుండమునకు పశ్చిమభాగమున నిలబడి తల్లి, తండ్రి, అన్న, అక్క, మేనమామ, మేనత్త, పినతండ్రి మున్నగు వారిని - భిక్షపెట్టుటకు తిరస్కరింపని వారిని భిక్షనడుగ వలయును.

బ్రాహ్మణ బాలకుడు మగవారిని భిక్షనడుగునపుడు "భవాన్ భిక్షాం దదాతు' 'అనియు, స్త్రీలను అడుగునపుడు "భవతీ భిక్షాం దదాతు" అనియు నడుగవలయును.

క్షత్రియ బాలకుడు పురుషుని "భిక్షాం భవాన్ దదాతు" అనియు,స్త్రీని "భిక్షాం భవతీ దదాతు" అనియు నడుగవలయును.

వైశ్య బాలకుడు పురుషుని "భిక్షాం దదాతు భవాన్" అనియు, స్త్రీలనడిగిన "భిక్షాం దదాతు భవతీ" అనియు నడుగునది.

తనకు దొరికిన భిక్షనంతటిని బాలకుడు ఆచార్యుని యెదుట నుంచవలయును. తదుపరి ఆచార్యుడాభిక్షనుండి కొంచెము అన్నము తీసికొని మిగిలిన దంతయు భోజనార్థమతని కియ్యవలయును.

తరువాత బాలకుని శుభాసనమున గూర్చుండజేసి వామదేవ్యగానము చేయునది. ఆపైన బాలకుడు తనకొఱకు ఉంచుకొనియున్న పదార్థమును భుజింపవలయును. సాయంత్రము వఱకు విశ్రాంతి తీసికొనిన తదుపరి ఆచార్యుడు బాలకునిచే సంధ్యోపాసన చేయింప వలయును.

తరువాత ఆచార్యుడు యజ్ఞకుండమునకు పశ్చిమ భాగమున బ్రహ్మచారిని కూర్చుండ బెట్టుకొని, ఆచమ నాంగ స్పర్శలు చేయించి, అగ్న్యాధానము, సమిధాధానము, ప్రజ్వలనము మున్నగు క్రియల తదుపరి జల ప్రసేచనము చేయించి, ఓం అగ్నయే స్వాహా అను మంత్రములతో 4 ఆఘారావాజ్య భాగాహుతులు, ఓం భూరగ్నయే స్వాహా అను మంత్రములతో వ్యాహృత్యాహుతులు నాలుగు, ఓం త్వం నో అగ్నే అను మంత్రములతో 8 అష్టాజ్యాహుతులు ఇప్పించునది. తరువాత బ్రహ్మచారి నిలబడి

'ఓం అగ్నే సుశ్రవః సుశ్రవసం మా కురు'

అను మంత్రమును ముమ్మాఱు చదివి మూడు సమిధాహుతులనిచ్చునది. తరువాత బ్రహ్మచారి కూర్చుండి-

ఓం తనూపా అగ్నేఽ సి తన్వం మే పాహి

అను మంత్రములను పఠించుచు చేతులను నీటితో తడిపి కొంచెము కాచి ముఖమును స్పృశింప వలయును.

తరువాత పూర్వమే సిద్ధపఱచి యుంచిన అన్నము నుండి కొంచెమన్నము ఆహుతుల కావశ్యకమైనంత యొక పాత్రలో తీసికొని అందు కొంచెము నేయి కలిపి యీక్రింది మంత్రములతోనాచార్యుడు బాలకునిచే అన్నపుటాహుతుల నిప్పింప వలయును.

1. ఓం సదసస్పతి మద్భుతం ప్రియమింద్రస్య కామ్యమ్'
సనిం మేధామయాసిషగ్ం స్వాహా
ఇదం సదసస్పతయే ఇదం న మమ.

2. ఓం తత్ సవితుర్ వరేణ్యం భర్గో దేవస్య ధీమహి ధియో
యో నః ప్రచోదయాత్ స్వాహా.
ఇదం సవిత్రే ఇదం న మమ.

3. ఓం ఋషిభ్యః స్వాహా - ఇదం ఋషిభ్యః ఇదం న మమ.

ఇట్లు మూడు అన్నాహుతులిచ్చి క్రింది మంత్రము చదివి-

ఓం యదస్య కర్మణో ఽత్యరీరిచం

అన్నముతో స్విష్టకృదాహుతి నియ్యనగును. తరువాత ఓం భూరగ్నయే స్వాహా అను మంత్రములతో వ్యాహృత్యాహుతులు 4, ఓం త్వం నో అగ్నే ........... అను మంత్రములతో ఆజ్యాహుతులు 8 ఇచ్చి బ్రహ్మచారి ఆచార్యునితోబాటు వామదేవ్య గానము చేయవలయును.

తరువాత"----- గోత్రోత్పన్నో ఽహం భో భవంత మభివాదయే" అని ఆచార్యునకు వందనముచేయును.

ఆచార్యుడు-ఆయుష్మాన్ విద్యావాన్ భవ సౌమ్య.

అని బాలకునాశీర్వదించును, తరువాత హోమము చేయగా మిగిలిన అన్నమును, ఇతర మిష్టాన్న పదార్థములను ఆచార్యుడు, బ్రహ్మచారి వేఱు వేఱుగా నొక పంక్తిలో గూర్చుండి భోజనము చేయవలయును. చేతులు ముఖములు కడుగుకొనునది.

తదుపరి సంస్కారమునకు నిమంత్రితులైన వారికి తగినట్లు భోజనాది సత్కారములు జరిపి స్త్రీ స్త్రీలను, పురుషుడు పురుషులను సాగనంప వలయును.

ఎల్లరు బాలకుని ఇట్లు ఆశీర్వదింప వలయును.

**ఆశీర్వాదము**

హే బాలక త్వం ఈశ్వరకృపయా విద్వాన్ శరీరాత్మ బలయుక్తః కుశలీ వీర్యవాన్ అరోగః సర్వావిద్యాన్ అధీత్యాస్మాన్ దిదృక్షుః సన్నాగమ్యాః.

ఇట్లు దీవించి యెల్లరు వెళ్ళిపోవుదురు.

తదుపరి మూడు దినములు బ్రహ్మచారి భూశయనము చేయుచు ప్రతి దినము సాయం ప్రాత: అగ్నిహోత్రము చేయును–ఆచార్యుడు బాలకునిచే "అగ్నే సుశ్రవః ––" అను మంత్రములతో పమిధాహుతులనిప్పింప వలయును.

"తనూపా ≥గ్నేసి––" అను మంత్రములతో బాలకుడు ముఖస్పర్శనొనరింపనగును. అట్లే "సదసస్పతి మద్భుతం––" అను స్విష్ట మంత్రములతో నాలుగు అన్నాహుతులను గూడ నియ్యనగును. మూడు దినములు ఇట్లు చేయుచు క్షారలవణ రహితముగా భోజనము చేయవలయును.

తరువాత గురుకులమునకేగి యట విద్య నభ్యసింపనగును.

(ఈ సంస్కారమునగల ఆచార్య బ్రహ్మచారులకు సంబంధించిన విషయముల నిట అనువాదము చేయలేదు. ఇందు కేవలము విధులను మాత్రము అనువదించుటయైనది. గ్రంథ విస్తర భీతితో విడువబడినది.)

సమాప్తము

..................

# 12. సమావర్తన సంస్కారము

బ్రహ్మచర్య వ్రతము, సాంగోపాంగ వేదవిద్యాభ్యాసము, ఉత్తమ శిక్షణ, పదార్థ విజ్ఞానము ననువాని పూర్ణరీతితో బొంది, వివాహ విధాన పూర్వకముగ గృహస్థా శ్రమమును గ్రహించుటకు విద్యాలయమును విడిచి గృహమునకు వచ్చునపుడొనర్చు క్రియకు సమావర్తన సంస్కారమని పేరు. ఇందు ప్రమాణము-

వేదసమాప్తిం వాచయీత. ఆశ్వ. గృ. 1-22-16
కల్యాణై : సహ సంప్రయోగః ఆశ్వ. గృ. 1-23-20
స్నాతకాయోపస్థితాయ. రాజ్ఞే చ ఆచార్య శ్వశుర
పితృవ్య మాతులానాం చ దధని మధ్వానీయ. సర్పిర్
వా మధ్వలాభే. విష్టరః పాద్య మర్ఘ్య మాచమనీయం
మధు పర్కః॥ ఇది ఆశ్వలాయన గృహ్యసూత్రము. 1-24-2-7

తథా పారస్కర గృహ్యసూత్రము :-

వేదం సమాప్య స్నాయాత్. బ్రహ్మచర్యం వా
అష్టా చత్వారింగం శకమ్. పా గృ.2-6-1
త్రయ ఏవ స్నాతకా భవన్తి. విద్యాస్నాతకో.
వ్రతస్నాతకో. విద్యావ్రతస్నాతకశ్చేతి. పా.గృ. 2-5-32

అర్థములు :-

వేదములు (చదువుట) సమాప్తమైనపుడు సమావర్తన సంస్కారము జరుపునది. పుణ్యాత్ములైన పురుషుల సర్వవ్యవహారములందు నెల్లప్పుడు సంబంధముంచు కొనునది. రాజు, ఆచార్యుడు, మామ, పినతండ్రి, మేనమామ మున్నగు పెద్దలు క్రొత్తగా వచ్చినపుడు, విద్య, బ్రహ్మ చర్యములను పూర్ణమొనర్చి బ్రహ్మచారి యింటికి వచ్చినపుడును, మొదట పాద్యము, తదుపరి అర్ఘ్యము, ఆచమనమునకు జలమునిచ్చి శుభాసనమున గూర్చుండ జేయవలయును. పెరుగులో తేనె కాని, ఘృతము కాని యొక గిన్నెలో కలిపి వారికి మధుపర్కమియ్యవలెను. విద్యాస్నాతకుడు, వ్రతస్నాతకుడు, విద్యావ్రత స్నాతకుడు అని స్నాతకులు ముప్విధములుగా నుందురు.–వేదాధ్యయనము, 48 సం. బ్రహ్మచర్యము సమాప్తముచేసి విద్యావ్రత స్నానము బ్రహ్మచారి చేయును.

ఓం తాని కల్పద్ బ్రహ్మచారీ సలిలస్య పృష్ఠే తపో z
తిష్ఠత్ తప్యమానః సముద్రే. స స్నాతో బభ్రుః పింగలః
పృథివ్యాం బహు రోచతే. అథర్వ 11-24-16-26.

గాంభీర్యమున సముద్ర తుల్యుడగు నే బ్రహ్మచారి మిక్కిలి ఉత్తమమగు బ్రహ్మచర్యమున నుండి గొప్ప తపమొనర్చుచు వేదపఠన మొనర్చి, వీర్య నిగ్రహము చేసి ఆచార్యునకు ప్రియమొనర్చి ముందు జూపబోవు విధి ననుసరించి స్నానమొనర్చి పూర్ణ విద్యను ధారణచేసి సుందరవర్ణ యుక్తుడై భూమియందు శుభగుణ కర్మ స్వరూపములతో ప్రకాశమానుడగునో అతడు ధన్యవాదమునకు పాత్రుడగును.

సమయము :- విద్య, హస్తక్రియ, బ్రహ్మచర్య వ్రతము పూర్ణమైనపుడు స్త్రీ పురుషులు గృహాశ్రమమున కిచ్చగింపవలయును. వివాహ స్థానములు రెండు. ఒకటి ఆచార్యుని గృహము, రెండవది తన గృహము. సమావర్తన సంస్కారవిధి పూర్తిచేసి యుపర్యుక్త స్థానములలో నెటనేని వివాహము చేసికొననగును.

సమావర్తన విధి :-

సమావర్తన సంస్కారమునకు నిర్ణయించిన శుభదినమున యజ్ఞవేదిక నలంకరించి యట కావలసిన ఆసన, పాత్రాదులు, హవన సామగ్రి, ఘృత సమిధాదులు నన్నియు సమకూర్చ వలయును.

బ్రహ్మచారి కుండమునకు పశ్చిమమున పూర్వాభిముఖుడై కూర్చుండును. ఆచార్యాదులు వారి స్థానముల నలంకరింతురు. ఆచమనము, అంగస్పర్శలు చేసి సామాన్య ప్రకరణమున జూపిన విధమున నెల్లరు ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసన మంత్రములు, స్వస్తి–శాంతి కరణ మంత్రములు పఠింపనగును. తదుపరి అగ్న్యాధానము, సమిధాధానము, ప్రజ్వలనము, జలప్రసేచనము, ఓం అగ్నయే స్వాహా అను మంత్రములతో 4 ఆఘారావాజ్య భాగాహుతులు, ఓం భూరగ్నయే స్వాహా అను మంత్రములతో వ్యాహృత్యాహుతులు 4. ఓం త్వం నో అగ్నే అను మంత్రములతో 8 అష్టాజ్యాహుతులు, ఓం యదస్య కర్మణో అను మంత్రముతో స్విష్టకృదాహుతి 1 ప్రాజాపత్యాహుతి అన్నియు నియ్యవలయును.

### అగ్ని ఏకత్ర మొనర్చుట

తదుపరి క్రింది మంత్రములతో బ్రహ్మచారి కుండమున గల అగ్ని నేకత్రము చేయును.

ఓం అగ్నే సుశ్రవః సుశ్రవసం మా కురు
ఓం యథా త్వమగ్నే సుశ్రవః సుశ్రవా అసి
ఓం ఏవం మాం సుశ్రవః సౌశ్రవసం కురు
ఓం యథా త్వమగ్నే దేవానాం యజ్ఞస్య నిధిపా అసి
ఓం ఏవమహం మనుష్యాణాం వేదస్య నిధిపో భూయాసమ్

ఈ మంత్రములు చదివి అగ్ని నేకత్ర మొనర్చి,

ఓం అగ్నయే సమిధమాహార్షం బృహతే జాతవేదసే,
యథా త్వమగ్నే సమిధా సమిధ్యస ఽఏవమహమాయుషా
మేధయా, వర్చసా, ప్రజయా పశుభిర్ బ్రహ్మ
వర్చసేన సమింధే జీవపుత్రో మమాచార్యో మేధావ్యహ
మసాన్యనిరాకరిష్ణుర్ యశస్వీ తేజస్వీ బ్రహ్మవర్చస్వ్యన్నాదో
భూయాసగ్ం స్వాహా.

అని యీ మంత్రము నొక్కసారి చదివి యొక్కొక్క సమిధను ముమ్మారు ఆహుతిగా నియ్యవలయును.

## ముఖస్పర్శ

రెండు అఱచేతులకు కొంచెము జలము రాచుకొని, కాచి, ముఖమున కద్దుకొనునది.

1. ఓం తనూపా అగ్నేఽసి తన్వం మే పాహి
2. ఓం ఆయుర్దా అగ్నేఽసి ఆయుర్మే దేహి
3. ఓం వర్చోదా అగ్నేఽసి వర్చో మే దేహి
4. ఓం అగ్నే యన్మే తన్వాఊనం తన్మ ఆపృణ
5. ఓం మేధాం మే దేవః సవితా ఆదధాతు
6. ఓం మేధాం మే దేవీ సరస్వతీ ఆదధాతు.
7. ఓం మేధాం మే అశ్వినౌ దేవావాధత్తాం పుష్కర స్రజౌ

"అవయవస్పర్శ" - తడిచేతులను కాచి, ముఖాదులను స్పృశించును.

1. ఓం వాక్చ మ ఆప్యాయతామ్, ముఖము
2. ఓం ప్రాణశ్చ మ ఆప్యాయతామ్, నాసిక
3. ఓం చక్షుశ్చ మ ఆప్యాయతామ్, కన్నులు
4. ఓం శ్రోత్రంచ మ ఆప్యాయతామ్, చెవులు
5. ఓం యశోబలం చ మ ఆప్యాయతామ్, భుజములు

సుగంధ జలము నింపిన 8 ఎనిమిది కలశములను యజ్ఞకుండమునకు ఉత్తర దిశయందు పూర్వమే యుంచునది.

## స్నానము

ఈ క్రింది మంత్రము పఠించి -

ఓం యే అప్స్వంతరగ్నయః ప్రవిష్టా గోహ్య
ఉపగోహ్యో మయూషో, మనోహాస్థ లో విరుజ
స్తనూదుషురింద్రియహా తాన్ విజహామి యో
రోచనస్త మిహ గృహ్ణామి. పా, గృ. 2-6-10
ఓం తేన మామభిషించామి శ్రియై యశసే బ్రహ్మణే
బ్రహ్మవర్చసాయ, పా. గృ. 2-6-11

అని మొదటి కలశమునుండి నీరుతీసికొని స్నానముచేయునది. మరల..

"ఓం యే అప్స్వంతరగ్నయః ......."

అను మంత్రమునే చదివి రెండవ ఘటమునుండి చెంబుతో నీరు తీసికొని-

ఓం యేన శ్రియ మకృణుతాం యేనావమృశతాగ్ం
సురామ్, యేనాక్ష్యావభ్యసించతాం యద్వాం
తదశ్వినా యశః పా, గృ. 2-6-12

అను నీమంత్రమును జదివి స్నానమొనర్చును. తదుపరి మరల "ఓం యే అప్స్వంత: ......." మంత్రమును జదివి మూడవ ఘటమునుండి జలము చెంబులో తీసికొని-

ఓం ఆపో హి ష్ఠా మయోభువ స్తాన ఊర్జే
దధాతన, మహేరణాయ చక్షసే
ఓం యో వః శివతమో రస స్తస్య భాజయతేహ నః
ఉశతీరివ మాతరః
ఓం తస్మా అరంగమామ వో యస్య క్షయాయ జిన్వథ.
ఆపో జనయథా చ నః

అను నీ మంత్రములను జదివి స్నానము చేయవలయును. మరల పై మూడు మంత్రములనే చదివి చివరి మూడు ఘటములనుండి జలము తీసికొని స్నానము చేయవలయును.

ఇట్లు స్నానము పూర్తిచేసి, బ్రహ్మచారి యీ క్రింది మంత్రము జదివి మొలత్రాడు దండమును విడిచి పెట్టును.

ఓం ఉదుత్తమం వరుణపాశ మస్మదవాధమం
విమధ్యమం శ్రథాయ, అథావయమాదిత్య వ్రతే
తవా నాగసో z దితయే స్యామ. యజు. 12-12

మేఖల, దండము విడిచి బ్రహ్మచారి సూర్యునకెదురుగా నిలబడి-
"ఓమ్ ఉద్యన్ భ్రాజభృష్ణురింద్రో మరుద్భిరస్థాత్ ప్రాతర్యావభిరస్థాద్ దశసనిరసి దశసనిం మా కుర్వా విదన్ మా గమయ. ఉద్యన్ భ్రాజభృష్ణురింద్రో మరుద్భి రస్థాత్ దివా యావభిరస్థా చ్ఛతసనిరసి శతసనిం మా కుర్వావిదన్ మా గమయ, ఉద్యన్ భ్రాజభృష్ణురింద్రో మరుద్భిరస్థాత్ సాయం యావభిరస్థాత్ సహస్రసనిరసి, సహస్రసనిం మా కుర్వావిదన్ మా గమయ" పా. గృ. 2-6-16

అను నీమంత్రముతో పరమాత్ముని యుపస్థానము, స్తుతిచేసి, పెరుగుకాని, నువ్వులుకాని ప్రాశనముచేసి జడలు లోమములు నఖములు ఛేదింపజేసి-

ఓం అన్నాద్యాయ వ్యూహధ్వగ్ం సోమో రాజాయ
మాగమత్, స మే ముఖం ప్రమార్క్ష్యతే యశసా చ
భగేన చ. పా. గృ. 2-6-17

అను మంత్రము జదివి మేడిపుల్లతో దంత ధావనముచేయును. తదుపరి సుగంధద్రవ్యమును శరీరముపై రాచుకొని శుద్ధజలముతో స్నానముచేసి, తుడుచుకొని ధోవతి – పీతాంబరమును ధరించును. సుగంధయుక్త చందనాదులను దేహముపై పూసికొనును. తరువాత నీ క్రింది మంత్రముతో:-

ఓం ప్రాణాపానౌ మే తర్పయ. చక్షుర్ మే తర్పయ.
శ్రోత్రం మే తర్పయ. పా.గృ. 2-6-18

అని కన్నులు ముక్కు ముఖమును స్పృశించి చేతిలో జలముంచుకొని అపసవ్యముగా దక్షిణాభిముఖుడై -

ఓం పితరః శుంధధ్వమ్,

అని జలము భూమిపై వదలి – సవ్యుడై -

ఓం సుచక్షా అహమక్షీభ్యాం భూయాసగ్ం సువర్చా
ముఖేన, సుశ్రుత కర్ణాభ్యాం భూయాసమ్. పా. గృ. 2-6-19

అను నీ మంత్రమును జపించి,
ఓం పరిధాస్యై యశోధాస్యై దీర్ఘాయుత్వాయ జరదష్టి
రస్మి, శతం చ జీవామి శరదః పురూచీ రాయస్పోషమభి
సంవ్యయిష్యే. పా.గృ. 2-6-20

అను నీ మంత్రమును పఠించి సుందరము శ్రేష్ఠమునగు వస్త్రమును ధరించును.

ఈ క్రింది మంత్రముతో ఉపవస్త్రధారణము.

ఓం యశసా మా ద్యావాపృథివీ యశసేంద్రా బృహస్పతీ,
యశో భగశ్చ మావిదద్ యశో మా ప్రతి పద్యతామ్.
పా.గృ. 2-6-21

క్రింది మంత్రములతో పుష్పమాలాధారణము.

1. ఓం యా ఆహరజ్జమదగ్నిః శ్రద్ధాయై కామాయేంద్రి
యాయ,తా అహం ప్రతిగృష్ణామి,యశసా చ భగేన చ.
పా.గృ. 2-6-23

2. ఓం యద్యశోప్సరసా మింద్రశ్చకార విపులం పృథు,
తేన సంగ్రథితాః సుమనస ఆబధ్నామి యశో మయి.
పా. గృ. 2-6-24

తరువాత తలపాగ, ఉత్తరీయము, మకుటము మున్నగు నలంకరణములను తీసికొని-

ఓం యువా సువాసాః పరివీత ఆగాత్
స ఉ శ్రేయాన్ భవతి జాయమానః-

అను మంత్రమును పఠించి ధరింప వలయును.

అలంకరణములు:-

ఓం అలంకరణమసి భూయోऽ లంకరణం భూయాత్.
పా. గృ. 2-6-26

కంటికి అంజనము:-

ఓం వృత్రస్యాసి కనీనకశ్చక్షుర్దా అసి చక్షు ర్మే దేహి యజు. 4-3

అద్దము :-

ఓం రోచిష్ణు రసి. అని ముఖావలోకనము, పా. గృ. 2-6-28

ఛత్రధారణము :-

ఓం బృహస్పతే శ్ఛదిరసి పాప్మనో మామంతర్ధేహి
తేజసో యశసో మామంతర్ధేహి. పా. గృ. 2-6-29

పాదరక్షలధారణము :-

ఓం ప్రతిష్ఠే స్థో విశ్వతో మా పాతమ్. పా. గృ. 2-6-30

చేతికఱ్ఱ :-

ఓం విశ్వాభ్యో మా నాష్ట్రాభ్యః పరిపాహి సర్వతః పా. గృ. 2-6-31

ఇట్లు బ్రహ్మచారిని అలంకరించి తల్లిదండ్రులు బంధువులు ఆదరింతురు.
తదుపరి ఆచార్యునకు అర్ఘ్య పాద్యాదులిచ్చి ఆచమన మధుపర్కాదులతో

సత్కరించి తగిన విధమున గో వస్త్రధన ధాన్యాదుల నొసంగి పూజించి బ్రహ్మ
ఆచార్యుని గుణగణములను విద్యను నందఱి యెదుట ప్రశంసించును. ఆదరణీ
బంధువులారా! వినుడు. ఆచార్యులు నాకెంతో యుపకారముచేసిరి. నా
పశుత్వమును బోగొట్టి విద్వాంసు నొనర్చినారు. వారికి నేనేమియు ప్రత్యుపకారము
చేయజాలను. అనేక ధన్యవాదములను మాత్రమొసంగగలను. నమస్కరించి
ప్రార్థించుచున్నాను. "ఆచార్య! మీరు ఉత్తమ శిక్షణ నొసంగి నన్ను కృతకృత్యుని
చేసినట్లు ఇతర విద్యార్థులనుగూడ కృతకృత్యులను జేయుడు.

సమాప్తము

......................

# 13. వివాహ పద్ధతి

## (వివాహ సమయము)

బాలబాలికలు పూర్ణబ్రహ్మచర్య వ్రతమును పాలించి. బలము సంపాదించిన యువావస్థను బొందిన పిదప గుణకర్మ స్వభావములలో తుల్యులైన యువతీ యువకులు ప్రేమపూర్వకముగ, నిమ్నలిఖిత ప్రమాణముల ననుసరించి సంతానోత్పత్తి కొఱకును, తమ తమ వర్ణాశ్రమములకు తగినట్లు ఉత్తమ కార్యముల నొనర్చుటకును జేసికొను సంబంధము వివాహ మనబడును.

వివాహము చేసికొనబోవు యువకుడు 25 సంవత్సరములు కాని, అంతకు పైబడిన వయస్సు కలవాడు గాని యైయుండవలయును. యువతి 16 పదునాఱేండ్లకు పైబడిన వయస్సు గలిగియుండ వలయును. పురుషుడు పెద్దవాడుగాను, స్త్రీ చిన్నదిగాను ఉండుట యుభయులకు శ్రేయస్కరము. ఇరువురి మధ్య (8) ఎనిమిదేండ్లకు తక్కువ గాని, యంతర ముండుట మంచిది.

(1) ఉదగయన ఆపూర్యమాణపక్షే పుణ్యే నక్షత్రే
చౌలకర్మ – ఉపనయన – గోదాన – వివాహాః [1]
(2) సార్వకాల మేకే వివాహమ్. [2] ఆశ్వ. గృహ్య. 1-4-1.2
(3) ఆవసథ్యాధానం దారకాలే. పా. గృ. 1-2-1
(4) పుణ్యే నక్షత్రే దారాన్ కుర్వీత.
(5) లక్షణ ప్రశస్తాన్ కుశలేన. గోభి. గృ. 2-1-1,2

అర్థము :– ఉత్తరాయణ శుక్లపక్షమున నెల్లరు ప్రసన్నులైయుండు దినమున వివాహముచేసి కొనవలయును. (1) కొందఱు ఆచార్యులు "ఎప్పుడైనను-ఇష్టమైన దినమున వివాహముచేసి కొనవచ్చును." అనియభిప్రాయపడుచున్నారు. (2) వివాహ సమయమున స్థాపించు అగ్ని "అవసథ్య" మనబడును. (3) ప్రసన్నముగానున్ననాడు, శుభగుణ లక్షణములతో నున్న స్త్రీ పాణిగ్రహణము చేయవలయును- (4, 5.)

## (మధుపర్క విధి)

వివాహము జరుగుదినమున పెండ్లి కొడుకు తన యింటి దగ్గఱ మంగళ స్నానముచేసి శుద్ధ వస్త్రములను - నూతన వస్త్రములను ధరించి తన తల్లి

రంధ్రులతో బంధు బాంధవులతో ప్రాతః కాలమున యజ్ఞోపవీతధారణము స్తుతిప్రార్థన, స్వస్తివాచక, శాంతి కరణ మంత్ర పఠనము సంధ్యోపాసన అగ్నిహోత్రములు చేసి తదుపరి బంధువులతోపాటు వివాహ సమయమునకు ముందే వధువు గృహమునకు తరలి రావలయును.

వధువు కూడ వరుని రాకకు పూర్వమే తాను మంగళ స్నానము చేసి నూతన వస్త్రములను, లేక శుద్ధ వస్త్రములను ధరించి తన బంధువులతోబాటు ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనాదులు, స్వస్తివాచక, శాంతికరణ మంత్ర పఠనము యజ్ఞోపవీత ధారణము నొనర్చి సామాన్య - అగ్నిహోత్ర మొనర్చి వరస్వాగతమునకు సిద్ధముగా నుండవలయును. వరుని స్వాగతము గృహద్వార సమీపమున జేయవలయును. ఈ స్వాగత సత్కారములకు సంబంధించిన విధిని మధుపర్కవిధి యందురు.

ఇందు ఆవశ్యకమగు వస్తువులు :-

వరుని అర్ఘ్యపాద్యములతో సత్కరించుటకు పాదప్రక్షాళన పాత్ర-పెద్ద పళ్ళెము, చెంబునీళ్ళు, పాదములు తుడుచుకొనుటకు ఒక తుండు గుడ్డ, ఆచమన పాత్ర-నీళ్ళు, వరస్వాగతమునకు వరమాల, (పూలదండ) కూర్చుండుటకు ఆసనములు–పీటలు, మధుపర్కము –(ఒక గిన్నెలో కొంచెము తేనె నేయి కలిపిన పెరుగు), ఒక చమ్చా – గరిటె, వధువునకు ఇయ్యదలచి తెచ్చిన పెండ్లి చీర మున్నగు నూతన వస్త్రములు అట్లే వరునకు వధువు పక్షము వారియ్యదలచిన వస్త్రములు- వరపూజ జరుపు స్థలమున సిద్ధముగా నుంచవలయును.

వరుడు వచ్చి పూర్వాభిముఖుడై నిలుచున్న వెంటనే వధువు అతని కెదురుగా నిలబడి తనచేతిలోనున్న పూలమాలను వరుని మెడలో నుంచి యుతనికి స్వాగతము ఈ క్రింది మాటలతో పలుకును.

వధువు :- సాధు భవాన్ ఆస్తామ్ అర్చయిష్యామో భవన్తమ్.

ఆర్యపుత్ర దయచేసి కూర్చుండుడు. (అని వరునకై యమర్చిన ఆసనమును జూపుచు)

ఓం విష్టరో విష్టరో విష్టరః ప్రతి గృహ్యతామ్. పా. గృ. 1-3-4.

(ఇదిగో ఆసనము దీనిపై కూర్చుండుడు అనును)

వరుడు :- ఓమ్ అర్చయ :- అట్లే కానిండు అని "ఓమ్ ప్రతిగృహ్ణామి" అని ఈ క్రింది మంత్రము చదివి తనకు చూపిన ఆసనముపై పూర్వాభిముఖముగా కూర్చుండును.

మంత్రము :

ఓం వర్ష్మోస్మి సమానానా ముద్యతామివ
సూర్యః, ఇమం తమభితిష్ఠామి యో మా
కశ్చనాభి దాసతి పా.గృ. 1-3-8

మంత్రార్థము :- నా సమానులలో నేను తేజస్విని, ఉన్నతి నొందువారిలో సూర్యసమానుడను, నన్నెదుర్కొన దలచువారి నీ యాసనమును వలె క్రిందికి అణచువాడను.

వధువును మధ్యకూర్చుండబెట్టుకొని ఆమె తల్లిదండ్రులు వరున కెదురుగా తమకై యేర్పఱచిన పీటలపై పశ్చిమాభి ముఖముగా కూర్చుండవలయును. తల్లి దండ్రులు జలకలశమును కన్యచేతి యందుంచవలయును. అంతట వధువు ఆచెంబును పట్టుకొని-

వధువు :- ఓం పాద్యం పాద్యం పాద్యం ప్రతిగృహ్యతామ్ 1-3-9

"కాళ్ళు కడుగుకొనుటకు నీళ్ళను తీసికొనుడు." అని నీటిచెంబును వరున కందించును.

వరుడు :- ఓం. ప్రతిగృహ్ణామి-గ్రహించుచున్నాను

అని నీటిచెంబును తీసికొని ఈ క్రింది మంత్రము నుచ్చరించుచు కాళ్ళు కడుగుకొనవలయును. ముందు కుడికాలు తదుపరి ఎడమకాలు.

మంత్రము :-

ఓం విరాజో దోహోऽసి విరాజో దోహ
మశీయ మయి పాద్యాయై విరాజో దోహః పా.గృ. 1-3-12

మం. అ. :- జలమా! నీవు ప్రకాశవంతమగు రసపదార్థమవు. నేనీ జలమును సేవింతును. ఈ దివ్యజలము పాదప్రక్షాళనమునకై నాకు లభించుట శుభంకరము.

వధువు :- తల్లి దండ్రులచే నీయబడిన జలముతో నిండిన పాత్రము తీసికొని-

ఓం అర్ఘోఽర్ఘః ప్రతిగృహ్యతామ్

"అర్ఘ్యపాత్ర యీ యర్ఘ్య పాత్రము నందుకొనుడు" అని వరునకందీయ వలయును.

వరుడు :- ఓం ప్రతిగృహ్ణామి, 'గ్రహించుచున్నాను.'

అని యాజలపాత్రనందుకొని-

ఓం ఆపస్థ యుష్మాభిః సర్వాన్ కామానవాప్నవాని.
ఓం సముద్రం వః ప్రహిణోమి స్వాం యోని మభిగచ్ఛత,
అరిష్టా అస్మాకం వీరా మా పరాసేచి మత్పయః
పా.గృ. 1-3-13, 14

మం. అ. :- ఈ జలముతో సమస్త కోరికలను బొందుదును. జలమును ఆకాశమున వెదజల్లుదును-దానితో మా సంతానములు స్పష్టములగు గాక! నేను జలమునకు దూరము కాకుందునుగాక—అని నీ మంత్రమును జదువుచు ముఖము చేతులు కడుగుకొనవలయును.

వధువు :- ఆచమన పాత్రమునందుకొని-

ఓం ఆచమనీయమ్ ఆచమనీయ మాచమనీయమ్ ప్రతిగృహ్యతామ్. పా.గృ. 1-3-5, 6

వరుని చేతికందించుచు "ఈ యాచమనీయమునందు కొనుడు"- అని యందింప వలయును.

వరుడు :- ఓం ప్రతిగృహ్ణామి 'గ్రహించుచున్నాను' పా.గృ. 1-3-7.

అని చెప్పుచు ఆ జలపాత్రనందుకొని తన ముందుంచుకొని దాని నుండి కుడిచేతిలో కొంచెము జలముపోసికొని—

మం :-ఓం అమాగన్ యశసా సగ్ంసృజ వర్చసా,
తం మా కురు ప్రియం ప్రజానామధిపతిం
పశూనా మరిష్టిం తనూనామ్. పా.గృ. 1-3-15.

మం. అ. :- ఈ జలము నాలోచేరి యశస్సును వర్చస్సును చేకూర్చుగాక! శ్రియము కలిగించు గాక! జలమా సంతానవంతుని జేయుము. పశువులకును, తనువులకును క్షేమము గూర్చుము. మంత్రము ప్రతి యాచమనమున కొకసారి చొప్పున మూడుసార్లు చదివి ముమ్మారా చమింపవలయును. తదుపరి పెరుగులో కొంచెము తేనె నేయి గలిపియుంచిన పాత్రను తల్లి దండ్రులనుండి తీసికొని ఆ మధుపర్కమును-

వధువు :- ఓం మధుపర్కో మధుపర్కో మధుపర్క:
ప్రతిగృహ్యతామ్. పా.గృ. 1-3-5,6

ఆర్యపుత్ర మధుపర్కమునందుకొనుడు. అని వరున కందింపవలయును.

వరుడు :- ఓం ప్రతిగృహ్ణామి 'గ్రహించుచున్నానని'

చెప్పి ఆ మధుపర్క పాత్రను దీసికొని-

ఓం మిత్రస్య త్వా చక్షుషా ప్రతీక్షే. పా. గృ. 1-3-16

మిత్రదృష్టితో నిన్ను జూతును' అని దానివంక జూచుచు-

ఓం దేవస్య త్వా సవితుః ప్రసవేఽశ్వినోర్ బాహుభ్యాం
పూష్ణో హస్తాభ్యాం ప్రతిగృహ్ణామి. పా. గృ. 1-3-17

భగవంతుడు సూర్యధారణతో జగత్తును కాపాడునట్లు నేను ఈ దధి మధు ఘృతములను గ్రహించి స్వస్థుడనగుదును. అని చెప్పుచు నా పాత్రను తన యెడమచేతిలో నుంచుకొనవలయును. తదుపరి–క్రింది మంత్రములు చదివి-

ఓం భూర్భువఃస్వః, మధువాతా ఋతాయతే
మధు క్షరన్తి సింధవః, మాధ్వీర్ నః సంత్వోషధీః (1)
ఓం భూర్భువః స్వః మధు నక్తముతోషసో
మధుమత్ పార్థివగ్ం రజః, మధు ద్యౌరస్తు నః పితా (2)
ఓం భూర్భువఃస్వః, మధుమాన్నో వనస్పతిః
మధు మాగ్ం అస్తు సూర్యః, మాధ్వీర్ గావో
భవంతు నః (3) యజు. 13-27, 28, 29

6. సచ్చిదానందరూప భగవన్! సత్యవంతుడవగు నాకు వాయువులు, నదులు, ఓషధులు, రాత్రులు, ఉషస్సు పార్థివ పరమాణువులు, వృక్షము సూర్యుడు మధురములై, సుఖదాయకములై కాపాడును గాక! అని మధుపర్కము వంక జూడవలయును. తరువాత యీ మంత్రము-

ఓం నమః శ్యావాస్యాయాన్నశనే యత్త
ఆవిద్ధం తత్తే నిష్కృంతామి. పా.గృ. 1-3-18

తినుటకు తగిన మధుపర్కమా నిన్నాదరించుచున్నాను. నీలో నేదైన చెడుకలిసి యున్న దానిని తీసివేయుదును. అని తన కుడిచేతి అంగుష్ఠ-అనామికలతో నామధుపర్కమును కలియబెట్టవలయును. తరువాత యీ క్రింది మంత్రము లుచ్చరించుచు అనామిక బొటనవ్రేళ్ళతో నొక్కొక్క దిశయందు కొంచెము కొంచెముగా నామధుపర్కమును చిలకరింప వలయును.

ఓం వసవస్త్వా గాయత్రేణ ఛందసా భక్షయంతు.

వసు బ్రహ్మచారులు నిన్ను సేవింతురు గాక అని తూర్పున చిలకరింపవలయును.

ఓం రుద్రాస్త్వా త్రైష్టుభేన ఛందసా భక్షయన్తు.

రుద్రబ్రహ్మచారులు నిన్ను సేవింతురుగాక అని దక్షిణమున చల్లవలయును.

ఓం ఆదిత్యాస్త్వా జాగతేన ఛందసా భక్షయంతు,

ఆదిత్య బ్రహ్మచారులు నిన్ను సేవింతురుగాక అని పశ్చిమమున చల్లవలయును.

ఓం విశ్వే త్వా దేవా అనుష్టుభేన ఛందసా భక్షయన్తు.

విద్వాంసు లెల్లరు నిన్ను సేవింతురుగాక! అని ఉత్తరమున చల్లవలయును.

ఆ. గృ 1-24-14

ఓం భూతేభ్యస్త్వా పరిగృహ్ణామి ఆ. గృ 1-14-15

సర్వప్రాణులకొఱకు నేను గ్రహించుచున్నాను అని, పైకి మూడు మారులు చిలకరించి యటుపై తాను మూడు భాగములుచేసి యామధుపర్కమును మూడు

పాత్రలలో నుంచి తన యెదుటనుంచు కొని యీ క్రింది మంత్రమును జదువవలయును.

ఓం యన్మధునో మధవ్యం పరమగ్ం రూప మన్నాద్యమ్,
తేనాహం మధునో మధవ్యేన పరమేణ రూపేణాన్నా
ద్యేన పరమో మధవ్యోఽన్నాదోఽ సాని. పా. గృ. 1-3-20.

ఈ మధుపర్కమునగల రుచికర, శ్రేష్ఠ పదార్థమును నేను సేవింతును. అని మంత్రమును నొక్కక్కసారి చెప్పుచు నొక్కొక్క పాత్ర నుండి కొంచెము కొంచెముగా తీసికొని ముమ్మాఱు తినవలయును. (గిన్నెలలోనున్న దంతయు తినవచ్చును. మిగిలినది జలమున గలిపి పాఱవేయునది.)

తదుపరి ఈ క్రింది రెండు మంత్రములతో రెండు ఆచమనములు చేయవలయును.

ఓం అమృతాపిధానమసి స్వాహా. అని ఆచమింపవలయును.
ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతామ్ స్వాహా.
రెండవ ఆచమనము ఆ గృ. 1-24-22.

ఓం వాఙ్మ ఆస్యేఽస్తు -

ఎడమ చేతిలో నున్న నీటిలో కుడిచేతి మధ్యమానామికలను ముంచి వానితో ముఖమును స్పృశింపవలయును. (పెదవులను)

ఓం నసోర్మే ప్రాణోఽస్తు - ముక్కుపుటములను తాకవలయును
ఓం అక్ష్ణో ర్మే చక్షు రస్తు-కన్నులను
ఓం కర్ణయోర్మే శ్రోత్ర మస్తు-చెవులను
ఓం బాహ్వోర్మే బల మస్తు-భుజములను
ఓం ఊర్వోర్మ ఓజోఽ స్తు-తొడలను
ఓం అరిష్టాని మేఽఙ్గాని తనూ స్తన్వా మే సహసన్తు.
అంతట చల్లుకొనవలయును.

## గోదానము

కన్య :- ఓం గౌర్ గౌర్ గాః ప్రతి గృహ్యతామ్ పా.గృ. 1-3-26

అని వరునకు గోవును ద్రవ్యాదులనిచ్చి సత్కారము చేయునది.

వరుడు :- ఓం ప్రతిగృహ్ణామి.

అని కార్యకర్త లిచ్చిన గోవును ద్రవ్యాదులను గ్రహించును.

ఇట్లు మధుపర్కవిధిని పూర్తిచేసి తదుపరి కన్యను వరుని కుడివైపున కూర్చుండబెట్టి తల్లి దండ్రులు-కన్యాదాతలు-

(కన్యా ప్రతి గ్రహణము)

ఉత్తరాభి ముఖముగా కూర్చుండి ఈ క్రింది వాక్యము నుచ్చరించి కన్యాదాతలు వరుని కుడి అఱచేతిలో కన్య కుడి అఱచేతిని పైకి కనబడునట్లు ఉంచి తమ కుడి చేతులను వధూవరుల హస్తముల పైనను ఎడమ చేతులను క్రింది భాగమున ఉంచి పట్టుకొని యీ క్రింది శ్లోకమును చదువ వలయును.

కన్యాం సాలంకృతాం సాధ్వీం సుశీలాయ సుధీమతే।
శ్రీమతేஒ స్మై ప్రయచ్ఛామి మోక్షకామార్థ ధర్మణే॥

______ గోత్రమున పుట్టిన శ్రీ ........ గారి ప్ర పౌత్రుడవును,శ్రీ ______ గారి పౌత్రుడవును, శ్రీ ............గారి పుత్రుడవునగు ఓ కుమారా! ______గారి మనుమరాలును, ............నామధేయుడవగు నాయనుంగు పుత్రిక చి.______ పాణిని గ్రహించి గృహస్థ జీవితమును గడపుచు ధర్మార్థ కామ మోక్షముల సాధింతువు గాక!

వరుడు :- ఓం ప్రతి గృహ్ణామి.

ఆర్యా! అట్లే యాచరింతును. అని చెప్పి యీ క్రింది మంత్రము నుచ్చరించి-

(కన్యకు వస్త్రముల నిచ్చుట)

ఓం జరాం గచ్ఛ పరిధత్స్వ వాసో భవాకృష్టీనా
మభిశస్తిపావా. శతం చ జీవ శరదః సువర్చా
రయిం చ పుత్రా ననుసంవ్యయస్వ ఆయుష్మ
తీదం పరిధత్స్వ వాసః. పా.గృ. 1-4-12

వధూ! నాతో చిరకాలము సుఖముగా నుండుము. ఈ వస్త్రములను

ధరింపుము. ప్రయత్న శీలురలో ప్రశంసను బొందుము. నూఱు సంవత్సరములు జీవింపుము. వర్చస్వివివి కమ్ము సంతాన సంపదలను బొందుము. వస్త్రములను ధరింపుము. ఈమాటలతో వస్త్రముల నందించి, మరల క్రింది మంత్రము నుచ్చరించుచు నుత్తరీయము నీయవలయును.

ఓం యా అకృంతన్నవయన్ యా అతన్వత యాశ్చదేవీ
స్తన్తానభితో తతన్థ, తాస్త్వా దేవీ ర్జరసే సంవ్యయస్వ
ఆయుష్మతీదం పరిధత్స్వ వాసః. పా. గృ. 1-4-13.

మం.అ. :- ఈ వస్త్రములను, నూలువడికి సిద్ధముచేసిన వారిని ఆదరించుచుందువు గాక! ఈ యుత్తరీయమును కూడ ధరించి సుఖింపుము.

## (వరుడు వస్త్రములను ధరించుట)

వరుడు తాను స్వయముగా తెచ్చుకొనిన వస్త్రములను గాని, వధువు పక్షము వారిచ్చిన వానినిగాని యీ క్రింది మంత్రములను చదివి ధరింపవలయును.

వరుడు:- ఓం పరిధాస్యై యశోధాస్యై దీర్ఘాయుత్వాయ
జరదష్టిరస్మి. శతం చ జీవామి శరదః పురూచీ
రాయస్పోషమభిసంవ్యయిష్యే. పా.గృ 2-6-20

వస్త్రము ధరించుటకు, యశస్సును సంపాదించుటకు, దీర్ఘాయువు కొఱకు, వృద్ధావస్థయందును సుఖముగా నుండుటకు కోరుచున్నాను. ధనమును పోషించుటకు మర్యాదను కాపాడుదును.

(అనుచు ధోవతిని కట్టుకొని, తదుపరి క్రింది మంత్రమును జదివి యుత్తరీయమును ధరింపవలయును.)

ఓం యశసా మా ద్యావా పృథివీ యశసేంద్రా బృహస్పతీ, యశో
భగశ్చ మా విదద్ యశో మా ప్రతి పద్యతామ్.
పా. గృ. 2-6-19

పృథివీ, ద్యులోకముల నుండియు, ఐశ్వర్యము, జ్ఞానము గలవారి నుండియు, శ్రేష్ఠజనులనుండియు నాకు యశస్సు, ధనము లభించుగాక! అని యుత్తరీయమును ధరింపవలయును.

వధూవరులు ఇరువురును వేఱు వేఱుగా ఏకాంత స్థలములకు పోయి వస్త్రములను ధరింప వలయును. ఇంతలో యజ్ఞవేదిక యందు కావలసిన వస్తువులన్నిటిని చేర్చి సిద్ధముగా నుంచవలయును.

ఒక వ్యక్తి శుద్ధ వస్త్రములను ధరించి, యొక కలశమును జలముతో నింపి తీసికొని వచ్చి యజ్ఞవేదికను పరిక్రమముజేసి, వేదికకు దక్షిణ భాగమున కలశమును తనముందుంచుకొని యుత్తరాభి ముఖుడై కూర్చుండ వలయును.

మఱియు నట్లే వరపక్షమునకు జెందిన మఱియొక వ్యక్తి కఱ్ఱ నొకదానిని చేతబట్టుకొని యజ్ఞకుండమునకు దక్షిణభాగమున ఉత్తరాభిముఖుడై కూర్చుండ వలయును.

ఇంకను నిట్లే, పెండ్లికూతునకు తోడబుట్టినవాడు కాని, సహోదరుడు లేని పక్షమున పినతండ్రి కొడుకుగాని, మేనమామ కుమారుడు గాని, పినతల్లి కొడుకుగాని వీరిలో నెవరో యొకరు జమ్మిఆకు (ఎండినది) కలిపిన పేలాలు ఉంచిన చేటను బట్టుకొని యజ్ఞ కుండమునకు పశ్చిమ భాగమున పూర్వాభిముఖుడై కూర్చుండి యుండవలయును.

తదుపరి నున్నగానుండు నొక రాతిముక్కనుగాని, చిన్నసానను గాని కార్యకర్త దగ్గఱనుంచుకొనవలయును. వధూవరులు కూర్చుండుటకు వలయు నాసనములను (పీటలనో చిత్రాసనములనో) గూడ కుండమునకు పశ్చిమ భాగమున నమర్చియుంచవలయును.

## వధూవరులు యజ్ఞ మండపమునకు వచ్చుట

వస్త్రములను ధరించిన తదుపరి వధూవరులు యజ్ఞవేదికనైకి వచ్చి కుండమునకు పశ్చిమ భాగమున పూర్వాభి ముఖులై నిలబడి - (వరునకు కుడిభాగమున వధువు నిలబడును.)

ఈా క్రింది మంత్రమును జెప్పుదురు.

ఓం సమంజంతు విశ్వే దేవాః సమాపో హృదయాని నౌ.
సం మాతరిశ్వా సంధాతా, సముదేష్ట్రీ దధాతు నౌ.

ఋ. 10-85-47

విద్వాంసులార! మీరు "మేమిరువురము ప్రసన్నతతో గృహాశ్రమమున కలిసి యుండుటకు పరస్పరము స్వీకరించినట్లు" గ్రహింతురు గాక! మా హృదయములు జలమువలె ప్రశాంతముగ గలిసి యుండును. మేమిరువురము పరస్పరము ప్రసన్నులమై యుందుము. పరమేశ్వరుడు జగత్తును ధరించియున్నట్లు మేమొకరి నొకరము ధరింతుము. ఉపదేశకుడు శ్రోతలను ప్రేమించునట్లు మేము పరస్పరము ప్రేమగలిగి యుందుము.

(అని వధూవరులు సభ్యులతో నుడివి తదుపరి వరుడు తన కుడి చేతితో వధువు దక్షిణ హస్తమును తన యఱచేతిలో నామె యఱచేతిని పైకి ఉంచి పట్టుకొని, ఇట్లు చెప్పవలయును.)

ఓం యద్దైషి మనసా దూరం దిశో౽ నుపవమానో వా.
హిరణ్యపర్ణో వై కర్ణః స త్వా మన్మనసాం కరోతు -
అసౌ. (వధువు నామము)  పార.గృహ్య. 1-4-15.

ఓ సుందరీ! (వధువు నామము నుచ్చరించి ఓ సుశీలా! ఓ యశోదా! అని సంబోధించి) వాయువు, సూర్యుడు దూరముననున్న వస్తువులను చేరునట్లు నీవు ప్రేమతో కోరి నన్ను చేరుచున్నావు. అట్టి నిన్ను పరమేశ్వరుడు నా కనుకూలముగా జేయుగాక! నీవు నన్ను మనః పూర్వకముగ జేరుచున్నావు. పరమేశ్వరుడు నిన్ను నామనస్సున కనుకూలముగ నుండునట్లు చేయునుగాక!

(అని యిట్లు చెప్పి యీ క్రింది మంత్రములను చెప్పవలయును.)

ఓమ్ భూర్భువఃస్వః అఘోరచక్షురపతిఘ్న్యేధి
శివా పశుభ్యః సుమనాః సువర్చాః, వీరసూర్ దేవృ
కామా స్యోనా శన్నో భవ ద్విపదే శం చతుష్పదే.
ఋ. 10-85-44

ఓమ్ భూర్భువఃస్వః, సా నః పూషా శివతమామైర
రయ సా న ఊరూ ఉశతీ విహర, యస్యా ముశంతః
ప్రహరామ శేఫం యస్యాము కామా బహవో నివిష్ట్యై
పార. గృహ్య. 1-4-16

"ఓ వధూ ! పతిని ద్వేషింపని నీవు సచ్చిదానంద స్వరూపుడగు పరమేశ్వరుని

కృపవలన ప్రియదృష్టికలదాన వగుము. మంగళకారిణివి, పశువులకు సుఖ
నిచ్చుదానవు, మంచి మనస్సు తేజస్సుగల దానవునై, శుభగుణయుక్తనై బంధువుల
పశువులకు శుభము శాంతిని ఇమ్ము. అట్లే నేనును వర్తింతును.

(ఇట్లు పైన వ్రాసిన నాల్గు మంత్రములను అర్థసహితముగ జెప్పి వధూవ
రిరువురు యజ్ఞకుండమునకు ప్రదక్షిణముచేసి కుండమునకు పశ్చిమ భాగము
వరునకు కుడివైపున వధువు,ఆమెకు ఎడమవైపున వరుడును పూర్వాభి ముఖు
కూర్చుండ వలయును. అంతట వధువు ఈ మంత్రమును నుచ్చరింప వలయును

ఓ3మ్ ప్రమే పతియాన: పంథా: కల్పతాగ్ం
శివా అరిష్టా పతిలోకం గమేయమ్. మం. బ్రా. 1-1-8

"హేభగవన్ ! నాకు పతిని బొందదగు మార్గమును కల్పింపుము. నేను
శుభములతో నొప్పారుచు రోగాది దుఃఖములు లేనిదాననై పతి గృహము
బొందుదును గాక !"

## (వివాహ యజ్ఞ ప్రారంభము)

(తదుపరి యజ్ఞకుండమునకు దక్షిణ దిశయందు పురోహితుడు ఉత్తరా
ముఖుడై కూర్చుండ వలయును. తరువాత పురోహితుడు వధూవరులచే క్రింది
మంత్రములతో ఆచమనము అంగస్పర్శము చేయింప వలయును.)

ఆచమన మంత్రములు :-

1. ఓం అమృతోప స్తరణమసి స్వాహా
2. ఓం అమృతాపిధానమసి స్వాహా
3. ఓం సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా

అంగస్పర్శ మంత్రములు:-

1. ఓం వాఙ్మ ఆస్యేఽ స్తు
2. ఓం నసోర్ మే ప్రాణోఽ స్తు
3. ఓం అక్ష్ణోర్ మే చక్షురస్తు
4. ఓం కర్ణయోర్ మే శ్రోత్రమస్తు
5. ఓం బాహ్వోర్ మే బలమస్తు

6. ఓం ఊర్వోర్ మ ఓజో౽ స్తు
7. ఓం అరిష్టాని మే౽ జ్గాని తనూ స్తన్వా మే సహసస్తు

వధూవరులు యజ్ఞోపవీత ధారణము చేయకయున్నచో వారికి యజ్ఞోపవీత ధారణము చేయింపవలయును.

ఓం యజ్ఞోపవీతం పరమం పవిత్రం ప్రజాపతేర్ యత్
సహజం పురస్తాత్, ఆయుష్యమగ్ర్యం ప్రతిముంచ శుభ్రం
యజ్ఞోపవీతం బలమస్తు తేజః. యజ్ఞోపవీతమసి యజ్ఞస్య
త్వా యజ్ఞోపవీతేనోపనహ్యామి.

ఈ మంత్రములతో వధూవరులకు యజ్ఞోపవీత ధారణముచేయించి తదుపరి యజ్ఞకార్యము నారంభింపవలయును.

యజ్ఞకుండమున కొన్ని సమిధలనుంచి ఈ క్రింది మంత్రములతో కర్పూరమును వెలిగించి కుండమున నుంచి అగ్నినాధానము చేయునది–

మంత్రములు :

ఓం భూర్భువః స్వః
ఓం భూర్భువః స్వర్ ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా,
తస్యాస్తే పృథివి దేవ యజని పృష్ఠే౽గ్ని మన్నాద
మన్నాద్యాయాదధే. యజు. 3-5

ఈ పై మంత్రములతో అగ్నిని యజ్ఞకుండమున నుంచి, దానిపై చిన్న చిన్న సమిధలను పెట్టి యీ క్రింది మంత్రముతో నగ్నిని ప్రజ్వాలింప జేయునది. అవశ్యకమగుచో కొంచెము నేతిని సమిధలపై వేయవలయును.

జ్వాలన మంత్రము :-

ఓ౩మ్ ఉద్‌బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహి త్వమిష్టాపూర్తే
సగ్‌ం సృజేథామయం చ, అస్మిన్‌త్సధస్థే అధ్యుత్తర స్మిన్
విశ్వే దేవా యజమానశ్చ సీదత. యజు. 15-54

తదుపరి ఎనిమిదంగుళముల పొడవుగల సమిధలు మూడు తీసికొని, వాని కొనలను నేతిలోముంచి పట్టుకొని యీ క్రింది మంత్రములు చదివి యొక్కొక్క సమిధను ఆహుతిగా యజ్ఞకుండమున నుంచవలయును.

సమిధలను వేయు మంత్రము :-

(1) ఓం అయంత ఇధ్మ ఆత్మా జాతవేద
స్తేనే ధ్యస్వ వర్ధస్వ చేద్ధవర్ధయ చాస్మాన్,
ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసే నాన్నా ద్యేన
సమేధయ స్వాహా ఇదమగ్నయే జాతవేదసే ఇదం నమమ

ఆశ్వ. గృ. 1-10-12

ఈ మంత్రము చదివి మొదటి సమిధను కుండమున నుంచవలయును.

(2) ఓం సమిధాగ్నిం దువస్యత ఘృతైర్ బోధ -
యతాతిథిమ్ ఆస్మిన్ హవ్యా జుహోతన

(3) ఓం సుసమిద్ధాయ శోచిషే ఘృతం తీవ్రం
జుహోతన అగ్నయే జాతవేదసే స్వాహా
ఇద మగ్నయే జాతవేదసే ఇదం న మమ

ఈపై రెండు మంత్రములతో రెండవ సమిధను కుండమున నుంచవలయును-

(4) ఓం తన్త్వా సమిద్భి రంగిరో ఘృతేన
వర్ధయామసి. బృహచ్ఛోచా యవిష్ఠ్య స్వాహా
ఇద మగ్నయే అంగిరసే ఇదం న మమ

(యజు. 3-1. 2.3)

ఈ పై మంత్రముతో మూడవ సమిధను యజ్ఞ కుండమున నుంచవలయును.

తరువాత నీ క్రింది మంత్రమును పఠించుచు నైదు ఘృతాహుతులను వధూవరులచే నిప్పింపవలయును. ఒకసారి మంత్రము చదివి యొక్క యాహుతి నిచ్చునది. ఐదు పర్యాయములు చదివి ఐదాహుతుల నిచ్చునది.

మంత్రము:-

ఓం అయన్త ఇధ్మ ఆత్మా జాతవేద స్తేనే ధ్యస్వ
వర్ధస్వ చేద్ధవర్ధయ చాస్మాన్, ప్రజయా పశుభిర్

బ్రహ్మ వర్చసే నాన్నాద్యేన సమేధయ స్వాహా.
ఇద మగ్నయే జాతవేసే ఇదం న మమ.

ఈపై మంత్రముతో నేతితో నైదు ఆహుతులిచ్చిన మీదట వరుడు కాని, పురోహితుడు కాని చేతితో జలము నింపుకొని యీ క్రింది మంత్రములతో యజ్ఞకుండమునకు చుట్టు నాలుగు దిశలందును జలమును చల్లవలయును.

(1) ఓం అదితేఽను మన్యస్వ.

ఈ మంత్రముతో కుండమునకు తూర్పున దక్షిణమునుండి ఉత్తరమునకు నీరు పోయవలయును.

(2) ఓం అనుమతేఽను మన్యస్వ.

దీనితో కుండమునకు పడమరవైపున దక్షిణమునుండి ఉత్తరమునకు నీరు పోయునది.

(3) ఓం సరస్వత్యను మన్యస్వ.

దీనితో కుండమునకు ఉత్తరదిశలో పడమరనుండి తూర్పునకు నీరుంచునది.

(4) ఓం దేవ సవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం
భగాయ, దివ్యో గంధర్వః కేతపూః కేతం నః
పునాతు, వాచస్పతిర్ వాచం నః స్వదతు. యజు. 30.1

ఈ మంత్రము చదువుచు కుండమున దక్షిణమున తూర్పునుండి పడమరకు నీరుపోయుచు కుండమునకు చుట్టును నీరు పోయవలయును.

ఇట్లు శుద్ధ జలమును కుడిచేతి యంజలితో కుండము చుట్టు నీరుపోసి, వధూవరులు ఈ క్రింది మంత్రములతో - ఆఘారావాజ్యాహుతులను రెంటిని నేతితో నీయవలయును.

(1) ఓం అగ్నయే స్వాహా. ఇదమగ్నయే ఇదం న మమ.

(2) ఓం సోమాయస్వాహా. ఇదంసోమాయ ఇదం న మమ.

ఇందు మొదటి యాహుతి కుండములోపల ఉత్తర దిశయందు పడమరనుండి పూర్వమునకు, రెండవది దక్షిణమున నట్లే నేతిని చమ్చాతో ధారగా వేయవలయును.

తదుపరి కుండమధ్యమున ప్రజ్వలించుచున్న అగ్నిలో ఆజ్యభాగాహుతులు రెండు ఈ క్రింది మంత్రములతో వేయవలయును.

(1) ఓం ప్రజాపతయే స్వాహా. ఇదం ప్రజాపతయే ఇదం న మమ

(2) ఓం ఇంద్రాయ స్వాహా. ఇదం ఇంద్రాయ ఇదం న మమ.
(యజు. 10-5,22-6,27,22-32,22-6,27)

తదుపరి ఈ క్రింది మంత్రములు చదువుచు నాలుగు వ్యాహృతి ఆహుతులు నేతిలో నీయదగును.

1 ఓం భూరగ్నయే స్వాహా. ఇద మగ్నయ ఇదం న మమ
2 ఓం భువర్వాయవే స్వాహా. ఇదం వాయవ ఇదం న మమ
3 ఓం స్వరాదిత్యాయ స్వాహా. ఇద మాదిత్యాయ ఇదం న మమ
4 ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా
ఇద మగ్నివాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ.

ఇట్లు నేతితో నాలుగాహుతులనిచ్చి యీ క్రింది మంత్రములను చదువుచు వొక్కొక్కదాని కొక్కొక్కయాహుతి చొప్పున ఎనిమిది ఆజ్యాహుతులు - నేతి యాహుతుల నొసంగునది. ఆ మంత్రములు -

(1) ఓం త్వం నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య
హేళో॒ వయాసిసీష్ఠాః, యజి ష్ఠో వహ్నితమః శోశు చానో
విశ్వా ద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా -
ఇద మగ్నీ వరుణాభ్యాం ఇదం న మమ

(2) ఓం సత్వం నో అగ్నే॒ వమో భవోతీ నేదిష్ఠో అస్యా
ఉషసో వ్యుష్టౌ, అవయక్ష్మ నో వరుణం రరాణో వీహి
మృళీకం సుహవో న ఏధి స్వాహా - ఇద మగ్నీ వరుణా భ్యాం
ఇదం న మమ (ఋ. 4-1-4,5)

(3) ఓం ఇమం మే వరుణ శ్రుధీ హవమద్యా చ మృళయ.
త్వామవస్యురాచకే స్వాహా.
ఇదం వరుణాయ ఇదం న మమ. ఋ. 1-25-19

(4) ఓం తత్వా యామి బ్రహ్మణా వందమాన స్తదా శాస్తే యజమానో హవిర్భిః, అహేళమానో వరుణేహ బోధ్యురుశంస మా న ఆయుః ప్రమోషీః స్వాహా - ఇదం వరుణాయ ఇదం న మమ. ఋ. 1-24, 11

(5) ఓం యే తే శతం వరుణ యే సహస్రం యజ్ఞియాః పాశా వితతా మహాన్తః తేభిర్ నో అద్య సవితోత విష్ణుర్ విశ్వే ముంచంతు మరుతః స్వర్కాః స్వాహా - ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో దేవేభ్యో మరుద్భ్యః స్వర్కేభ్యః ఇదం న మమ.

కాత్యాయన శ్రౌత 25-1-10

(6) ఓం అయాశ్చాగ్నేఽస్యనభిశ స్తిపాశ్చ సత్యమిత్త్వమ యాసి, అయా నో యజ్ఞం వహాస్యయా నో ధేహి భేషజగ్ం స్వాహా-ఇద మగ్నయే అయసే ఇదం న మమ

(కాత్యాయన శ్రౌత 25-1-11)

(7) ఓం ఉదుత్తమం వరుణ పాశమస్మ దవాధమం వి మధ్య మం శ్రథాయ, అథా వయమాదిత్య వ్రతే తవానాగ సో అదితయే స్యామ స్వాహా-ఇదం వరుణాయాదిత్యా యాదితయే చ ఇదం న మమ. ఋ 1-24-15

(8) ఓం భవతన్నః సమనసౌ సచేతసావరేపసౌ, మా యజ్ఞగ్ం, హిగ్ంసిష్టం మా యజ్ఞపతిం జాతవేదసౌ శివౌ భవతమద్య నః స్వాహా - ఇదం జాతవేదోభ్యాం ఇదం న మమ-యజు. (5-3)

ఈపై మంత్రములతో వధూవరులు నేతిని మాత్రమాహుతిగా నొసంగవలయును.

## ప్రధాన హోమము

ప్రధాన హోమము చేయునపుడు వధువు తన కుడిచేతిని వరుని కుడిభుజముపై మంచి స్పృశించగా నీ క్రింది పవమాన సూక్త మంత్రములతో ఘృతాహుతుల నీయవలయును.

(1) ఓం భూర్భువస్స్వః అగ్న ఆయూంషి పవస ఆసు వోర్జ మిషం చ నః, ఆ రే బాధస్వ దుచ్ఛునాం స్వాహా ఇదమగ్నయే పవమానాయ ఇదం న మమ

(2) ఓం భూర్భువః స్వః అగ్నిర్ ఋషిః పవమానః పాంచ జన్యః పురోహితః తమీమహే మహాగయం స్వాహా ఇదమగ్నయే పవమానాయ ఇదం న మమ

(3) ఓం భూర్భువస్స్వః, అగ్నే పవస్వ స్వపా అస్మే వర్చః సువీర్యమ్, దధద్రయిం మయి పోషం స్వాహా ఇద మగ్నయే పవమానాయ ఇదం న మమ
ఋ. మం. 9-66-19, 20, 21

(4) ఓం భూర్భువస్స్వః ప్రజాపతే న త్వ దేతా న్యన్యో విశ్వాజాతాని పరితా బభూవ, యత్కామాస్తే జాహుమ స్తన్నో అస్తు వయం స్యామ పతయో రయీణాం స్వాహా ఇదం ప్రజాపతయే ఇదం న మమ.
ఋ. మం. 10-121-10

(5) ఓం భూర్భువస్స్వః, త్వ మర్యమా భవసి యత్ కనీ నాం నామ స్వధావన్గుహ్యం బిభర్షి, అంజన్తిమిత్రం సుధితం న గోభిర్ యద్దంపతీ సమనసా కృణోషి స్వాహా ఇద మగ్నయే ఇదం న మమ. ఋ. 5-3-2.

### (రాష్ట్రభృద్ యజ్ఞము)

తదుపరి యీ క్రింది 12 మంత్రములను జదువుచు, వరుడు నేతిని వధువు హవన సామగ్రిని (శాకల్యము - ఓషధులతో సిద్ధము చేయబడి యుంచిన పొడి-) ఆహుతుల నియ్యవలయును.

(1) ఓం ఋతాషాడ్ ఋతధామాగ్నిర్ గంధర్వః
స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్,
ఇదం ఋతాసాహే ఋతధామ్నే అగ్నయే
గంధర్వాయ ఇదం న మమ

(2) ఓం ఋతాషాడ్ ఋతధామాగ్నిర్ గంధర్వ
స్తస్యౌషధయోఽప్సరసో ముదో నామ, తాభ్యః స్వాహా-
ఇద మోషధిభ్యోఽప్సరోభ్యో ముద్భ్యః
ఇదం న మమ

(3) ఓం సగ్ం హితో విశ్వసామా సూర్యో గంధర్వః
స న ఇదం బ్రహ్మక్షత్రం పాతుతస్మై స్వాహా వాట్,
ఇదం సగ్ం హితాయ విశ్వసామ్నే సూర్యాయ
గంధర్వాయ ఇదం న మమ

(4) ఓం సగ్ం హితో విశ్వసామా సూర్యో గంధర్వః
తస్య మరీచయోఽప్సరస ఆయువో నామ, తాభ్యః
స్వాహా - ఇదం మరీచిభ్యోఽప్సరోభ్య ఆయుభ్యః ఇదం న మమ.

(5) ఓం సుషుమ్ణః సూర్యరశ్మిశ్చంద్రమా గంధర్వః, స న
ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్,
ఇదం సుషుమ్ణాయ, సూర్యరశ్మయే, చంద్రమసే,
గంధర్వాయ ఇదం న మమ.

(6) ఓం సుషుమ్ణః సూర్యరశ్మిశ్చంద్రమా గంధర్వః తస్య
నక్షత్రాణ్యప్సరసో భేకురయో నామ తాభ్యః స్వాహా-
ఇదం నక్షత్రేభ్యోఽప్సరోభ్యో భేకురిభ్యః ఇదం న మమ.

(7) ఓం ఇషిరో విశ్వవ్యచా వాతో గంధర్వః స న ఇదం
బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్, ఇద మిషి
రాయ విశ్వవ్యచసే వాతాయ గంధర్వాయ ఇదం న మమ.

(8) ఓం ఇషిరో విశ్వవ్యచా వాతో గంధర్వః తస్యాపో అప్సరస ఊర్జో నామ, తాభ్యః స్వాహా - ఇద మద్ భ్యో ప్సరోభ్య ఊర్గ్భ్యః ఇదం న మమ.

(9) ఓం భుజ్యుః సుపర్ణో యజ్ఞో గంధర్వః, స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్- ఇదం భుజ్యవే సువర్ణాయ గంధర్వాయ ఇదం న మమ.

(10) ఓం భుజ్యుః సువర్ణో యజ్ఞో గంధర్వస్తస్య దక్షిణా అప్సరసస్తావా నామ, తాభ్యః స్వాహా-ఇదం దక్షిణా భ్యో ప్సరోభ్యః స్తావాభ్యః ఇదం న మమ.

(11) ఓం ప్రజాపతిర్ విశ్వకర్మా మనో గంధర్వః, స న ఇదం బ్రహ్మ క్షత్రం పాతు తస్మై స్వాహా వాట్, ఇదం ప్రజాపతయే, విశ్వకర్మణే, మనసే, గంధర్వాయ ఇదం న మమ.

(12) ఓం ప్రజాపతిర్ విశ్వకర్మా మనో గంధర్వస్తస్య ఋక్సామాన్యప్సరస ఏష్టయో నామ, తాభ్యః స్వాహా- ఇదమ్ ఋక్సామేభ్యోऽప్సరోభ్య ఏష్టిభ్యః ఇదం న మమ. యజు. 18-38 నుండి 43.

ఈపై పంద్రెండు మంత్రములతో పంద్రెండు ఆహుతులు నేతితోను శాకల్యముతోను ఇయ్యవలయును.

తరువాత నీక్రింది మంత్రములతో జయాహోమము చేయవలయును.

(1) ఓం చిత్తం చ స్వాహా -ఇదం చిత్తాయ ఇదం న మమ
(2) ఓం చిత్తిశ్చ స్వాహా -ఇదం చిత్త్యై ఇదం న మమ
(3) ఓం ఆకూతం చ స్వాహా -ఇదమాకూతాయ ఇదం న మమ
(4) ఓం ఆకూతిశ్చ స్వాహా -ఇదమాకూత్యై ఇదం న మమ
(5) ఓం విజ్ఞాతం చ స్వాహా -ఇదం విజ్ఞాతాయ ఇదం న మమ
(6) ఓం విజ్ఞాతిశ్చ స్వాహా -ఇదం విజ్ఞాత్యై ఇదం న మమ

(7) ఓం మనశ్చ స్వాహా -ఇదం మనసే ఇదం న మమ
(8) ఓం శక్వరీశ్చ స్వాహా -ఇదం శక్వరీభ్యః ఇదం న మమ
(9) ఓం దర్శశ్చ స్వాహా -ఇదం దర్శాయ ఇదం న మమ
(10) ఓం పౌర్ణమాసం చ స్వాహా-ఇదం పౌర్ణమాసాయ ఇదం న మమ
(11) ఓం బృహచ్చ స్వాహా -ఇదం బృహతే ఇదం న మమ
(12) ఓం రథంతరం చ స్వాహా -ఇదం రథంతరాయ ఇదం న మమ

(13) ఓం ప్రజాపతిర్జయా నింద్రాయ వృష్ణే ప్రాయచ్ఛ దుగ్రః
ప్రతనా జయేషు, తస్మై విశః సమనమన్త
సర్వాః స ఉగ్రః స ఇహవ్యో బభూవ స్వాహా-ఇదం
ప్రజాపతయే జయానింద్రాయ ఇదం న మమ.

ఇట్లు పై మంత్రములతో 13 ఆహుతులనిచ్చి యటుపై 'అభ్యాతనహోమము' చేయునది.

(1) ఓం అగ్నిర్ భూతానామధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే஽స్యా మాశిష్యస్యాం పురోధా
యామస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా-
ఇద మగ్నయే భూతానామధిపతయ ఇద న్న మమ.

(2) ఓం ఇంద్రో జ్యేష్ఠానామధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే஽స్యామాశిష్యస్యాంపురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా - ఇద
మింద్రాయ జ్యేష్ఠానా మధిపతయ ఇదం న మమ.

(3) ఓం యమః పృథివ్యా஽అధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే஽స్యా మాశిష్యస్యాం పురో
ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం
స్వాహా - ఇదం యమాయ పృథివ్యా అధిపతయ ఇదం న మమ.

(4) ఓం వాయురంతరిక్షస్యాధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే஽స్యామాశిష్యస్యాం పురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా -
ఇదం వాయవే అన్తరిక్షస్యాధిపతయ ఇదం న మమ.

(5) ఓం సూర్యో దివోऽధిపతిః స మావత్వస్మిన్ బ్రహ్మ ణ్యస్మిన్ క్షత్రేऽస్యామాశిష్యస్యాం పురోధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా - ఇదం సూర్యాయ దివోऽధిపతయ ఇదం న మమ.

(6) ఓం చంద్రమా నక్షత్రాణామధిపతిః స మావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేऽస్యామాశిష్యస్యాం పురో ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా - ఇదం చంద్రమసే నక్షత్రాణామధిపతయ ఇదన్న మమ

(7) ఓం బృహస్పతిర్ బ్రహ్మణోऽధిపతిః స మావత్వ స్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేऽస్యామాశిష్యస్యాం పురో ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా ఇదం బృహస్పతయే బ్రహ్మణోऽధిపతయే ఇదం న మమ.

(8) ఓం మిత్రః సత్యానా మధిపతిః సమావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేऽస్యామాశిష్యస్యాం పురో ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా - ఇదం మిత్రాయ సత్యానామధిపతయ ఇదం న మమ.

(9) ఓం వరుణోऽపామధిపతిః స మావత్వస్మిన్ బ్రహ్మ ణ్యస్మిన్ క్షత్రేऽస్యామాశిష్యస్యాం పురోధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా - ఇదం వరుణాయాపామధిపతయ ఇదం న మమ.

(10) ఓం సముద్రః స్రోత్యానామధిపతిః స మావత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేऽస్యామాశిష్యస్యాం పురో ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా - ఇదం సముద్రాయ స్రోత్యానా మధిపతయ ఇదం న మమ.

(11) ఓం అన్నగ్ం సామ్రాజ్యానామధిపతిః సమావత్వ స్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రేऽస్యామాశిష్యస్యాం పురో ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా - ఇద మన్నాయ సామ్రాజ్యానామధిపతయ ఇదన్న మమ.

(12) ఓం సోమ ఓషధీనామధిపతిః స మావత్వస్మిన్ బ్రహ్మ
ణ్యస్మిన్ క్షత్రే ऽస్యామాశిష్యస్యాం పురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా-ఇదం
సోమాయ ఓషధీనామధిపతయ ఇదం న మమ

(13) ఓం సవితా ప్రసవానామధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే ऽస్యామాశిష్యస్యాం పురో
ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా-
ఇదం సవిత్రే ప్రసవానామధిపతయ ఇదం న మమ

(14) ఓం రుద్రః పశూనామధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే ऽస్యామాశిష్యస్యాం పురో
ధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం
స్వాహా ఇదం రుద్రాయ పశూనామధిపతయ ఇదం న మమ.

(15) ఓం త్వష్టా రూపాణామధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే ऽస్యామాశిష్యస్యాం పురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా-ఇదం
త్వష్ట్రే రూపాణా మధిపతయ ఇదం న మమ

(16) ఓం విష్ణుః పర్వతానా మధిపతిః స మావత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే ऽస్యామాశిష్యస్యాం పురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా-ఇదం
విష్ణవే పర్వతానామధిపతయ ఇదం న మమ

(17) ఓం మరుతో గణానామధిపతయ స్తే మావంత్వస్మిన్
బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే ऽస్యామాశిష్యస్యాం పురోధాయా
మస్మిన్ కర్మణ్యస్యాం దేవహూత్యాగ్ం స్వాహా-ఇదం
మరుద్భ్యో గణానామధిపతిభ్యః ఇదం న మమ

(18) ఓం పితరః పితామహాః పరే ऽవరే తతాస్తతా మహా
ఇహ మావంత్వస్మిన్ బ్రహ్మణ్యస్మిన్ క్షత్రే ऽస్యామా

శిష్యస్యాం పురోధాయా మస్మిన్ కర్మణ్యస్యాం దేవ
హూత్యాగ్ం స్వాహా-ఇదం పితృభ్యః పితామహేభ్యః
పరేభ్యోఽవరేభ్య స్తతేభ్య స్తతామహేభ్యశ్చ ఇదం న మమ
పా. గృ.1-5-10

ఇట్లు పదునెనిమిది ఆహుతులతో అభ్యాతన హోమముచేసి తదుపరి ఈ క్రింది మంత్రములను చదువుచు నెనిమిది ఆజ్యాహుతుల నిచ్చునది.

(1) ఓం అగ్నిరైతు ప్రథమో దేవతానాగ్ం సోఽస్యై ప్రజాం ముంచతు మృత్యుపాశాత్, తదయగ్ం రాజా వరుణోఽనుమన్యతాం యథేయగ్ం స్త్రీపౌత్ర మఘన్న రోదాత్ స్వాహా-ఇద మగ్నయే ఇదం న మమ.

(2) ఓం ఇమా మగ్నిస్త్రాయతాం గార్హపత్యః ప్రజామస్యై నయతు దీర్ఘ మాయుః, అశూన్యోపస్థా జీవతామస్తు మాతా పౌత్రమానంద మభివిబుధ్యతా మియగ్ం స్వాహా-ఇద మగ్నయే ఇదం న మమ.

(3) ఓం స్వస్తినోఽగ్నే దివా పృథివ్యా విశ్వాని ధేహ్యా యథా యజత్ర, యదస్యాం మయి దివి జాతం ప్రశస్తం తదస్మాసు ద్రవిణం ధేహి చిత్రగ్ం స్వాహా-ఇద మగ్నయ ఇదం న మమ.

(4) ఓం సుగన్ను పంథాం ప్రదిశన్న ఏహి జ్యోతిష్మధ్యే హ్యజరన్న ఆయుః, అపైతు మృత్యు రమృతం మ ఆగాద్ వైవస్వతో నోఽభయం కృణోతు స్వాహా - ఇదం వై వస్వతాయ ఇదం న మమ.

(5) ఓం పరం మృత్యోఽను పరేహి పన్థాం యత్రనో అన్య ఇతరో దేవయానాత్, చక్షుష్మతే శృణ్వతే తే బ్రవీమి మా నః ప్రజాగ్ం రీరిషో మోత వీరాన్ త్స్వాహా-ఇదం మృత్యవే ఇద న్న మమ.

పా. గృ. 1-5-11, 12

(6) ఓం ద్యౌస్తే పృష్ఠగ్ం రక్షతు వాయురూరూ అశ్వినౌ
చ, స్తనంధయస్తే పుత్రాన్ త్సవితాభిరక్షత్వా
వాసనః పరిధాద్ బృహస్పతి ర్విశ్వేదేవా అభిరక్షన్తు
పశ్చాత్ స్వాహా - ఇదం విశ్వేభ్యో దేవేభ్యః ఇదం న మమ.

(7) ఓం మా తే గృహేషు నిశి ఘోష ఉత్థాదన్యత్ర
త్వద్రుదత్యః సంవిశంతు మా త్వగ్ం దదత్యుర ఆవ
ధిష్ఠా జీవపత్నీ పతిలోకే విరాజ పశ్యన్తీ ప్రజాగ్ం
సుమనస్యమానాగ్ం స్వాహా - ఇద మగ్నయ ఇదం న మమ.

(8) ఓం అప్రజస్యం పౌత్రమర్త్య పాప్మానముత వా
అఘమ్, శీర్షస్రజ మివోన్ముచ్య దిషద్భ్యః ప్రతి
ముంచామి పాశగ్ం స్వాహా-ఇద మగ్నయ ఇదం న మమ.
మం. బ్రా. 1-1-12, 13, 14

తదుపరి క్రింది 4 మంత్రములతో నాహుతు లిచ్చునది.

(1) ఓం భూరగ్నయే స్వాహా, ఇదమగ్నయ ఇదం న మమ

(2) ఓం భువర్వాయవే స్వాహా, ఇదం వాయవ ఇదన్న మమ.

(3) ఓం స్వరాదిత్యాయ స్వాహా-ఇదమాదిత్యాయ ఇదన్న మమ

(4) ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాది త్యేభ్యః స్వాహా-
ఇదమగ్ని వాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ.

## ప్రతిజ్ఞావిధి-పాణి గ్రహణవిధి

పైన జూపిన విధమున హోమకార్యమునుజేసిన మీదట, వరుడు నిలబడి వధువున కెదురుగా పశ్చిమాభి ముఖుడై వధువు యొక్క కుడిచేతిని తన యెడమ చేతితోనెత్తి తన కుడి చేతియందు అఱచేయి పైకి ఉండునట్లుపెట్టి, యంగుష్ఠ సహితముగ బట్టుకొని యీ క్రింది మంత్రములతో ప్రతిజ్ఞ చేయునది.

(1) ఓం గృహ్ణామి తే సౌభగత్వాయ హస్తం మయా
పత్యా జరదష్టిర్ యథాసః, భగో అర్యమా సవితా
పురంధిర్ మహ్యం త్వాదుర్ గార్హపత్యాయ దేవాః

ఋ. 10-85-36

ఓ సుందరీ! ఐశ్వర్యాదుల నాసించి నీ హస్తమును చేపట్టుచున్నాను. ఇద్దరము నాతో వృద్ధాప్యము వఱకు సుఖముగా నుండుము. పరమేశ్వరుడు, సత్పురుషులైన యీ పెద్దలు గృహధర్మములను నిర్వర్తించుటకు నిన్ను నాకొసంగిరి. నేటినుండి మనమిరువురము మొకరికొకరము విధేయులమై యుందము.

(2) ఓం భగస్తే హస్తమగ్రభీత్ సవితా హస్తమగ్రభీత్,
పత్నీ త్వమసి ధర్మణాహం గృహపతిస్తవ.

అథర్వ. 14-1-51

ఓ ప్రియా! ఐశ్వర్యవంతుడను బలవంతుడనునగు నేను నీహస్తమును గ్రహించుచున్నాను. ధర్మము ననుసరించి మనమిరువురము పత్నీపతులమగుచున్నాము.

(3) ఓం మమేయమస్తు పోష్యా మహ్యం త్వాదాద్
బృహస్పతిః, మయా పత్యా ప్రజావతి శం జీవశరదః

శతమ్.అథర్వ. 14-1-52

ఓ ప్రజావతీ ! పరమాత్మ నిన్ను నాకొసంగెను. అట్టి నిన్ను నేను సదా పోషింతును. పతినగు నాతో నూఱు సంవత్సరములు సుఖముగ జీవింపుము.

(4) ఓం త్వష్టా వాసో వ్యదధాచ్ఛుభే కం బృహస్ప తేః
ప్రశిషా కవీనామ్, తేనేమాం నారీం సవితా భగశ్చ
సూర్యామివ పరిధత్తాం ప్రజయా. (అథర్వ. 14-1-53)

ఓ సుముఖీ! పరమేశ్వరునియు, విద్వాంసులయు శిక్షణ వలన స్త్రీ పురుషులు దంపతులగుదురు. నా కొఱకు నీవు సుందర వస్త్రాభరణాదులను ధరించి విద్యుల్లతవలె ప్రకాశించుచు నా వలన సుఖములనుబడయుము. ఈశ్వరుడు సంతానముతో సుశోభితను జేయునట్లు నేను వస్త్రాభరణాదులతో శోభిల్లజేయుదును.

(5) ఓం ఇంద్రాగ్నీ ద్యావాపృథివీ మాతరిశ్వా మిత్రా
వరుణా భగో అశ్వినోభా; బృహస్పతిర్ మరుతో
బ్రహ్మ సోమ ఇమాం నారీం ప్రజయా వర్ధయంతు.

(అథర్వ. 14-1-54)

బంధువులార! ఇంద్రాగ్నులు, ద్యుపృథివీ లోకములు, వాయువు, ప్రాణోదానములు, ఐశ్వర్యము, అశ్వినీ దేవతలు (వైద్యుడు, ఉపదేశకుడు) న్యాయాధిపతి, సభ్యమానవులు, పరమేశ్వరుడు నెల్లరి వృద్ధికి తోడ్పడునట్లు ఈ నారీమణిని గూడ (సంతానాదులతో) వర్ధిల్ల జేయుదురు గాక! మీరు నీమె యభివృద్ధికి దోడ్పడుదురుగాక! నేను శక్తికొలది యీమె యభివృద్ధికి పాటుపడుదును.

(6) ఓం అహం విష్యామి మయి రూపమస్యా వేదదిత్
పశ్యన్ మనసః కులాయమ్, నస్తేయమద్మి మనసో
దముచ్యే స్వయం శ్రథ్నానో వరుణస్య పాశాన్.

(అథర్వ. 14-1-57)

ఓ కల్యాణీ! మనస్సుతో కులవృద్ధిని జూచుచు నేను నీ యీ రూపమును ప్రేమతోపొంది సుఖించునట్లు నీవును నాయందు ప్రేమతో వర్తింపుము. మనస్సుతో గూడ నీయెడ చౌర్యమా చరింపను. నీకు తెలియకుండ నేయుత్తమ పదార్థమును సేవింపను. నేను స్వయముగ నెంత పురుషార్థ విహీనుడనైనను శ్రేష్ఠ వ్యవహారములకు విఘ్నకారకములగు దుర్వ్యసనములను దరిజేరనీయను. అట్లే నీవును జేయుదువు గాక!

ఇట్లు వరుడు ప్రతిజ్ఞ నొనర్చిన పిమ్మట వధువుకూడ లేచి ప్రతిజ్ఞలను జేయును.

వధువు:- ఆర్యపుత్ర! నేను నీ సభ్యుల యెదుట ఐశ్వర్యప్రాప్తికొఱకు నీహస్తమును గ్రహించి గృహస్థాశ్రమమున బ్రవేశించుచున్నాను. నేటినుండి మనము పత్నీ పతులము. గృహధర్మములను ప్రేమతో నిర్వర్తింతుము గాక! ఈ పెద్దలు మనకు దోడ్పడుదురు గాక! నూఱు సంవత్సరములు సుఖముగా జీవింతుము గాక! నేటినుండియు నీకు నేను, నాకు నీవును వశులమై యుందము.

ఐశ్వర్యశాలివి. శక్తి గలదానవై నేను నిన్ను చేపట్టుచున్నాను. [illegible] సారము మనము పత్నీపతులము. నూఱు సంవత్సరములు నీవు నాతో సుఖముగా మందువు గాక!

పరమేశ్వరుని కృపవలన నీవు నాకు లభించితివి. నేను నిన్ను పోషించెదను. కష్టసుఖముల ననుభవింతుము. నూరేండ్లు నాతో సుఖముగా జీవింపుము.

నేను నిన్నే సదా ప్రేమింతును. కులాభివృద్ధి నభిలషింతును. నీకు తెలియకుండ నేదియు జేయను. నిన్ను వీడి భుజింపను. పరమేశ్వరుడు మనిద్దఱకు సుఖముల నందజేయును గాక!

ఇద్దరువురు ప్రతిజ్ఞలు చేసిన పిమ్మట వరుడు వధువు పాణిని పట్టుకొని యీ క్రింది మంత్రము నుచ్చరించుచు యజ్ఞకుండమును జుట్టి ప్రదక్షిణము చేయవలయును. కలశధారియు కలశముతో వారివెంట ప్రదక్షిణముచేసి స్వస్థలముల కూర్చుండునది.

ఓం అమోఽహమస్మి సాత్వగ్ం సాత్వమస్యమోఽహమ్. సామాహమస్మి ఋక్త్వమ్ద్యౌరహం పృథివీ త్వం తావేవ వివహావహై సహరేతో దధావహై. ప్రజాం ప్రజనయావహై పుత్రాన్ విందావహై బహూన్, తే సంతు జరదష్టయః సంప్రియౌ రోచిష్ణూ సుమనస్యమానౌ, పశ్యేమ శరదః శతమ్ జీవేమ శరదః శతగ్ం శృణుయామ శరదః శతమ్, పా.గృ. 1-6-3.

అని ప్రదక్షిణము చేయునది.

## శిలారోహణవిధి

తరువాత వరుడు వధువునకు వెనుకవైపుగా నామె కుడి ప్రక్కకు వచ్చి ఉత్తరాభిముఖుడై నిలబడి వధువు యొక్క కుడి హస్తాంజలిని తన కుడి హస్తాంజలిలో నుంచి పట్టుకొన వలయును. పెండ్లికూతురు తల్లి కాని, సోదరుడు కాని పేలాలున్న చేటను ఎడమచేతితో పట్టుకొని కుడి చేతితో పెండ్లి కూతురు కుడి పాదమును పట్టుకొనియెత్తి ఆమె ముందుంచిన ఱాతిమీదకాని, సానమీదకాని ఉంచవలయును. అప్పుడు వరుడీ క్రింది మంత్రము చదివి యుపదేశింప వలయును

ఓం ఆరోహేమ మశ్మాన మశ్మేవ త్వగ్ం స్థిరాభవ, అభి
తిష్ఠ పృతన్యతోఽ వబాధస్వ పృతనాయుతః

(పా.గృహ్య. 1-7-1)

ఓ వధూ! నీవీశిలపై పాదమునుంచి గృహస్థాశ్రమమున శిలవలె స్థిరముగా నుండుము. నీకు అపకారము చేయదలచు దుష్టులను దుష్టభావముల నెదుర్కొని, గుండెను గట్టిచేసికొని విజయము పొందుము.

## లాజాహోమము

తదుపరి వరుడు వధువునకు వెనుకగా మరల తన స్థానమునకు వచ్చి యజ్ఞకుండమునకు సమీపమున నిలుచుండును. వధువు అతనికి కుడివైపున నతనికి దగ్గఱగా నిలుచుండును. వధువు తన దోసిలిని వరుని దోసిలిపై నుంచును. అప్పుడు వధువు సోదరుడు కాని తల్లికాని తాను ఎడమ చేతితో బట్టుకొనియున్న చేటనుండి పేలాలను కుడిచేతి గుప్పిటితో తీసి వధువు దోసిలియందుంచవలయును. పేలాలు పోయుటకు ముందు వధువు దోసిట కొంచెము నేతిని చిలకరించి, పేలాలుపోసిన తదుపరి వానిపైనను నేతిని కొంచెము చిలకరింప వలయును. అప్పుడు వధువు తన దోసిలిని వరుని దోసిలితోబాటు ముందుకువంచి క్రింది మంత్రముల నుచ్చరించి యాహుతుల నీయవలయును.

(1) ఓం అర్యమణం దేవం కన్యా అగ్నిమయక్షత, స నో
అర్యమా దేవః ప్రేతో ముంచతు మా పతేః స్వాహా -
ఇదమర్యమ్ణే అగ్నయ ఇదం న మమ.

పా. గృ 1-6-2.

కన్యలచే పూజింపబడిన న్యాయకారి యగు దేవుడు నన్ను పితృగృహమునుండి వేఱుచేసి పతిగృహమునుండి వేఱు చేయకుండును గాక!

(2) ఓ౩మ్ ఇయం నార్యుపబ్రూతే లాజా నావపంతికా
ఆయుష్మానస్తు మే పతి రేధన్తాం జ్ఞాతయో మమ
స్వాహా-ఇద మగ్నయ ఇదం న మమ.

పా. గృ 1-6-2.

పేలాలను హోమముచేయు నేను భగవంతుని ప్రార్థించుచున్నాను. నా పతి చిరంజీవియగు గాక! నా జ్ఞాతులు వర్ధిల్లుదురు గాక!

(1) ఓం ఇమాన్ లాజా నావపామ్యగ్నౌ సమృద్ధికరణం
తవ, మమ తుభ్యం చ సంవననం తదగ్ని రనుమన్యతా
మియగ్ం స్వాహా-ఇద మగ్నయె ఇదం న మమ.

ఈ పేలాలను అగ్నిలో వ్రేల్చుచున్నాను. నీకు నాకును వృద్ధికలుగుగాక! పరమేశ్వరుడు మన యిరువురిలో ప్రేమను వర్ధిల్ల జేయును గాక!

ఈ పై మంత్రములలో నొక్కొక్కదానితో నొక్కొక్క యాహుతి చొప్పున మూడాహుతులను (పేలాలు) మండుచున్న అగ్నిలో వియ్యవలెను.

తదుపరి వరుడు ఈ క్రింది మంత్రమును పఠించుచు-

ఓం సరస్వతి ప్రేదమవ సుభగే! వాజినీవతి: యాం
త్వా విశ్వస్య భూతస్య ప్రజాయా మస్యాగ్రతః,
యస్యాం భూతగ్ం సమభవత్ యస్యాం విశ్వమిదం
జగత్, తామద్య గాథాం గాస్యామి యా స్త్రీణా
ముత్తమం యశః. పా. గృ. 1-7-2.

వధువు కుడి హస్తమును తన కుడిచేతితో పట్టుకొని, ఈ క్రింది మంత్రములను చదువుచు యజ్ఞకుండమునకు నాలుగు పర్యాయములు ప్రదక్షిణములను జేయును.

(1) ఓం తుభ్యమగ్రే పర్యవహన్ త్సూర్యాం వహ
తునా సహ, పునః పతిభ్యో జాయాం దా అగ్నే
ప్రజయా సహ. ఋ. 10-85-38. పా.గృ. 1-7-3.

(2) ఓం కన్యలా పితృభ్యః పతిలోకం, పతీయమవ దీక్షా
మయుక్ష్ట కన్యా ఉత త్వయా వయం ధారా ఉదన్యా
ఇవాతిగా హేమహి ద్విషః. మం. బ్రా. 1-2-55.

వధూవరులు ప్రదక్షిణము చేయునపుడు కలశ ధారియు వారి వెంట కలశములతో దిరుగవలయును. అటుపై వధూవరులు కుండమునకు పశ్చిమ భాగమున పూర్వాభి ముఖులై నిలబడుదురు. మరల వారి దోసిలి యందు సోదరుడు కాని తల్లికాని పేలాలను నింపును. అంతట వధువు -

ఓం భగాయ స్వాహా-ఇదం భగాయ ఇదం న మమ

అని చెప్పి యాహుతి నిచ్చును.

తదుపరి-వరుడు-

ఓం ప్రజాపతయే స్వాహా-ఇదం ప్రజాపతయ ఇదం న మమ.

అని నేతితో నొక యాహుతి నిచ్చును.

## కేశ విమోచనము

తరువాత వధూవరులు ఏకాంత ప్రదేశమునకుబోయి యట వరుడు ఈ క్రింది మంత్రములను జదివి వధువు కేశపాశమును విడిపింపవలయును.

(1) ఓం ప్రత్వా ముంచామి వరుణస్య పాశాద్ యేన త్వా
బధ్నాత్ సవితా సుశేవః, ఋతస్య యోనౌ సుకృ
తస్య లోకేఽరిష్టాం త్వా సహ పత్యా దధామి.

(2) ఓం. ప్రేతో ముంచామి నాముతః సుబద్ధామము తస్క
రమ్, యథేయమింద్రమీఢ్వః సుపుత్రా సుభగాసతి.

ఋ. 10-85-24, 25.

(వివాహ సమయమున మధ్యలో వధూవరు లేకాంతమునజేరి ఈ క్రియను జరుపుట అంతసుకరముకాదు. కావున మండపమునందే వరుడు వధువు కేశములను స్పృశించి మంత్ర పఠనము చేసిన యుక్తముగా నుండును.)

## సప్తపది

వధూవరుల నిరువురను యజ్ఞకుండమునకు పశ్చిమ దిశయందు ఉత్తరాభి ముఖులనుజేసి నిలబెట్టవలయును. వధువు వరునకు కుడివైపున నిలబడును. తదుపరి పురోహితుడు వారి యుపవస్త్రములను ముడివేయును. వరుడు తన

కుడిచేతిని వధువు కుడిభుజముపై నుంచును. ఇరువురు నొకరికొకరు సమీపమున నిలబడుదురు. అప్పుడు వరుడు-

మా సవ్యేన దక్షిణ మతిక్రామ. గోభిల గృ. 2-2-12

ఎడమ పాదము కుడిపాదముకంటె ముందుకు పోనీయకు, అని వధువుతోననును. అటుపై వరుడీ క్రింది మంత్రములను చెప్పుచు వధువుతో బాటు సమముగా ముందున కొక్కొక్క యడుగువేయును.

(1) ఓం ఇష ఏకపదీ భవ సా మామనువ్రతా భవ
విష్ణుస్త్వా నయతు పుత్రాన్ విందావహై బహూం
స్తే సంతు జరదష్టయః. ఆ.గృ. 1-7-19.
పా. గృ. 1-8-1, 2 (అన్నసంపాదనముకొఱకు)

ఈ మంత్రమును జదివి వరుడు వధువుతోబాటు కొంచెము ఈశాన్య దిశవైపు ప్రథమ పాదమునుంచును. ఇట్లే యితర మిగిలిన ఆఱు అడుగులు ఆఱు మంత్రములను జెప్పుచు వేయవలయును. (అడుగువేయు విధము ముందుకు కుడిపాదమును కొంచెము ముందుకు జరిపి యుంచవలయును. కాని ఎడమ పాదము కుడి పాదమునుమించి ముందుకు పోనీయరాదు.)

(2) ఓమ్ ఊర్జే ద్విపదీ భవ సా మామనువ్రతా భవ
విష్ణుస్త్వా నయతు పుత్రాన్ విందావహై బహూం స్తే
సంతు జరదష్టయః (బలసంపాదనముకొఱకు)

రెండవ యడుగు.

(3) ఓం రాయస్పోషాయ త్రిపదీ భవ సా మామనువ్రతా
భవ, విష్ణుస్త్వా నయతు పుత్రాన్ విందావహైబహూం
స్తే సంతు జరదష్టయః (ధనసంపాదనముకొఱకు)

మూడవ యడుగు.

(4) ఓం మయోభవాయ చతుష్పదీ భవ సా మామనువ్రతా
భవ, విష్ణుస్త్వా నయతు పుత్రాన్ విందావహై బహూం
స్తే సంతు జరదష్టయః (సుఖసంపాదనముకొఱకు)

నాల్గవ యడుగు.

(5) ఓం ప్రజాభ్యః పంచపదీ భవ సా మామనువ్రతా
భవ, విష్ణుస్త్వా నయతు పుత్రాన్ విందావహై బహూం
స్తే సంతు జరదష్టయః (సంతానముకొఱకు)

ఐదవ యడుగు.

(6) ఓం ఋతుభ్యః షట్పదీ భవ సా మామనువ్రతా భవ
విష్ణుస్త్వా నయతు పుత్రాన్ విందావహై బహూం
స్తే సంతు జరదష్టయః (ఋతువులయనుకూలతకు)

ఆఱవ యడుగు.

(7) ఓం సఖే సప్తపదీ భవ సా మామనువ్రతా భవ
విష్ణుస్త్వా నయతు పుత్రాన్ విందావహై బహూం
స్తే సంతు జరదష్టయః (మైత్రి కొఱకు)

ఏడవ యడుగు నుంచవలయును.

ఇట్లు గ్రంధిబంధనముతోబాటు ఏడడుగులునడచి తదుపరి కుండమును చుట్టివచ్చి కుండమునకు పశ్చిమ భాగమున పూర్వాభిముఖులై వధూవరులు కూర్చుందురు.

## జలముతో మార్జనము

పూర్వమే స్థాపించియున్న జలకలశమునుండి కొంచెము నీరు తీసికొని వధూవరుల మస్తకములపై జల్లుచు పురోహితుడు ఈ క్రింది మంత్రములను పఠింపవలయును.

(1) ఓం ఆపో హి ష్ఠా మయోభువః తాన ఊర్జే దధాతన
మహేరణాయ చక్షసే.

(2) ఓం యో వః శివతమో రసస్తస్య భాజయతేహ నః
ఉశతీరివ మాతరః.

(3) ఓం తస్మా అరంగమామ వో యస్య క్షయాయ జిన్వథ
ఆపో జనయథా చ వః. యజు..36,14-15,16

(4) ఓం ఆపః శివాః శివతమాః శాంతాః శాంతతమా
స్తాస్తే కృణ్వన్తు భేషజమ్, పా.గృ. 1-8-5

## సూర్యదర్శనము

తరువాత వధూవరులు మండపము నుండి లేచి బయటకు వెళ్ళి ఈ క్రింది మంత్రమును జదివి సూర్యుని జూడవలయును.

ఓం తచ్చక్షుర్ దేవహితం పురస్తాచ్ఛుక్ర ముచ్చరత్
పశ్యేమ శరదఃశతం జీవేమ శరదః శతగ్ం శృణుమామ
శరదః శతం ప్రబ్రవామ శరదః శతం అదీనాః స్యామ
శరదః శతం, భూయశ్చ శరదః శతాత్. యజు. 36-24

## హృదయాలంబనము

సూర్యుని దర్శించి వచ్చి వధూవరులు యజ్ఞకుండమునకు పశ్చిమ భాగమున పూర్వాభిముఖులై కూర్చుండవలయును. వధువు వరుని కుడివైపున కూర్చుండును. అంతట వరుడు తన కుడిచేతిని వధువు కుడిభుజము మీదుగానుంచి వధువు హృదయమును స్పృశించును. ఆసమయమున నిరువురు నీ క్రింది మంత్రమును పఠింతురు.

ఓ3మ్ మమ వ్రతే తే హృదయం దధామి మమ చిత్త
మనుచిత్తం తే అస్తు. మమ వాచ మేకమనా జుషస్వ
ప్రజాపతి ష్ట్వా నియునక్తు మహ్యామ్. పా.గృ. 1-8-8

నేను నామనస్సును ఆత్మను నీవుచేయు కర్మలకనుకూలముగా నుంచెదను. నా చిత్తమున కనుకూలముగ నీచిత్తముండును గాక! నాపలుకు నేకాగ్రచిత్తముతో వినుదువుగాక. పరమేశ్వరుడు నిన్ను, నా కొఱకు నియోగించును గాక!

# సుమంగళాశంసనము

తదుపరి దక్షిణ భారతదేశపుటాచారము ననుసరించి వధువు మెడలో వరుడు మంగళసూత్రమును ఈ క్రింది శ్లోకము చదివి ధరింపజేయును.

మాంగల్యం తంతునానేన మమ జీవనహేతునా,
కంఠే బధ్నామి సుభగే త్వం జీవ శరదాం శతమ్.

(ఈ సూత్రధారణమునకు ముందు జీలకఱ్ఱ బెల్లము కలిపి వధూవరుల శిరస్సులపై నతికింప జేయుటయు నీదేశపుటాచారము. ఇదియంతయు నిష్టమున్నవారు చేసికొనవచ్చును. వైదికము కానందున చేయకున్నను ప్రమాదములేదు.)

తదుపరి వరుడు లేచి నిలబడి వధువు మస్తకముపై తనకుడి యఱచేతినుంచి, ఈ క్రింది మంత్రమును ఉచ్చరించి సభ్యుల నవలోకించి కూర్చుండవలయును.

ఓమ్ సుమంగలీ రియం వధూః ఇమాం సమేత పశ్యత,
సౌభాగ్య మస్మై దత్వా యాథాస్తం విపరేతన.

ఋ. 10-85-33

అంతట సభామండపమున గల సభ్యులెల్లరు తమకందజేసిన అక్షతలనుగాని పుష్పములనుగాని వధూవరుల శిరస్సులపై నుంచుచు నీ క్రింది శబ్దములతో నాశీర్వదింపవలయును.

ఓమ్ సౌభాగ్య మస్తు – ఓమ్ శుభం భవతు.

తదుపరి వధూవరులు యజ్ఞకుండమునకు పశ్చిమ భాగమున పూర్వము వలెనే కూర్చుండి ఈ క్రింది మంత్రములు చదివి ఆహుతులను నేతితో నియ్యవలయును.

(1) ఓం యదస్య కర్మణోఽ త్యరీరిచం యద్ వా న్యూన
మిహాకరమ్, అగ్నిష్టత్ స్విష్టకృద్ విద్యాత్ సర్వం
స్విష్టం సుహుతం కరోతు మే. అగ్నయే స్విష్టకృతే
సుహుతహుతే సర్వ ప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం
సమర్ధయిత్రే సర్వాన్నః కామాన్ సమర్ధయ స్వాహా -

ఇదమగ్నయే స్విష్టకృతే ఇదం న మమ.

(2) ఓం భూరగ్నయే స్వాహా - ఇదమగ్నయే ఇదం న మమ.

(3) ఓం భువర్వాయవే స్వాహా - ఇదం వాయవ ఇదం న మమ.

(4) ఓం స్వరాదిత్యాయ స్వాహా - ఇదమాదిత్యాయ ఇదం న మమ.

(5) ఓం భూర్భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః స్వాహా -
ఇద మగ్నివాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ.

ఇంతటితో వివాహవిధి సమాప్తమైనట్టు లెంచవలయును. వధూవరులు విశ్రాంతిని తీసికొనవచ్చును.

## ఉత్తరవిధి

కొంతతడవు విశ్రాంతి తీసికొనిన పిమ్మట వధూవరు లిరువురు ఉత్తరవిధిని నిర్వర్తింపవలయును. ఈవిధి వధువు ఇంటికి ఈశాన్యదిశ యందు పూర్వమే నిశ్చయించియున్న స్థలమున చేయునది. వివాహము ప్రాతఃకాలమున జరిగినచో ఈ యుత్తరవిధి సూర్యుడస్తమించిన పిదప యజ్ఞకుండమున పూర్వము చేసినట్లు అగ్నినాధానముచేసి, సమిధాధానాదులొనర్చి జలప్రసేచనముచేసి యీ క్రింది మంత్రములతో నాహుతులియ్యవలయును.

సాయం కాలమున వివాహము జరిగిన పక్షమున వివాహవేదిక వధువునింటికి ఈశాన్య దిశయందే యున్నచో నీయజ్ఞ కుండమునందే అగ్ని ఆధానాదులు ఇంతకు పూర్వమే జరిగియున్నందున నీ మంత్రములతో నాహుతు లియ్యదగును.

(1) ఓం అగ్నయే స్వాహా-ఇదమగ్నయ ఇదం న మమ.

(2) ఓం సోమాయస్వాహా-ఇదం సోమాయ ఇదం న మమ

(3) ఓం ప్రజాపతయే స్వాహా-ఇదం ప్రజాపతయ ఇదం న మమ.

(4) ఓం ఇంద్రాయ స్వాహా-ఇదమగ్నయ ఇదం న మమ

(5) ఓం భూరగ్నయే స్వాహా-ఇదం అగ్నయ ఇదం న మమ.

(6) ఓం భువర్వాయవే స్వాహా-ఇదం వాయవ ఇదం న మమ.

(7) ఓం స్వరాదిత్యాయ స్వాహా-ఇదమాదిత్యాయ ఇదం న మమ.

(8) ఓం భూర్భువఃస్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా-
ఇదమగ్ని వాయ్వాదిత్యేభ్య ఇదం న మమ.

## ప్రధాన హోమము

ఈ క్రింది మంత్రములతో నాహుతులియ్య వలయును.

(1) ఓం లేఖాసంధిషు పక్ష్మస్వారోకేషు చ యాని తే,
తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం
స్వాహా - ఇదం కన్యాయై ఇదం న మమ.

(2) ఓం కేశేషు యచ్చ పాపక మీక్షితే రుదితే చ యత్,
తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం
స్వాహా - ఇదం కన్యాయై ఇదం న మమ.

(3) ఓం శీలేషు యచ్చ పాపకం భాషితే హసితే చ యత్,
తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయామ్యహం
స్వాహా - ఇదం కన్యాయై ఇదం న మమ.

(4) ఓం ఆరోకేషు దంతేషు హస్తయోః పాదయోశ్చ
యత్, తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయా
మ్యహం స్వాహా - ఇదం కన్యాయై ఇదం న మమ.

(5) ఓం ఊర్వోరుపస్థే జంఘయోః సంధానేషు చ యాని
తే, తాని తే పూర్ణాహుత్యా సర్వాణి శమయా
మ్యహం స్వాహా - ఇదం కన్యాయై ఇదం న మమ.

(6) ఓం యాని కాని చ ఘోరాణి సర్వాంగేషు తవా
భవన్, పూర్ణాహుతిభి రాజ్యస్య సర్వాణి తా న్యశీ
శమం స్వాహా - ఇదం కన్యాయై ఇదం న మమ.

ఈపై వర్ణించిన ఆఱు మంత్రములతో ఆఱు ఆహుతులు నేతితో నొసంగి క్రింది మంత్రములతో మరల నేతితో నాల్గు ఆహుతులియ్య వలయును.

(1) ఓం భూరగ్నయే స్వాహా-ఇదమగ్నయ ఇదన్న మమ
(2) ఓం భువర్వాయవే స్వాహా-ఇదం వాయువ ఇదన్న మమ
(3) ఓం స్వరాదిత్యాయ స్వాహా-ఇదమాదిత్యాయ ఇదన్న మమ.
(4) ఓం భూర్భువః స్వరగ్నివాయ్వాదిత్యేభ్యః స్వాహా-
ఇదమగ్ని వాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ.

## ధ్రువదర్శనము

తదుపరి వధూవరులు లేచి వెలుపలికి వెళ్ళి ఉత్తరదిశలో నిలబడి ఆకాశమునందుగల ధ్రువ నక్షత్రమును జూపుచు వరుడు వధువుతో -

"ధ్రువం పశ్య" ధ్రువుని చూడు. అనవలయును.

వధువు - "పశ్యామి" చూచుచున్నానని వరునకు సమాధానము చెప్పవలయును.

"ఓం ధ్రువమసి ధ్రువాహం పతికులే భూయాసమ్"

నీవు ధ్రువముగా నున్నావు. నేనుకూడ పతికులమున ధ్రువముగా నుందును అనుమ (ఇట "భూయాసమ్" పదమునకు తదుపరి "సౌభాగ్యదా సుశీలా నామ్నాహం శ్రీమతః దేవదత్తస్య" అని నామములను జోడింపవలయును.)

అరుంధతీ దర్శనము

వరుడు:- "అరుంధతీం పశ్య" అని అరుంధతిని చూపునది.

వధువు:- "పశ్యామి" అరుంధతిని చూచుచున్నానని చెప్పినపిమ్మట

వరుడు-ఓం అరుంధత్యసి రుద్ధాహమస్మి. (అముష్య-అసౌ)

అను నీ మంత్రము నుచ్చరించి వధువు మస్తకముపై తనకుడిచేతినుంచి-

(1) ఓం ధ్రువా ద్యౌర్ ధ్రువా పృథివీ ధ్రువం విశ్వమిదం జగత్, ధ్రువాసః పర్వతా ఇమే ధ్రువా స్త్రీ పతికులే ఇయమ్.

మం. బ్రా. 1-3-7.

ద్యులోకము, పృథివి, ఈసమస్తజగత్తు, ఈ పర్వతములు ధ్రువములు స్థాయులుగా మున్నట్లు నీవును పతికులమున స్థిరముగానుండి సుఖింపుము అని ప్రార్థింపుము.

(2) ఓం ధ్రువమసి ధ్రువం త్వా పశ్యామి ధ్రువైధి పోష్యే
మయి. మహ్యాం త్వాదాత్ బృహస్పతిః మయా పత్యా
ప్రజావతీ శంజీవ శరదః శతమ్. పా.గృ. 1-8-19.

నీవు స్థిరముగానున్నావు. అట్లే నిన్ను జూచుచున్నాను నేను పోషకుడను కాగా పతివగువాతో సంతానవతివై నూఱేండ్లు సుఖముగానుండుము. పరమేశ్వరుని యనుగ్రహమున నీవు నాకు లభించితివి.

అని యిట్లుచెప్పి వధూవరులిరువురు యజ్ఞమండపమునకు పశ్చిమ భాగమున పూర్వాభి ముఖులై కూర్చుందురు.

"ఓం అమృతోప స్తరణమసి" ఇత్యాది మంత్రములతో ఆచమనము ముమ్మాఱు చేయుదురు. ఓం అయంత ఇధ్మ ఆత్మా ..........

ఇత్యాది మంత్రములతో సమిధల నాహుతిజేసి అగ్నిని ప్రజ్వలింపజేసి,
ఓం అగ్నయే స్వాహా ఆదిమంత్రములతో ఆఘారావాజ్యాహుతులు నాలుగు.
ఓం భూరగ్నయే స్వాహా ఇత్యాది మంత్రములతో నాలుగు వ్యాహృత్యాహుతులు ఇచ్చి తదుపరి అన్నముతో ఆహుతుల నీయవలయును.

## అన్నాహుతులు

ఒక పాత్రలో ఉడికిన అన్నమును కొంచెము తీసికొని దానిలో కొంచెము నేతిని కలిపి దానిని కొంచెము కొంచెముగా చేతులతో తీసికొని క్రింది మంత్రములతో వధూవరు లాహుతుల నియ్యవలయును.

ఓం అగ్నయే స్వాహా-ఇదమగ్నయ ఇద న్న మమ
ఓం ప్రజాపతయే స్వాహా-ఇదం ప్రజాపతయ ఇదం న మమ
ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా-ఇదం విశ్వేభ్యో దేవేభ్యః ఇదం న మమ.
ఓం అనుమతయే స్వాహా-ఇదమనుమతయ ఇదం న మమ.
ఓం యదస్యకర్మణో అత్యరీరిచం యద్వా న్యూన మిహా కరమ్,

అగ్నిష్టత్ స్విష్టకృద్విద్యాత్ సర్వం స్విష్టం
సుహుతం కరోతు మే అగ్నయే స్విష్టకృతే సుహుతహుతే
సర్వ ప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమర్థయిత్రే సర్వా
న్నః కామాన్ సమర్థయ స్వాహా-ఇదమగ్నయే స్విష్ట కృతే ఇదం న మమ
ఓం భూరగ్నయే స్వాహా-ఇదమగ్నయ ఇదం న మమ
ఓం భువర్ వాయవే స్వాహా-ఇదం వాయవ ఇదం న మమ
ఓం స్వరాదిత్యాయ స్వాహా-ఇదమాదిత్యాయ ఇదం న మమ.
ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా-
ఇదమగ్ని వాయ్వాదిత్యేభ్యః ఇద న్న మమ.
తదుపరి యీ క్రింది మంత్రములతో నాహుతులు-

(1) ఓం త్వన్నో అగ్నే వరుణస్య విద్వాన్ దేవస్య హేళో
వయాసిసీష్ఠాః యజిష్ఠో వహ్ని తమః శోశుచానో విశ్వా
ద్వేషాంసి ప్రముముగ్ధ్యస్మత్ స్వాహా-ఇదమగ్నీ
వరుణాభ్యాం ఇదం న మమ.

(2) ఓం స త్వం నో అగ్నే వమో భవోతీ నేదిష్ఠో అస్యా
ఉషసో వ్యుష్టౌ అవయక్ష్మనో వరుణం రరాణో వీహి
మృళీకం సుహవో న ఏధి స్వాహా-ఇద మగ్నీ వరుణాభ్యాం
ఇద న్న మమ.

(3) ఓం ఇమం మే వరుణశ్రుధీ హవమద్యా చ మృళయ.
త్వా మవస్యురాచకే స్వాహా-ఇదం వరుణాయ ఇద న్న మమ.

(4) ఓం తత్వా యామి బ్రహ్మణా వందమాన స్తదా
శాస్తే యజమానో హవిర్భిః, అహేళమానో వరుణేహ
బోధ్యురుశంసమాన ఆయుః, ప్రమోషీః స్వాహా - ఇదం
వరుణాయ ఇద న్న మమ.

(5) ఓం యే తే శతం వరుణ యే సహస్రం యజ్ఞియాః
పాశా వితతా మహాన్తః, తేభిర్ నో అద్య సవితోత
విష్ణుర్ విశ్వే ముంచన్తు మరుతః స్వర్కాః స్వాహా -

ఇదం వరుణాయ సవిత్రే విష్ణవే విశ్వేభ్యో దేవేభ్యో
మరుద్భ్యః స్వర్కేభ్యః ఇదం న మమ.

(6) ఓం అయాశ్చాగ్నేఽస్యనభిశస్తి పాశ్చ సత్యమిత్త్వ
మయాసి, అయా నో యజ్ఞం వహాస్యయా నో ధేహి
భేషజగ్ం స్వాహా-ఇదమగ్నయే అయసే ఇదం న మమ.

(7) ఓం ఉదుత్తమం వరుణపాశమస్మదవాధమం విమ
ధ్యమం శ్రథాయ, అథావయ, మాదిత్యవ్రతే తవా
నాగసో అదితయే స్యామ స్వాహా-ఇదం వరుణా
యాదిత్యా యాదితయే చ ఇదం న మమ.

(8) ఓం భవతన్నః సమనసౌ సచేతసావరేపసౌ మా
యజ్ఞగ్ం హిగ్ంసిష్టం మా యజ్ఞపతిం జాతవేదసౌ
శివౌ భవతమద్య నః స్వాహా-ఇదం జాతవేదోభ్యాం ఇదం న మమ.

## ఓదన ప్రాశనము

తదుపరి ఆహుతులియ్యగా మిగిలిన అన్నమున కొంచెము ఘృతము కలిపి, వరుడా అన్నపు పాత్రను తన యెడమ చేతియందుంచుకొని దానిపై కుడియుఅచేతినుంచి మూసి యీ క్రింది మంత్రములను మనస్సున జపింప వలయును.

(1) ఓం అన్నపాశేన మణినా ప్రాణసూత్రేణ పృశ్నినా,
బధ్నామి సత్యగ్రంథినా మనశ్చ హృదయం చ తే.

(2) ఓం యదేతద్ధృదయం తవ తదస్తు హృదయం మమ.
యదిదగ్ం హృదయం మమ తదస్తు హృదయం తవ.

(3) ఓం అన్నం ప్రాణస్య షడ్విగ్ంశస్తేన బధ్నామి త్వా
అసౌ మం. బ్రా. 1-3-8,9,10.

అసౌ పదమునకు బదులు వధువును నామముతో సంబోధింప వలయును. (యశోదే; సుశీలే; అని)

ఇట్లు మంత్రములను జపించి ఆయన్నమును వధూవరులు ఇరువురు కొంచెము కొంచెము తీసికొని తిని చేతులు శుద్ధిచేసికొన వలయును.

అనంతరము మహావామదేవ్య గానము పురోహితులు చేయుదురు.

## సామవేదోక్త వామదేవ్యమ్

(1) ఓం భూర్భువః స్వః, కయా న శ్చిత్ర ఆ భువదూతీ
సదా వృధః సఖా, కయా శచిష్ఠయా వృతా.

(2) ఓం భూర్భువః స్వః కస్త్వా సత్యో మదానాం మగ్ం
హిష్ఠో మత్ దన్దసః, దృఢా చిదారుజే వసు.

(3) ఓం భూర్భువఃస్వః, అభీషుణః సఖీనామవితా జరితౄణామ్,
శతం భవా మ్యూతయే.

తరువాత వధూవరులు మండపమునుండిపోయి గృహప్రవేశము చేయవలయును. మూడు రోజులు బ్రహ్మచర్యమును పాలించుచు సాత్వికాహారమును గ్రహించుచు విడివిడి స్థానములందు శయనింప వలయును. తదుపరి నాల్గవ రాత్రి యందు విధిపూర్వకముగా గర్భాధాన సంస్కారము జరిపిన పిమ్మట గర్భాధాన మొనర్ప వలయును.

## వరుని ప్రతియాత్ర

వివాహము జరిగిన పిమ్మట రెండవ రోజునగాని, మూడవ రోజునగాని, వరపక్షమువారు వధూవరులను బండిపై కూర్చుండబెట్టి ఆదరముతో వరుని యింటికి గొంపోలయును.

వధువు తన తల్లిదండ్రుల యింటినుండి పోవునపుడు కంట తడి పెట్టినచో వరుడీ క్రింది మంత్రమును జదువవలయును.

ఓమ్ జీవం రుదన్తి విమయన్తే అధ్వరే దీర్ఘామను ప్రసితిం
దీధియుర్నరః, వామం పితృభ్యో య ఇదం సమేరిరే
మయః పతిభ్యో జనయః పరిష్వజే. ఋ. 10-40-10

ఇట్లు చదివి బండిలో కూర్చుండునపుడు వరుడు వధువును తన కుడివైపున కూర్చుండబెట్టుకొని యీ మంత్రముల పఠించునది.

(1) ఓమ్ పూషా త్వేతో నయతు హస్తగృహ్యాశ్వినా
త్వా ప్రవహతాం రథేన, గృహాన్ గచ్ఛ గృహపత్నీ
యథాసో వశినీ త్వం విదథమా వదాసి. ఋ. 10-85-26

(2) ఓం సుకిగ్ం శుకగ్ం శల్మలిం విశ్వరూపగ్ం హిరణ్య
వర్ణగ్ం సువృతగ్ం సుచక్రమ్, ఆరోహ సూర్యే అమృ
తస్య లోకగ్ం స్యోనం పత్యే వహతుగ్ం కృణుష్వ.

ఋ.10-85-20

తదుపరి బండిని నడపవలయును. మధ్యలో నదిని పడవపై దాటవలసి వచ్చినచో నీ క్రింది మంత్రమును జదివి వధువును పడవపై కూర్చుండ జేయవలయును.

ఓం అశ్మన్వతీ రీయతే సంరభధ్వ ముత్తిష్ఠత ప్రతరతా సఖాయ:
ఋ. 10-53-7

పడవ నుండి వధువును దించునపుడు-

ఓమ్ అత్రా జహామ యే అసన్న శేవా: శివాన్వయ
ముత్తరే మాభివాజాన్. ఋ. 10-53-8

అని మంత్రమును జదివి దింపవలయును. ఇంకను తదుపరి మార్గమధ్యమున నాలుగు దారులు కలియుచోటు, భయంకర స్థలములు స్మశాన భూమికాని వచ్చినచో వరుడీ క్రింది మంత్రమును జదువునది.

ఓమ్ మా విదన్ పరిపంథినో య ఆసీదంతి దంపతీ, సుగేభిర్
దుర్గమతీతామపద్రా న్త్వరాతయ:. ఋ. 10-85-32.

ఇంకను మార్గమధ్యమున విఘ్నము లేర్పడి యెటనైన నుండవలసి వచ్చిన, మంచి స్థలమున నివాసమేర్పఱచుకొని వెంటతెచ్చుకొనుచున్న వివాహాగ్నిని ప్రజ్వాలింపజేసి యీ క్రింది మంత్రములతో నేతి యాహుతుల నీయ వలయును.

ఓం భూరగ్నయే స్వాహా-ఇదమగ్నయ ఇదం న మమ
ఓం భువర్వాయవే స్వాహా-ఇదం వాయవ ఇద న్న మమ
ఓం స్వరాదిత్యాయ స్వాహా-ఇదమాదిత్యాయ ఇద న్న మమ.
ఓం భూర్భువఃస్వ రగ్నివాయ్వాదిత్యేభ్యః స్వాహా-ఇద
మగ్నివాయ్వాదిత్యేభ్యః ఇదం న మమ.

బండిలో వధూవరులు వరుని గృహమును సమీపించినపుడు కులీనయు, పుత్రవతియు, సౌభాగ్యవతియు నగు స్త్రీ బండిని సమీపించి వధువు హస్తమును బట్టుకొని వరునితోబాటు బండినుండిదింపి, వరుని యింటిలోని సభామండపమునకు తేవలయును. మండపద్వారమును సమీపింపగానే యటకు వచ్చిన బంధుజనుల వంకజూచి వరుడీ క్రింది మంత్రము జదువ వలయును.

"ఓం సుమంగలీ రియం వధూ రిమాం సమేత పశ్యత,
సౌభాగ్యమస్యై దత్త్వా యాథాస్తం విపరేతన. ఋ. 10-85-33.

ఈ సుమంగళిని ఆశీర్వదించి మీ గృహములకు మరలుడు, అనును. అంతట వారు-

ఓం సౌభాగ్యమస్తు – ఓం శుభం భవతు.

అని వధువు శిరస్సున అక్షతాదులనుంచి ఆశీర్వదింతురు. పిదప వరుడు-

"ఓం ఇహ ప్రియం ప్రజయా తే సమృధ్యతా మస్మిన్
గృహే గార్హపత్యాయ జాగృహి, ఏనా పత్యా తన్వం
సంసృజస్వాధా జి వ్రీ విదథమావదాథః. ఋ. 10-85-27.

అను నీమంత్రమును జదివి వధువును సభామండపమునకు తీసికొని రావలయును.

తదనంతరమట పూర్వమే సిద్ధపఱచియున్న యజ్ఞమంటపమునకు వధూవరులు సమీపింతురు. అంతట వరుడు-

"ఓమ్ ఇహ గావః ప్రజాయధ్వ మిహాశ్వా ఇహపూరుషాః,
ఇహ సహస్రదక్షిణోఽ పి పూషా నిషీదతు.
అథ. 20-127-12. మం. బ్రా. 1-3-13.

అను నీమంత్రము నుచ్చరించి యజ్ఞమండపమునకు పశ్చిమ భాగమున పూర్వాభిముఖముగా తాను కూర్చుండి వధువును తన కుడివైపున కూర్చుండజేసి కొనవలయును.

## వరగృహమున యజ్ఞము

ఇట్లు కూర్చుండి ఆచమనము, అంగస్పర్శము మంత్రములు చదివి చేయవలయును.

"ఓమ్ అమృతోప స్తరణ మసి స్వాహా.
"ఓమ్ అమృతాపిధానమసి స్వాహా.
"ఓమ్ సత్యం యశః శ్రీర్మయి శ్రీః శ్రయతాం స్వాహా.

అంగస్పర్శ-

ఓం వాఙ్మ ఆస్యేఽ స్తు
ఓం నసోర్మే ప్రాణోఽ స్తు
ఓం అక్ష్ణోర్ మే చక్షురస్తు
ఓం కర్ణయోర్మే శ్రోత్రమస్తు
ఓం బాహ్వోర్మే బలమస్తు
ఓం ఊర్వోర్మ ఓజోఽ స్తు
ఓం అరిష్టాని మే అంగాని తనూస్తన్వా మే సహసంతు

అగ్ని హోత్రము :- కుండమున సమిధల నుంచి అగ్నిని ప్రవేశింపజేసి ప్రజ్వలింపజేయునది.

మంత్రములు :-

ఓం భూర్భువఃస్వః, అని కర్పూరము వెలిగించి,
ఓం భూర్భువః స్వర్ద్యౌరివ భూమ్నా పృథివీవ వరిమ్ణా
తస్యాస్తే పృథివి దేవయజని పృష్ఠేఽగ్నిమన్నాదమన్నాద్యాయాదధే.

అని అగ్నిని కుండమున నుంచవలయును.

ఓం ఉద్బుధ్యస్వాగ్నే ప్రతిజాగృహి త్వమిష్టా పూర్తే
సగ్ంం సృజేథామయం చ. అస్మిన్ త్సధస్థే అధ్యుత్తరస్మిన్
విశ్వేదేవా యజమా < శ్చ సీదత.

అని అగ్నిని ప్రజ్వలింప జేయునది.

సమిధలు :-

(1) ఓం అయన్త ఇధ్మ ఆత్మా జాత వేదస్తే నేధ్యస్వ వర్ధస్వ చేద్ధవర్ధయ చాస్మాన్, ప్రజయా పశుభిర్ బ్రహ్మ వర్చసే నాన్నాద్యేన సమేధయ స్వాహా-ఇదమగ్నయ ఇదం న మమ.

అని మొదటి సమిధను కుండమున నుంచవలయును.

(2) ఓం సమిధాగ్నిం దువస్యత ఘృతైర్ బోధయతాతిథిం ఆస్మిన్ హవ్యా జుహోతన - ఓం సుసమిద్ధా య శోచిషే ఘృతం తీవ్రం జుహోతన, అగ్నయే జాత వేదసే స్వాహా-ఇదమగ్నయే జాతవేదసే ఇదం న మమ.

అని యీ రెండు మంత్రములతో రెండవ సమిధనుంచవలయును.

(3) ఓం తంత్వా సమిద్భిరంగిరో ఘృతేన వర్ధయామసి బృహచ్ఛోచా యవిష్ఠ్య స్వాహా-ఇదమగ్నయే అంగిరసే ఇద న్న మమ.

అని మూడవ సమిధనుంచవలయును.

తదుపరి యీక్రింది మంత్రము నైదు మారులు చదివి ఘృతాహుతుల నిచ్చి అగ్నిని ప్రజ్వలింప జేయునది.

ఓం అయన్త ఇధ్మ ఆత్మా జాతవేద స్తేనేధ్యస్వ వర్ధస్వ చేద్ధ వర్ధయ చాస్మాన్, ప్రజయా పశుభిర్ బ్రహ్మవర్చసే నాన్నాద్యేన సమేధయ స్వాహా-ఇదమగ్నయ ఇద న్న మమ.

తరువాత నీ క్రింది మంత్రములతో-

ఓం అదితేఽను మన్యస్వ - అని కుండమునకు తూర్పున,
ఓం అనుమతేఽను మన్యస్వ - అని పశ్చిమమున,
ఓం సరస్వత్యను మన్యస్వ - అని కుండమునకు ఉత్తరమున,

ఓం దేవసవితః ప్రసువ యజ్ఞం ప్రసువ యజ్ఞపతిం భగాయ
దివ్యో గంధర్వః కేతపూః కేతన్నః పునాతు వాచస్పతిర్
వాచం నః స్వదతు.    యజు. 30-1.

అని కుండమునకు దక్షిణ భాగమునుండి మొదలిడి చుట్టు నీరు చల్లవలయును.

తరువాత నీక్రింది మంత్రములతో-

(1) ఓం అగ్నయేస్వాహా - ఇదమగ్నయ ఇద న్న మమ.
(2) ఓం సోమాయ స్వాహా - ఇదం సోమాయ ఇద న్న మమ.
(3) ఓం ప్రజాపతయే స్వాహా - ఇదం ప్రజాపతయ ఇద న్న మమ.
(4) ఓం ఇంద్రాయ స్వాహా - ఇదమింద్రాయ ఇదం న మమ.
(5) ఓం భూరగ్నయే స్వాహా - ఇద మగ్నయ ఇద న్న మమ.
(6) ఓం భువర్వాయవే స్వాహా - ఇదం వాయవ ఇద న్న మమ.
(7) ఓం స్వరాదిత్యాయ స్వాహా - ఇదమాదిత్యాయ ఇద న్న మమ.
(8) ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా -
ఇద మగ్ని వాయ్వాదిత్యేభ్య ఇదం న మమ.

అని నేతితో ఎనిమిది ఆహుతులనిచ్చునది.

## ప్రధాన హోమము

ఈ క్రింది ఎనిమిది మంత్రములతో ఆహుతులు ఇచ్చునది.

(1) ఓం ఇహ ధృతిః స్వాహా - ఇదమిహ ధృత్యై ఇద న్న మమ.
(2) ఓం ఇహ స్వధృతిః స్వాహా - ఇదమిహ స్వధృత్యై ఇద న్న మమ.
(3) ఓం ఇహ రన్తిః స్వాహా - ఇదమిహరన్త్యై ఇద న్న మమ.
(4) ఓం ఇహ రమస్వ స్వాహా - ఇదమిహ రమాయ ఇద న్న మమ.
(5) ఓం మయి ధృతిః స్వాహా - ఇదం మయి ధృత్యై ఇద న్న మమ.
(6) ఓం మయి స్వధృతిః స్వాహా - ఇదం మయి స్వధృత్యై
ఇద న్న మమ.
(7) ఓం మయి రమః స్వాహా - ఇదం మయి రమాయ ఇద న్న మమ.
(8) ఓం మయి రమస్వ స్వాహా - ఇదం మయి రమాయ ఇద న్న మమ.

ఈ క్రింది మంత్రములతో ఆహుతులు ఇచ్చునది.

(1) ఓం ఆ నః ప్రజాం జనయతు ప్రజాపతి రాజరసాయ సమనక్త్వర్యమా, అదుర్ మంగలీ, పతిలోకమావిశ శంనో భవ ద్విపదే శం చతుష్పదే స్వాహా - ఇదం సూర్యాయై సావిత్ర్యై ఇదం న మమ.

(2) ఓం అఘోరచక్షురపతిఘ్న్యేధి శివా పశుభ్యః సుమనాః సువర్చాః, వీరసూర్ దేవృకామా స్యోనా శం నో భవ ద్విపదే శం చతుష్పదే స్వాహా - ఇదం సూర్యాయై సావిత్ర్యై ఇద న్న మమ.

(3) ఓం ఇమాం త్వమింద్ర మీఢ్వః సుపుత్రాం సుభగాం కృణు, దశాస్యాం పుత్రానాధేహి పతి మేకాదశం కృధి స్వాహా - ఇదం సూర్యాయై సావిత్ర్యై ఇదం న మమ.

(4) ఓం సమ్రాజ్ఞీ శ్వశురే భవ సమ్రాజ్ఞీ శ్వశ్ర్వాం భవ. ననాందరి సమ్రాజ్ఞీ భవ సమ్రాజ్ఞీ అధిదేవృషు స్వాహా - ఇదం సూర్యాయై సావిత్ర్యై ఇదం న మమ.

క్రింది మంత్రముతో నొక స్విష్టకృత్ ఆహుతి.

(5) ఓం యదస్య కర్మణ్యోऽత్యరీరిచం యద్వా న్యూనమిహా కరమ్ అగ్నిష్టత్ స్విష్టకృద్ విద్యాత్ సర్వం స్విష్టం సుహుతం కరోతు మే అగ్నయే స్విష్టకృతే సుహుత హుతే సర్వప్రాయశ్చిత్తాహుతీనాం కామానాం సమర్ధ యిత్రే సర్వాన్నః కామాన్ త్సమర్ధయ స్వాహా - ఇదమగ్నయే స్విష్టకృతే ఇదం న మమ.

(6) ఓం భూరగ్నయే స్వాహా - ఇదమగ్నయ ఇదం న మమ.

(7) ఓం భువర్ వాయవే స్వాహా - ఇదం వాయవ ఇద న్న మమ.

(8) ఓం స్వరాదిత్యాయ స్వాహా - ఇదమాదిత్యాయ ఇద న్న మమ.

(9) ఓం భూర్భువః స్వరగ్ని వాయ్వాదిత్యేభ్యః స్వాహా - ఇదమగ్ని వాయ్వాదిత్యేభ్య ఇదం న మమ.

(10) ఓం ప్రజాపతయే స్వాహా - ఇదం ప్రజాపతయే ఇదం న మమ.

తరువాత నీ క్రింది మంత్రమును జదివి వధూవరులు దధి ప్రాశనము చేయుదురు.

ఓం సమంజంతు విశ్వే దేవాః సమాపో హృదయాని నౌ
సంమాతరిశ్వా సంధాతా సముదేష్ట్రీదధాతు నౌ -

ఋ.10-85-47.

తరువాత వధూవరులు యజ్ఞ మండపమునుండి లేచి-

ఓం భో అభివాదయామి. (లేక) నమస్తే.

అను నీశబ్దములతో తల్లి దండ్రులకు వృద్ధులకు నమస్కరింప వలయును.

తరువాత సుభాషితులై శుభాసనమున గూర్చుండి వామదేవ్యగాన మొనర్చి ఈశ్వరోపాసన చేయునది. కార్యార్థ మటకు వచ్చిన స్త్రీ పురుషులును ధ్యానమగ్నులు కావలయును.

పిమ్మట వధూవరులు:-

ఓం స్వస్తి భవంతో బ్రువన్తు.

అని తల్లి దండ్రులను ఆచార్యుని, పురోహితుడు మున్నగు వారిని కోరవలయును. అప్పుడు వారెల్లరు "స్వస్తి, స్వస్తి స్వస్తి" అని స్వస్తి వచనములు పలుకవలయును.

తదుపరి, తల్లి దండ్రులు, ఆచార్యుడు - పురోహితుడు మున్నగు వారు. విద్వాంసులగుచో వధూవరులు స్వస్తి వాచన మంత్రములను (ఓం అగ్ని మీళే .......... ఆది) ప్రేమతో పఠింపవలయును. అనంతరము 'ఓం స్వస్తి, ఓం స్వస్తి' అని ముగింప వలయును.

కార్యకర్తలయిన వరుని తల్లి దండ్రులు సోదరులు అటకు వచ్చిన పురుషులను, పురోహితుని యథోచితముగ సత్కరింప వలయును. వరుని అక్కచెల్లెండ్రు, తల్లి స్త్రీలకు తగిన సత్కారముల నొనర్పదగును.

సమాప్తము

..............................

## 14. శాల-గృహప్రవేశ సంస్కారము

మనుష్యులు, పశువులు ఉండుటకు, పదార్థములనుంచుటకును నిర్మింపబడు కట్టడమును శాలయనియో గృహమనియో చెప్పుదురు. ఇందుకు ప్రమాణము, విధియు గలవు.

ప్రమాణము :-

(1) ఓం ఉపమితాం ప్రతిమితా మథో పరిమితాముత, శాలాయా విశ్వవారాయా నద్ధాని విచృతామసి.

(2) ఓం హవిర్ధాన మగ్నిశాలం పత్నీనాం సదనం సదః, సదో దేవానామసి దేవి శాలే, అథర్వ. 9-3-1, 7.

(1) మనుష్యులు నిర్మించుకొను గృహము విద్వాంసులు ప్రశంసింపదగినట్లు ఉత్తమముగా నుండ వలయును. ఇంటిద్వారములు, కోణములు, గదులు నన్నియు నొక దానికొకటి యెదురెదురుగా నుండనగును. పరిమాణము నలువైపులనుండి సమచతురస్రమైయుండుట మంచిది. దాని ద్వారములు నలువైపుల నుంచి వాయువును గ్రహించునట్లుండ వలయును. కట్టుబడి దృఢమై యుండదగును.

(2) ఆయింటిలో హోమద్రవ్యములుంచుటకు, అగ్నిహోత్ర మొనర్చుటకు, పురుషులు విద్వాంసులు ఒకచోట కలిసి సంభాషణాదు లొనర్చుటకు, స్నాన, భోజన ధ్యానాదులకు వేఱు వేఱుగా గదులుండవలయును. ఇట్లు నిర్మింపబడిన శాల - గృహము సుఖదాయక మగునని భావము. (గృహనిర్మాణ విషయమున్న నింకనేక ప్రమాణములు వేదాదులందు జూడనగును - గ్రంథ విస్తరభీతిచే వాని నన్నిటినిటననువదింపలేదు.)

విధి :-

ఇట్లు నిర్మింప బడిన గృహమును శుద్ధి చేసి వెలుపలి నాల్గు ద్వారముల దగ్గఱ లోపల నాల్గు వేదికలు, మధ్య హాలులో నొక వేదిక నిర్మింప జేయవలయును. లేక, రాగితోగాని లోహముతోగాని యజ్ఞ కుండములను నిర్మించు కొనవచ్చును. ఇట్టి యజ్ఞ కుండమున్న నొక్క దానితోనే అన్ని యెడల కార్యముచేసి కొననగును.

యజ్ఞమునకు వలయు పదార్థములన్నియు ముందుగానే సేకరించి శుద్ధముగా నుంచుకొన వలయును. గృహపతి చిత్తము ప్రసన్నముగా నున్న శుభదినమున గృహప్రతిష్ఠ-సంస్కారము జరుపవలెను.

గృహమధ్య భాగమున విశాలమైన గదిలో యజ్ఞవేదిక నమర్చి యజమానుడు యజ్ఞ కుండమునకు పశ్చిమమున పూర్వాభి ముఖుడై కూర్చుండ వలెను. బ్రహ్మ-పురోహితుడు దక్షిణమున నుత్తరాభి ముఖముగా గూర్చుండును. ఇతర ఋత్విజులున్న పక్షమున హోత పశ్చిమమున పూర్వాభి ముఖముగాను, అధ్వర్యువు ఉత్తరమున దక్షిణ ముఖముగాను, ఉద్గాత పూర్వదిశలో పశ్చిమాభి ముఖముగాను ఆసనములపై గూర్చుందురు.

గృహ ద్వారములకు తోరణాదులు కట్టి అలంకరించి యుంచవలయును. గృహమునకు పైన నలుమూలలందు నాలుగు చిన్న చిన్న 'ఓం' పతాకముల నలంకరింపవలెను. గృహ ప్రవేశద్వారమునకు సమీపమున నొక ధ్వజ స్తంభమును పాతి దానిపై నొక పతాకము నుంచునది.

తరువాత యజమానుడు పత్ని, బంధు సమేతుడై బ్రహ్మాదులతో బాటు ప్రవేశద్వారము సమీపమునన్న ధ్వజస్తంభమును సమీపించి అట నిలబడి-

ఓం అచ్యుతాయ భౌమాయ స్వాహా - పా. గృ. 3-4-3.

అని జలముతో నొక యాహుతినిచ్చి - భూమిపై జలమును పోసి ధ్వజస్తంభమును నిలబెట్టవలయును.

తదుపరి ఇంటి నలువైపులనున్న ద్వారములకు వెలుపల నిలబడి యజమానుడు నిమ్న లిఖిత మంత్రముల నుచ్చరించి ద్వారముల సమీపమున జలసేచనము చేయవలయును.

తూర్పు ద్వారము :-

ఓం ఇమా ముచ్ఛ్రయామి భువనస్య నాభిం వసోర్ధారాం
ప్రతరణీం వసూనామ్, ఇహైవ ధ్రువాం నిమినోమి శాలాం
క్షేమే తిష్ఠతు ఘృతముక్షయమాణా. పా.గృ. 3-4-4.

దక్షిణ ద్వారము :-

ఓం అశ్వావతీ గోమతీ సూనృతావత్యుచ్ఛ్రయస్వ మహతే సౌభగాయ, ఆ త్వా శిశురాక్రన్దత్వా గావో ధేనవో వాశ్యమానాః. పా.గృ. 3-4-4.

పశ్చిమ ద్వారము :-

ఓం ఆ త్వా కుమార స్తరుణ ఆవత్సో జగదైః సహ. ఆ త్వా పరిస్రుతః కుమ్భ ఆదధ్నః కలశైరుప, క్షేమస్య పత్నీ బృహతీ సువాసా రయిం నో ధేహి సుభగే సువీర్యమ్.

పా.గృ. 3-4-4.

ఉత్తర ద్వారము :-

ఓం అశ్వావద్ గోమదూర్జస్వత్ పర్ణం వనస్పతేరివ, అభినః పూర్యతాగ్ం రయిరిదమనుశ్రేయో వసానః

పా.గృ. 3-4-4.

ఇట్లు నాలుగు ద్వారముల సమీపమున వెలుపల జలసేచనము చేసి గృహపతి ముఖ్యద్వారమును సమీపించి-

## ద్వార ప్రవేశము

యజ :- హే బ్రహ్మన్ ప్రవిశామీతి. బ్రహ్మన్ ప్రవేశించుచున్నాను అనును.

బ్రహ్మ :- వరం భవాన్ ప్రవిశతు. మంచిది ప్రవేశింపుము.

యజ :- ఓం ఋచం ప్రపద్యే శివం ప్రపద్యే. పా.గృ. 3-4-6.

అను వాక్యమును బల్కి గృహమున పత్నీసమేతుడై ప్రవేశించును. యజమానుని పత్ని ఘృతపాత్రను చేతితో పట్టుకొని ప్రవేశించును.

## యజ్ఞము

యజమానుడు పురోహితుడు నెల్లరు ఆసనములపై గూర్చుండి సామాన్య ప్రకరణమున జూపినట్లు ఆచమనము, ఈశ్వరస్తుతి ప్రార్థనోపాసనలు, స్వస్తి

శాంతికరణ మంత్రములు పఠింతురు. తదుపరి అగ్న్యాధానము, సమిధాధానము, ప్రజ్వలనము, జలప్రసేచనము' చేసి, ఓం అగ్నయే స్వాహా అను మంత్రములతో ఆఘారావాజ్య భాగాహుతులు 4, ఓం భూరగ్నయే స్వాహా అను మంత్రములతో వ్యాహృత్యాహుతులు 4, ఓం యదస్య కర్మణో అను మంత్రముతో స్విష్టకృదాహుతి, నేతితో నియ్యవలయును. ద్వారములలో వేదికల సమర్చిన వాని యందును అగ్న్యాధానము మొదలు స్విష్టకృదాహుతి వఱకు నాహుతులనిచ్చి - తదుపరి యొక్కొక్క దిశలోని వేదికలలో నీ క్రింది మంత్రములతో నాహుతులిచ్చునది. (ద్వారవేదికల సమర్చుకున్న మధ్యవేదికయందే ఆహుతులీయనగును)

పూర్వ దిశలో :-

ఓం ప్రాచ్యా దిశః శాలాయా నమో మహిమ్నే స్వాహా.
ఓం దేవేభ్యః స్వాహ్యేభ్యః స్వాహా.

దక్షిణ దిశలో :-

ఓం దక్షిణాయా దిశః శాలాయా నమో మహిమ్నే స్వాహా.
ఓం దేవేభ్యః స్వాహ్యేభ్యః స్వాహా.

పశ్చిమ దిశలో :-

ఓం ప్రతీచ్యా దిశః శాలాయా నమో మహిమ్నే స్వాహా.
ఓం దేవేభ్యః స్వాహ్యేభ్యః స్వాహా.

ఉత్తర దిశలో :-

ఓం ఉదీచ్యా దిశః శాలాయా నమో మహిమ్నే స్వాహా.
ఓం దేవేభ్యః స్వాహ్యేభ్యః స్వాహా.

గృహమధ్యమున్న వేదికలో :-

ఓం ధ్రువాయా దిశః శాలాయా నమో మహిమ్నే స్వాహా.
ఓం దేవేభ్యః స్వాహ్యేభ్యః స్వాహా.
ఓం ఊర్ధ్వాయా దిశః శాలాయా నమో మహిమ్నే స్వాహా.
ఓం దేవేభ్యః స్వాహ్యేభ్యః స్వాహా.
ఓం దిశో దిశః శాలాయా నమో మహిమ్నే స్వాహా.
ఓం దేవేభ్యః స్వాహ్యేభ్యః స్వాహా.

అథర్వ.9-3-25 నుండి 31.

ఇట్లు మధ్యవేదికలో ఆజ్యాహుతులనిచ్చి మరల నీ క్రింది మంత్రములను జదివి మధ్యవేదికయందే నేతి యాహుతులియ్య వలయును.

## మధ్యవేదికయందే ఘృతాహుతులు

(1) ఓం వాస్తోష్పతే ప్రతిజానీహ్యస్మాన్ త్స్వావేశో అన
మీవో భవా నః, యత్త్వేమహే ప్రతితన్నో జుషస్వ
శంనో భవ ద్విపదే శం చతుష్పదే స్వాహా.

(2) ఓం వాస్తోష్పతే ప్రతరణో న ఏధి గయస్ఫానో
గోభిరశ్వేభిరిన్దో, అజరాసస్తే సఖ్యే స్యామ
పితేవ పుత్రాన్ ప్రతి నో జుషస్వ స్వాహా.

(3) ఓం వాస్తోష్పతే శగ్మయా సంసదా తే సక్షీమహి
రణ్వయా గాతుమత్యా, పాహి క్షేమ ఉత యోగే
వరం నో యూయం పాత స్వస్తిభిః సదా నః స్వాహా
ఋ. మం. 7. సూ. 54-1,2,3.

(4) ఓం అమీవహా వాస్తోష్పతే విశ్వారూపాణ్యావిశన్.
సఖా సుశేవ ఏధి నః స్వాహా. ఋ. 7-55-1.

తరువాత అంతకు పూర్వమే వండి సిద్ధపఱచి యుంచిన మోహన భోగమో, లేక క్షీరాన్నమో వేఱు వేఱు పాత్రలలో కొంచెము కొంచెము తీసికొని దానియందు నేయి కలిపి యీ మంత్రములతో నాహుతులిచ్చునది.

## స్థాలీపాకాహుతులు

(1) ఓం అగ్నిమింద్రం బృహస్పతిం విశ్వాగ్ం శ్చ దేవానుపహ్వయే
సరస్వతీం చ వాజీం చ వాస్తు మే దత్తవాజినః స్వాహా.

(2) ఓం సర్వదేవజనాన్ త్సర్వాన్ హిమవంతగ్ం సుదర్శనమ్,
వసూగ్ంశ్చ రుద్రానాదిత్యానీశానం జగదైః సహ,
ఏతాన్త్సర్వాన్ ప్రపద్యేఽహం వాస్తు మే దత్తవాజినః స్వాహా.

(3) ఓం పూర్వాహ్ణమపరాహ్ణం చోభౌ మధ్యందినా సహ,
ప్రదోషమర్ధ రాత్రం చ వ్యుష్టాం దేవీం మహాపథామ్,
ఏతాన్ త్సర్వాన్ ప్రపద్యేహం వాస్తు మే దత్తవాజినః స్వాహా.

(4) ఓం కర్తారం చ వికర్తారం విశ్వకర్మాణమోషధీంశ్చ
వనస్పతీన్, ఏతాన్త్సర్వాన్ ప్రపద్యేఽహం వాస్తు మే
దత్తవాజినః స్వాహా.

(5) ఓం ధాతారం చ విధాతారం నిధీనాం చ పతిగ్ం సహ,
ఏతాన్త్సర్వాన్ ప్రపద్యేఽహం వాస్తు మే దత్తవాజినః స్వాహా.

(6) ఓం స్యోనగ్ం శివమిదం వాస్తు దత్తం బ్రహ్మ ప్రజాపతీ,
సర్వాశ్చ దేవతాశ్చ స్వాహా. పా.గృ. 3-4-8.

ఇట్లు నేయి కలిపిన అన్నముతో నాహుతులిచ్చి తదుపరి యొక కంచు పాత్రలో తేనె, పెరుగు, నేయి కొంచెము కొంచెము తీసికొని కలిపి గోమయము, గరిక, దర్భలు కొన్నితీసికొని, యజమానుడు, పత్ని, పురోహితుడు ద్వారముల సమీపమునకు వెళ్ళి యొక్కొక్క ద్వారముదగ్గఱ కొంచెము నీరుచల్లి, గోమయముతో పలికి, దానిపై నొకయాకునుంచి యందు గరిక దర్భలు ఉంచి పాత్రలో కలిపియుంచిన పదార్థములను గూడ కొంచెముంచవలయును.

## ద్వారపూజ - ఉపస్థానము

పూర్వద్వారమున:-

ఓం శ్రీశ్చ త్వా యశశ్చ పూర్వే సంధౌ గోపాయేతామ్,

దక్షిణద్వారమున :-

ఓం యజ్ఞశ్చ త్వా దక్షిణా చ దక్షిణే సంధౌ గోపాయేతామ్.

పశ్చిమ ద్వారమున :-

ఓం అన్నం చ త్వా బ్రాహ్మణశ్చ పశ్చిమే సంధౌ గోపాయేతామ్.

ఉత్తర ద్వారమున :-

ఓం ఊర్క్ చ త్వా సూనృతాచోత్తరే సంధౌ
గోపాయేతామ్. పా.గృ. 3-4-10 నుండి 13.

అను నీ మంత్రములతో కంచు పాత్రలోని వస్తువుల నుంచవలయును.

## పరమేశ్వరుని ప్రార్థన

పూర్వదిశాభిముఖుడై యజమానుడు :-

(1) కేతా చ మా సుకేతా చ పురస్తాత్ గోపాయేతా
మిత్యగ్నిర్వై కేతాzzదిత్యః సుకేతా తౌ ప్రపద్యే
తాభ్యాం నమోzస్తు తౌ మా పురస్తాత్ గోపాయేతామ్.
పా. గృ. 3-4-14.

దక్షిణ ద్వారమున దక్షిణాభిముఖుడై :-

(2) దక్షిణతో గోపాయమానం చ మా రక్షమాణా చ దక్షిణతో
గోపాయేతా మిత్యహర్వై గోపాయమానగ్ం
రాత్రీ రక్షమాణా తే ప్రపద్యే తాభ్యాం నమోzస్తు
తే మా దక్షిణతో గోపాయేతామ్- పా.గృ. 3-4-15.

పశ్చిమ ద్వారమున పశ్చిమాభిముఖుడై :-

(3) దీదివిశ్చ మా జాగృవిశ్చ పశ్చాత్ గోపాయేతామిత్య
న్నం వై దీదివిః ప్రాణోజాగృవిస్తౌ ప్రపద్యే తాభ్యాం
నమోzస్తు తౌ మా పశ్చాద్ గోపాయేతామ్.
పా.గృ. 3-4-16

ఉత్తర ద్వారమున నుత్తరముఖుడై :-

(4) అస్వప్నశ్చ మా అనవద్రాణశ్చోత్తరతో గోపాయేతా
మితి చంద్రమా వా అస్వప్నో వాయురనవద్రాణస్తౌ
ప్రపద్యే తాభ్యాం నమోzస్తు తౌ మోత్తరతో గోపా
యేతామితి. పా.గృ. 3-4-17.

(5) ధర్మస్థూణారాజగ్ం శ్రీసూర్యామహోరాత్రే ద్వార ఫలకే, ఇంద్రస్య గృహా వసుమంతో వరూధినస్తానహం ప్రపద్యే సహ ప్రజయా పశుభి: సహ, యన్మే కించిదస్త్యుపహూత: సర్వగణ: సఖాయ: సాధుసం మతస్తాం త్వా శాలే అరిష్టవీరా గృహా న: సంతు సర్వత:. పా.గృ. 3-4-18.

ఉపర్యుక్త మంత్రములతో నాయాద్వారములందు పరమేశ్వరుని ప్రార్థించి, తిరిగి వచ్చి యజమానుడు మధ్యవేదిక యందు ప్రాత: సాయంకాలిక ఆహుతులిచ్చి యజ్ఞమును సమాప్తము చేయనగును.

ఋత్విక్కులను సంస్కారమునకు వచ్చిన వారిని తగినట్లు సత్కరించి యాశీర్వాదమును బొందునది.

## ఆశీర్వాదము

సర్వే భవంతోఽ త్రాఽఽ నందితా: సదా భూయాసు:.

(ఈ నూత్న గృహమున మీరెల్లరు నెప్పుడు ఆనందము ననుభవింతురు గాక :)

సమాప్తము

-----------

# 15. వానప్రస్థ సంస్కారము

వివాహము చేసికొని గృహస్థాశ్రమ ధర్మములను నిర్వర్తించుచు పుత్రునిగని, అపుత్రుడుకూడ పూర్ణబ్రహ్మచర్యమును పాలించి వివాహితుడై పుత్రుని గని మీదట తాను వానప్రస్థుడు కావలయును. అనగా గృహము విడిచి గృహభారమును తన పుత్రునిపై వదలి తాను వనమునకేగి యట నియత జీవితమును నడుపదగును. అందులకు చేయు సంస్కారము వానప్రస్థ సంస్కారమనబడును.

ఇందు ప్రమాణములు :-

> బ్రహ్మచర్యాశ్రమం సమాప్య గృహీ భవేత్, గృహీ
> భూత్వా వనీ భవేత్, వనీ భూత్వా ప్ర వ్రజేత్, శతపథ
> బ్రాహ్మణే-జాబాలోపనిషత్ ఖండము4.

బ్రహ్మచర్యాశ్రమమును సమాప్తముచేసి గృహస్థుడు కావలయును. గృహస్థుడైవని-వానప్రస్థుడగును. వానప్రస్థుడై సంన్యాసమును గ్రహించుట మనుష్యున కుచితము.

> ఓం వ్రతేన దీక్షామాప్నోతి దీక్షయాప్నోతి దక్షిణామ్,
> దక్షిణా శ్రద్ధామాప్నోతి శ్రద్ధయా సత్యమాప్యతే. యజు. 19-30

బ్రహ్మచర్యము, సత్యభాషణము మున్నగు వ్రతములు - నియమములు గ్రహించి నపుడు, వ్రతేన = ఆవ్రతము వలన, దీక్షాం = ఉత్తమ ప్రతిష్ఠయనెడి దీక్షను, ఆప్నోతి = పొందును, దీక్షయా = బ్రహ్మచర్యాద్యాశ్రమ నియమములను పాలించుట మూలమున, దక్షిణాం = సత్కార పూర్వకమగు ధనాదులను, ఆప్నోతి = పొందును. దక్షిణా = ఆ సత్కారము వలన, శ్రద్ధాం = సత్యధారణమున ప్రీతిని, ఆప్నోతి = పొందును. శ్రద్ధయా = సత్యమునందు ధార్మిక జనులయందు ప్రీతికలుగుట వలన, సత్యమ్ = సత్యపదార్థముల విజ్ఞానము, ఆప్యతే = మనుష్యులకు లభించును.

> ఏవం గృహాశ్రమే స్థిత్వా విధివత్ స్నాతకో ద్విజః, వనే
> వసేత్తు నియతో యథావత్ విజితేంద్రియః. మ. 6-1-1

విధిపూర్వకముగా బ్రహ్మచర్యమున పూర్ణవిద్య నభ్యసించి సమావర్తనమున స్నానమాచరించిన ద్విజుడు-బ్రాహ్మణ, క్షత్రియ, వైశ్యుడు-జితేంద్రియుడు, జితాత్ముడునై గృహాశ్రమమును నిర్వహించి తదుపరి వనమున వసించునది.

గృహస్థస్తు యదా పశ్యేత్ వలీపలితమాత్మనః, అపత్య
స్యైవ చాపత్యం తదారణ్యం సమాశ్రయేత్. మను. 6-1-2

గృహస్థులు తమదేహములు శిథిలములై కేశములు తెల్లబడినపుడు, ఇంతలో తన పుత్రునకు పుత్రుడు కలిగిన, వనాశ్రమమును గ్రహింప వలయును.

(గ్రంథ విస్తరభీతిచే నితర వేదోపనిషత్తులయు స్మృతుల ప్రమాణములు విడిచి విధిమాత్రమిట వ్రాయబడుచున్నది. విశేషములు మూలమున చూడనగును)

సంస్కారవిధి:-

వానప్రస్థాశ్రమమును స్వీకరించు సమయము ఏబది (50) యేండ్లకు పైబడియుండును. తన పుత్రునకు పుత్రుడు కలిగిన తదుపరి తన భార్యకు, సోదరులకు, పుత్రునకు, కోడలికి గృహస్థ ధర్మములను బాగుగ బోధించి తాను వనమున కేగవలయును. భార్య తనతో రాదలచిన నామెను వెంటగొనిపోవచ్చును. లేకున్న జ్యేష్ఠపుత్రున కప్పగించి తగిన సేవజేయునట్లు బోధింపనగును. తన పుత్రాదులు ధర్మమార్గమున నడచునట్లు తన భార్య వారికి శిక్షణగఱప వలయుననియు నామెకు బోధింపనగును.

వనమున కేగదలచిన నాడు ప్రాతః కాలమున యజ్ఞవేదిక యందు యజ్ఞమునకు వలయు పాత్రలు, ఘృతము, సామగ్రి, ఆసనాదులు నన్నియు సమకూర్ప వలయును. తదుపరి ఆచమనాంగస్పర్శలు చేసి, ఈశ్వరస్తుతి ప్రార్థన ఉపాసన మంత్రములు, స్వస్తి, శాంతికరణ మంత్రములు పఠింపవలయును. ఆపైన "ఓం భూర్భువః స్వః" అని యగ్నిని వెలిగించి "ఓం భూర్... ... ...ద్యౌరివ" మంత్రముతో అగ్ని ఆధానము, సమిధాధానము, ప్రజ్వలనము, జలప్రసేచనము నన్నియు సామాన్య విధియందు జూపినట్లు చేయనగును.

తదుపరి - ఓం అగ్నయే స్వాహా - అను మంత్రములతో ఆఘారావాజ్యభాగాహుతులు 4, ఓం భూరగ్నయే స్వాహా - అను మంత్రములతో వ్యాహృతి ఆహుతులు 4, నేతితో నియ్యనగును. తదుపరి –

పూర్వమే సిద్ధపఱచి యుంచిన అన్నమున కొంచెము నేతిని కలిపి యా క్రింది మంత్రములతో నాహుతులిచ్చునది.

1) ఓం కాయ స్వాహా, 2)ఓం కస్మై స్వాహా, 3) ఓం కతమస్మై స్వాహా, 4) ఓం ఆధిమాధీతాయ స్వాహా, 5) ఓం మనః ప్రజాపతయే స్వాహా, 6) ఓం చిత్తం విజ్ఞాతాయాదిత్యై స్వాహా, 7) ఓం అదిత్యై మహ్యై స్వాహా, 8) ఓం అదిత్యై సుమృడీకాయై స్వాహా 9) ఓం సరస్వత్యై స్వాహా 10) ఓం సరస్వత్యై పావకాయై స్వాహా, 11) ఓం సరస్వత్యై బృహత్యై స్వాహా, 12) ఓం పూష్ణే స్వాహా, 13) ఓం పూష్ణే ప్రపథ్యాయ స్వాహా, 14) ఓం పూష్ణే నరంధిషాయ స్వాహా, 15) ఓం త్వష్ట్రే స్వాహా, 16) ఓం త్వష్ట్రే తురీయాయ స్వాహా, 17) ఓం త్వష్ట్రే పురురూపాయ స్వాహా, 18) ఓం భువనస్య పతయే స్వాహా, 19) ఓం అధిపతయే స్వాహా, 20) ఓం ప్రజాపతయే స్వాహా, యజు. 22-32.

21) ఓం ఆయుర్ యజ్ఞేన కల్పతాగ్ం స్వాహా
22) " ప్రాణో " " "
23) " అపానో " " "
24) " వ్యానో " " "
25) " ఉదానో " " "
26) " సమానో " " "
27) " చక్షుర్ " " "
28) " శ్రోత్రం " " "
29) " వాగ్ " " "
30) " మనో " " "
31) " ఆత్మా " " "
32) " బ్రహ్మ " " "
33) " జ్యోతిర్ " " "
34) " స్వర్ " " "
35) " పృష్ఠం " " "

36) " యజ్ఞో " " "
37) " ఏకస్మై స్వాహా " "
38) " ఓం ద్వాభ్యాం స్వాహా
39) " శతాయ "
40) " ఏకశతాయ "
41) " వ్యుష్ట్యై "
42) " స్వర్గాయ " యజు. 22-34.

ఈమంత్రములతో స్థాలీపాకాహుతులిచ్చి ఆపైన ఓం భూరగ్నయే స్వాహా. అను మంత్రములతో వ్యాహృతిఆహుతులు 4 నేతితోనిచ్చి మహావామదేవ్య సామగానము చేసి యజ్ఞము పూర్తిచేయనగును.

తదుపరి ఇష్ట మిత్రులతో కలిసి మాటలాడి, పుత్రునిపై గృహ భారమునుంచి, అగ్నిహోత్రమునకు వలయు సామాను తీసికొని వనమున నేకాంతమున నివసించి యోగాభ్యాసాదుల నొనర్చుచు శాస్త్రముల నవలోకింపనగును. మహాత్ముల సాంగత్యము చేయుచు స్వాత్మ పరమాత్మల సాక్షాత్కారము కొఱకు యత్నింపవలయును.

సమాప్తము

........................

# 16. సంన్యాస సంస్కారము

సంన్యాసమనగా మోహాది ఆవరణములను, పక్షపాతమును విడిచి, విరక్తుడై పరోపకారార్థము పృథివి యందంతట సంచరించుట.

సమ్యజ్ న్యస్యన్తి అధర్మాచరణాని యేన వా సమ్యజ్ నిత్యం సత్కర్మస్వాస్త ఉపవిశతి స్థిరీభవతి యేన స సంన్యాసః, సంన్యాసో విద్యతే యస్య స సంన్యాసీ.

కాలము :- వానప్రస్థ విషయమున ముందు వ్రాయబడినట్లు బ్రహ్మచర్యమును పూర్తికావించి, గృహస్థుడై, అనంతరము వానప్రస్థియై తరువాత సంన్యాసి యగుట క్రమసంన్యాసమగును. అటులకాక -

యదహరేవ విరజేత్ తదహరేవ ప్రవ్రజేత్
వనాద్వా గృహాద్వా.

అను బ్రాహ్మణ గ్రంథవాక్యముద్వారా - ఏరోజు విరక్తి కలుగునో యారోజే గృహస్థాశ్రమమునుండికాని వానప్రస్థాశ్రమమునుండి కాని సంన్యసింవ వచ్చును. ఎందుచేత ననగా సంన్యాసమునకు ముఖ్యమైనవి వైరాగ్యము, యథార్థజ్ఞానము. కనుక అవి కలుగగానే ఆశ్రమ నిమిత్తము లేకుండ సంన్యసింప వచ్చుననిరి. ఇది రెండవ పద్ధతి. మఱియు-

బ్రహ్మచర్యాదేవ ప్రవ్రజేత్ - అను బ్రాహ్మణ గ్రంథవాక్యము వలన అఖండ బ్రహ్మచర్యమునందే సత్యమైన వైరాగ్యము. పూర్ణమైన జ్ఞాన విజ్ఞానముల బొంది, ఆత్మనుండి విషయేచ్ఛ దూరమై పక్షపాతము లేక పరోపకార బుద్ధి మొదలైనవి దృఢముగా నేర్పడినపుడు, సంన్యాస ధర్మమును నిర్వహింప గలనను నిశ్చితబుద్ధి కలిగినపుడు బ్రహ్మచర్యము నుండియే సంన్యసింపవచ్చును. గృహస్థుడును, వానప్రస్థుడును కానావశ్యకము లేదు.

(1) ప్రమాణము:- ఓం శర్యణావతి సోమమింద్రః పిబతు వృత్రహా, బలం దధాన ఆత్మని కరిష్యన్ వీర్యం మహద్ ఇంద్రాయేందో పరిస్రవ.

(2) ఓం ఆపవస్వ దిశాం పత ఆర్జీకాత్ సోమ మీఢ్వః. ఋతవాకేన సత్యేన శ్రద్ధయా తపసా సుత ఇంద్రాయేందో పరిస్రవ

ఋ. 9-113-1,2.

(1) మంత్రార్థము-ఈశ్వరుడు సంన్యాసము స్వీకరించు మనుష్యునకు ఉపదేశించుచున్నాడు. మేఘనాశకుడగు సూర్యుడు హింసనీయ పదార్థములతో కూడిన భూతలస్థమైన రసమును త్రాగునట్లు సంన్యాసియైనవాడు ఉత్తమమైన ఫలములయొక్కయు, మూలికల యొక్కయు రసమును పానము చేయుగాక ! తన యాత్మలో మహత్ కార్యముల నిర్వహించు కోరికగలవాడై దివ్యబలసంయుతుడై పరమైశ్వర్యము కొఱకు, చంద్రునివలె నందఱను నానంద పఱచుటకు ప్రయత్నించుగాక ! ఓపూర్ణ విద్వాంసుడా ! నీవు సంన్యాసివై అందఱపై సత్యోపదేశ వృష్టిని వర్షింతువు గాక !

(2) ఓ సౌమ్యగుణ సంపన్నుడా ! అందఱి హృదయములను సత్యముతో తడుపుచున్నట్టియు, అంతటనున్న, మనుష్యులకు సత్యజ్ఞానమును కలిగించుచున్నట్టియు, శమాదిగుణ సంయుతుడవునైన సంన్యాసీ ! నీవు యథార్థమునే నమ్మి యథార్థమునే పల్కుచుండుటచే సత్యమునందు నిజమైన ప్రీతికలుగును. మఱియు ప్రాణాయామ యోగాభ్యాసముల వలన సునాయాసముగా శరీరము, ఇంద్రియములు, బుద్ధి పవిత్రములై పరమైశ్వర్యయుక్తుడవై పరమాత్మని కొఱకు నన్ని మార్గముల పయనింపగలవు.

ఓం భద్రమిచ్ఛన్త ఋషయః స్వర్విదస్తపో దీక్షాముప
నిషేదురగ్రే. తతో రాష్ట్రం బలమోజశ్చ జాతం తదస్మై
దేవా ఉపసంనమన్తు. అథర్వ, 19-కాం, 41సూ, 1మం.

అర్థము :- ఓ విద్వాంసులారా ! వేదార్థవిద్యలను, సుఖమును పొంది మొదటిదైన బ్రహ్మచర్యాశ్రమమును పూర్ణముగా నిర్వహించి స్థిరత్వమును పొంది శుభమును కాంక్షిచువారై సంన్యాసమును స్వీకరింపదలచినచో బ్రహ్మచర్యము నుండియే స్వీకరింపవచ్చును. అట్టివారికి విద్వాంసులు యథోచితముగా సత్కారము చేయుదురు. అనంతరము రాజ్యము, బలము, పరాక్రమము చేకూరును. అందువలన సంన్యాసాశ్రమమును స్వీకరించుటకు ప్రయత్నము చేయవలయును.

మనుస్మృతి :-

(1) యో దత్త్వా సర్వభూతేభ్యః ప్ర వ్రజత్యభయం
గృహాత్, తస్య తేజోమయా లోకా భవన్తి బ్రహ్మవాదినః.

(2) నాభినందేత మరణం నాభినందేత జీవితమ్,
కాలమేవ ప్రతీక్షేత నిర్దేశం భృతకో యథా.

(3) దృష్టిపూతం న్యసేత్ పాదం వస్త్రపూతం జలం పిబేత్,
సత్యపూతాం వదేద్ వాచం మనఃపూతం సమాచరేత్.

(4) ఇంద్రియాణాం నిరోధేన రాగద్వేషక్షయేణ చ,
అహింసయా చ భూతానాం అమృతత్వాయ కల్పతే.

(5) దహ్యన్తే ధ్మాయమానానాం ధాతూనాం హి యథామలాః,
తథేంద్రియాణాం దహ్యన్తే దోషాః ప్రాణస్యనిగ్రహాత్.

(6) యదా భావేన భవతి సర్వభావేషు నిఃస్పృహః,
తదా సుఖమవాప్నోతి ప్రేత్య చేహ చ శాశ్వతమ్.

(7) అనేన విధినా సర్వాన్ త్యక్త్వా సంగాన్ శనైః శనైః,
సర్వద్వంద్వ వినిర్ముక్తో బ్రహ్మణ్యేవావతిష్ఠతే.

(8) అనేన క్రమయోగేన పరివ్రజతి యో ద్విజః ,
స విధూయేహ పాప్మానం పరం బ్రహ్మాధిగచ్ఛతి.
మను. 6-39, 45, 46, 60, 71, 80, 81, 85.

అర్థములు :– (1) అన్ని ప్రాణుల కభయమిచ్చుచు, సత్యోపదేశముచేయుచు, గృహాశ్రమమునుండి సంన్యాసమును స్వీకరించి బ్రహ్మావాదియైనట్టి వేదోక్తరీతి సత్యోపదేశకుడగు సంన్యాసికి మోక్షమేకాక లోక లోకాంతరములన్నియు తేజోమయములగును.

(2) తన జీవనమం దానందము, తన మృత్యువు విషయములో దుఃఖమును తలంపక భృత్యుడు అధికారి యాజ్ఞను పరిపాలించుటకు నెదురు చూచుచున్నట్లు సంన్యాసి కాలము కొఱకు మృత్యువు కొఱకు నెదురుచూచుచుండవలయును.

(3) సంన్యాసియైనవాడు మార్గమున ముందు చూచుచు అడుగువేయవలయును. వస్త్రముతో వడపోసి నీరు త్రాగవలయును. అందఱితో సత్యమునే పలుకవలయును. ఏవ్యవహారమైనను పవిత్రమైన మనస్సుతో ఆచరింపవలయును.

(4) సంన్యాసి చెడ్డపనులనుండి ఇంద్రియముల నిరోధించి, రాగద్వేషాది దోషముల విసర్జించి, వైరభావము లేకుండ అందఱికి కల్యాణము చేయుచుండ వలయును. అట్టి సంన్యాసి మోక్షమును పొందును.

(5) అగ్నిలో కాల్చుటచేత లోహాదుల మాలిన్యము తొలగినట్లు, ప్రాణాయామముచేసినచో ఇంద్రియముల యందలి దోషములు నశించును.

(6) సంన్యాసి పదార్థము లన్నింటియందు నిఃస్పృహుడైనపుడు ఈ లోకములో, జన్మమరణానంతరము పరలోకమందు, ముక్తియందు పరమాత్మను పొంది యెడతెగని సుఖమును పొందును.

(7) ఈ విధముగా మెల్లమెల్లగా సంగసంబంధము వలన కలిగిన దోషముల విడిచి హర్షశోకాది ద్వంద్వ విముక్తుడై విద్వాంసుడైన సంన్యాసి బ్రహ్మయందే స్థిరుడగును.

(8) ఇట్టి సంన్యాస యోగముచే ద్విజుడైనవాడు సంన్యసించి యీ ప్రపంచమునందును, శరీరమునందున్న సర్వపాపముల కంటకుండనే బ్రహ్మమును పొందును.

గ్రంథ విస్తర భీతిచే, సంక్షిప్తము చేయబడినది.

సంస్కారవిధి :– సంన్యాసము గ్రహింపదలచిన వ్యక్తి సర్వథా ప్రసన్నుడై మూడు దినములు పాలుత్రాగి, భూమిపైపరుండి, ప్రాణాయామము, ధ్యానము, ఏకాంత దేశమున ఓంకార జపము చేయవలయును. సంన్యాసము స్వీకరింప దలచిన రోజున సభామంటపమున వేదిక నేర్పఱచి, సమిధలు, నేయి మొదలగునవి ముందే సమకూర్చు కొనవలయును. ప్రాతఃకాలముననే లేచి స్నానాదులొనర్చి ప్రాణాయామము, ధ్యానము, ప్రణవ జపముచేసి సూర్యోదయ సమయమున ఉత్తమ గృహస్థులు ధార్మికులు విద్వాంసులునైన ఋత్విక్కులను యథాస్థానముల గూర్చుండచేసి యజమానుడు – "ఓం అద్యబ్రహ్మణః" – మొదలగు వచనములతో పురోహితుని వరణము చేసి, ఈశ్వరస్తుతి ప్రార్థనో పాసన స్వస్తివాచన, శాంతి కరణ మంత్ర పఠనానంతరము-

'ఓం అమృతోప స్తరణమసి స్వాహా' మొదలగు వానితో ఆచమనము, ఓం వాఙ్మే ఆస్యే అస్తు' - మొదలగువానితో అంగస్పర్శ, 'ఓం భూర్భువఃస్వః - అని కర్పూరము

వెలిగించి, 'ఓం భూర్భువః స్వః ద్యౌరివ' - అను మంత్రమును పఠించి కర్పూరముతో కూడిన అగ్నిని హోమకుండమున ఉంచి, 'ఓం ఉద్బుధ్యస్వాగ్నే' - అను మంత్రముతో అగ్నిని నేతితో ప్రజ్వలింపజేసి, 'ఓం అయన్త ఇధ్మ' - అను మంత్రములతో 3 సమిధలను నేతిలో ముంచి అగ్నికుండమున వేసి, "ఓం అయన్త ఇధ్మ" - అను మంత్రమును 5 సార్లు పఠించి 5 నేతి ఆహుతులిచ్చి, కుండము చుట్టును, "ఓం అదితేఽను మన్యస్వ" - మొదలగు వానితో నీరుపోసి, "ఓం అగ్నయే స్వాహా - మొదలగు మంత్రములతో 4 అఘారావాజ్య భాగాహుతులు, "ఓం భూగర్నయే స్వాహా" మొదలగు మంత్రములతో 4 వ్యాహృతులు ఇచ్చి -

(1) ఓం భువన పతయే స్వాహా-(2)ఓం భూతానాంపతయే స్వాహా యజు. 2-2. (3) ఓం ప్రజాపతయే స్వాహా,

అను మంత్రములతో మూడు ఆహుతులు ఈయవలయును. ఇంతకు ముందే తయారు చేయబడియున్న అన్నములో నెయ్యివేసి, సంన్యాసము, స్వీకరింప దలచిన వ్యక్తియు, ఇద్దఱు ఋత్విక్కులు ఆయన్నముతో క్రింది మంత్రములు పఠించుచు స్వాహా యని ఆహుతులీయవలయును.

1. ఓం బ్రహ్మ హోతా బ్రహ్మయజ్ఞో బ్రహ్మణా స్వరవో మితాః, అధ్వర్యుః బ్రహ్మణో జాతో బ్రహ్మణోఽన్తర్హితం హవిః స్వాహా.
2. ఓం బ్రహ్మ స్రుచో ఘృతవతీర్బ్రహ్మణా వేదిరుద్ధితా, బ్రహ్మ యజ్ఞశ్చ సత్రం చ ఋత్విజో యే హవిష్కృతః, శమితాయ స్వాహా.
3. ఓం అంహోముచే ప్రభరే మనీషామాసుత్రామ్ణే సుమతి మావృణానః, ఇదమింద్ర ప్రతి హవ్యం గృభాయ సత్యా స్సన్తు యజమానస్య కామాః స్వాహా.
4. ఓం అంహోముచం వృషభం యజ్ఞియానాం విరాజన్తం ప్రథమమధ్వరాణామ్, అపాం నపాతమశ్వినా హువే ధియేంద్రేణ మ ఇంద్రియం దత్తమోజః స్వాహా.
అథర్వ. 10-42-1 నుండి 4.

5. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
అగ్నిర్మా తత్ర నయత్వగ్ని ర్మేధాం దధాతు మే,
అగ్నయే స్వాహా - ఇదమగ్నయ ఇదం న మమ.

6. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
వాయుర్మా తత్ర నయతు వాయుః ప్రాణాన్ దధాతు మే,
వాయవే స్వాహా - ఇదం వాయవ ఇదం న మమ.

7. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
సూర్యో మా తత్ర నయతు చక్షుస్సూర్యో దధాతు మే,
సూర్యాయ స్వాహా - ఇదం సూర్యాయ ఇదం న మమ.

8. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
చంద్రో మా తత్ర నయతు మనశ్చంద్రో దధాతు మే,
చంద్రాయ స్వాహా - ఇదం చంద్రాయ ఇదం న మమ.

9. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
సోమో మా తత్ర నయతు పయః సోమో దధాతు మే,
సోమాయ స్వాహా - ఇదం సోమాయ ఇదం న మమ.

10. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
ఇంద్రో మా తత్ర నయతు బలమింద్రో దధాతు మే,
ఇంద్రాయ స్వాహా - ఇదం ఇంద్రాయ ఇదం న మమ.

11. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
అపో మా తత్ర నయంత్వమృతం మోపతిష్ఠతు అద్భ్యః
స్వాహా - ఇదమద్భ్యః ఇదం న మమ.

12. ఓం యత్ర బ్రహ్మవిదో యాన్తి దీక్షయా తపసా సహ,
బ్రహ్మ మా తత్ర నయతు బ్రహ్మ బ్రహ్మ దధాతు మే,
బ్రహ్మణే స్వాహా - ఇదం బ్రహ్మణే ఇదం న మమ.
అథర్వ. కాం. 19-సూ. 43.

1. ఓం ప్రాణాపాన వ్యానోదాన సమానా మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా.
2. ఓం వాఙ్మనశ్చక్షుః శ్రోత్రజిహ్వాఘ్రాణరేతో బుద్ధ్యాకూతి సంకల్పా మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా.
3. ఓం శిరః పాణిపాదపార్శ్వ పృష్ఠోరూదర జంఘాశిశ్నో పస్థపాయవో మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం....స్వాహా.
4. ఓం త్వక్ చర్మమాగ్ంసరుధిరమేదో మజ్జాస్నాయవో స్థీని మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం ....స్వాహా.
5. ఓం శబ్దస్పర్శరూపరసగంధా మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం... స్వాహా.
6. ఓం పృథివ్యప్తేజో వాయ్వాకాశా మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం.....స్వాహా.
7. ఓం అన్నమయ ప్రాణమయ మనోమయ విజ్ఞానమయా నందమయా మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం....స్వాహా.
8. ఓం వివిష్ట్యై స్వాహా.
9. ఓం కషోత్కాయ స్వాహా.
10. ఓం ఉత్తిష్ఠ పురుష హరిత లోహిత పిఙ్గలాక్షి దేహిదేహి దదాపయితా మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం...స్వాహా.
11. ఓం స్వాహా మనో వాక్కాయకర్మాణి మే శుద్ధ్యన్తామ్, జ్యోతిరహం...స్వాహా.
12. ఓం అవ్యక్తభావై రహంకారైః జ్యోతిరహం విరజా విపాప్మా భూయాసగ్ం స్వాహా.
13. ఓం ఆత్మా మే శుద్ధ్యతామ్, జ్యోతిరహం....స్వాహా

14. ఓం అన్తరాత్మా మే శుద్ధ్యతామ్, జ్యోతిరహం..... స్వాహా
15. ఓం పరమాత్మా మే శుద్ధ్యతామ్, జ్యోతిరహం..... స్వాహా

తై, ఆరణ్యకము.

పై పదునైదు మంత్రములతో అన్నాహుతు లీవలయును. క్రింది ముప్పదియైదు మంత్రములతో నేతితో ఆహుతులీవలయును.

1) ఓమగ్నయే స్వాహా, 2) ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా 3) ఓం ధ్రువాయ భూమాయ స్వాహా 4) ఓం ధ్రువక్షితయే స్వాహా 5) ఓమచ్యుతక్షితయే స్వాహా 6) ఓమగ్నయే స్విష్టకృతే స్వాహా 7) ఓం ధర్మాయ స్వాహా 8) ఓమధర్మాయ స్వాహా 9) ఓమద్భ్యః స్వాహా 10) ఓమోషధి వనస్పతిభ్యః స్వాహా 11) ఓం రక్షో దేవజనేభ్యః స్వాహా 12) ఓం గృహ్యేభ్యః స్వాహా 13) ఓమవసానేభ్యః స్వాహా 14) ఓమవసాన పతిభ్యః స్వాహా 15) ఓం సర్వభూతేభ్యః స్వాహా 16) ఓం కామాయ స్వాహా 17) ఓమన్తరిక్షాయ స్వాహా 18) ఓం పృథివై స్వాహా 19) ఓం దివే స్వాహా 20) ఓం సూర్యాయ స్వాహా 21) ఓం చంద్రమసే స్వాహా 22) ఓం నక్షత్రేభ్యః స్వాహా 23) ఓమింద్రాయ స్వాహా 24) ఓం బృహస్పతయే స్వాహా 25) ఓం ప్రజాపతయే స్వాహా 26) ఓం బ్రహ్మణే స్వాహా 27) ఓం దేవేభ్యః స్వాహా 28) ఓం పరమేష్ఠినే స్వాహా 29) ఓం తద్ బ్రహ్మ 30) ఓం తద్వాయుః 31) ఓం తదాత్మా 32) ఓం తత్సత్యమ్ 33) ఓం తత్సర్వమ్ 34) ఓం తత్పురోర్నమః 35) ఓమన్తశ్చరతి భూతేషు గుహాయాం విశ్వమూర్తిషు. త్వం యజ్ఞస్త్వంవషట్కార స్త్వం ఇన్ద్రస్త్వగ్ం రుద్రస్త్వం విష్ణుస్త్వంబ్రహ్మ త్వం ప్రజాపతిః, త్వం తదాప ఆపో జ్యోతిరసోఽమృతం బ్రహ్మ భూర్భువః స్వరోం స్వాహా.

తైత్తి. అర. 10 ప్ర. 51. అను.

ఆజ్యాహుతు లిచ్చిన తరువాత సంన్యాసము స్వీకరించువాడు 5,6 వెంద్రుకలు విడిచి కేశములు, గడ్డము, మీసములు మొదలగువానిని క్షౌరము చేయించి స్నానము చేయవలయును.

తరువాత ఋ. 10-90, సామ, అర 4, అథర్వ. 19-6, యజు. 31 అ.తై.అ 3-12.లలో పురుషసూక్త మనుపేరుతో నున్న మంత్రములతో 108 పర్యాయములు

తన శిరస్సుపై అభిషేకము చేయవలయును. "ఓం అమృతోపస్తరణమసి స్వాహా"
అను మంత్రములతో ఆచమనము, ప్రాణాయామముచేసి చేతులుజోడించి వేదిక
దగ్గఱ నిలబడి, నేత్రము తెఱచి, మనస్సులో -

1) ఓం బ్రహ్మణే నమః, 2) ఓ మింద్రాయ నమః 3) ఓం సూర్యాయ నమః
4) ఓం సోమాయ నమః, 5) ఓమాత్మనే నమః 6) ఓమన్తరాత్మనే నమః

అని జపించి -

1) ఓమాత్మనే స్వాహా 2) ఓమన్తరాత్మనే స్వాహా 3) ఓం పరమాత్మనే
స్వాహా 4) ఓం ప్రజాపతయే స్వాహా

అనుచు 4 ఆజ్యాహుతు లీయవలయును. తరువాత సంన్యాసస్వీకర్త
మధుపర్కమును చేతిలోనికి దీసికొని, "ఓం మిత్రస్య త్వా చక్షుషా ప్రతీక్షే మొదలగు
మంత్రములతో మధుపర్కవిధిని నిర్వహింప వలయును. తదుపరి ప్రాణాయామము
చేసి, క్రింది మంత్రములను మనస్సులో జపింప వలయును.

(1) ఓం భూః సావిత్రీం ప్రవిశామి తత్సవితుర్వరేణ్యమ్
ఓం భువః సావిత్రీం ప్రవిశామి భర్గో దేవస్య ధీమహి,
ఓం స్వః సావిత్రీం ప్రవిశామి ధియో యో నః ప్రచోదయాత్,

(2) ఓం భూర్భువఃస్వః సావిత్రీం ప్రవిశామి తత్సవితుర్వరేణ్యాం
భర్గో దేవస్య ధీమహి ధియో యో నః ప్రచోదయాత్,

క్రింది మంత్రములతో హోమకుండమున ఆజ్యాహుతు లీయవలయును.

1) ఓమగ్నయే స్వాహా 2) ఓం భూః ప్రజాపతయే స్వాహా 3) ఓమింద్రాయ
స్వాహా 4) ఓం ప్రజాపతయే స్వాహా 5) ఓం విశ్వేభ్యో దేవేభ్యః స్వాహా 6)
ఓం బ్రహ్మణే స్వాహా 7) ఓం ప్రాణాయ స్వాహా 8) ఓమపానాయ స్వాహా
9) ఓం వ్యానాయ స్వాహా 10) ఓముదానాయ స్వాహా 11) ఓం సమానాయ
స్వాహా.

క్రింది మంత్రముతో పూర్ణాహుతి యీయవలయును.

"ఓం భూః స్వాహా" - తరువాత నీ క్రింది వాక్యము పలుకుచు నీటిని
భూమిమీద విడువవలయును.

1) పుత్రైషణాయాశ్చ విత్తైషణాయాశ్చ లోకైషణాయాశ్చ
ఉత్థాయ అథ భిక్షాచర్యం చర న్తి. శత 14-6-4-1.

2) పుత్రైషణా విత్తైషణా లోకైషణా మయా పరిత్యక్తా
మత్తః సర్వభూతేభ్యః అభయమస్తు స్వాహా –

తరువాత బొడ్డులోతున్న నీటిలో తూర్పు ముఖముగా నిలబడి ఓం భూః సావిత్రీం అను మంత్రములను మనస్సులో జపించుచు పరమాత్మను ధ్యానింప వలయును. పుత్రైషణాయాశ్చ - అను వాక్యములు పలికి, క్రింది మంత్రమును మనస్సులో నుచ్చరింప వలయును.

ఓం భూః సంన్యస్తం మయా, ఓం భువఃసంన్యస్తం మయా,
ఓం స్వః సంన్యస్తం మయా.

తదుపరి దోసిలిలో నీరుంచుకొని తూర్పుగా తిరిగి నిలబడి –

ఓమభయం సర్వభూతేభ్యః మత్తః స్వాహా,

అనుచు దోసిలిలో నీటిని తూర్పు దిక్కున విడువ వలయును .

అనంతరము–

ఓం యేన సహస్రం వహసి యేనాగ్నే సర్వవేదసమ్,
తేనేమం యజ్ఞం నో వహ స్వర్దేవేషు గన్తవే -
అథ. 9. కాం 5. సూ. 17, మం.

మంత్రమున కర్థము :- ఓ విద్వాంసుడా ! ప్రపంచమునంతటిని అగ్నిధారణచేయుచున్నది, మఱియు నీవు గృహాశ్రమస్థ పదార్థములందు మోహము, యజ్ఞోపవీతము, శిఖాదులను ధరించిన వానినన్నింటిని విడిచితివి, విడుచుటచేత మనకు ఈ సంన్యాసరూప సుఖము నిచ్చునట్టిది యగు యజ్ఞము విద్వాంసుల సమీపించిన కలుగును. ఈ భావమునే బలపఱచు మనుస్మృతి శ్లోకమును పరికింపుడు.

ప్రాజాపత్యాం నిరూప్యేష్టిం సర్వవేద సదక్షిణామ్,
ఆత్మన్యగ్నీన్ సమారోప్య బ్రాహ్మణః ప్రవ్రజేత్ గృహాత్.
మను. 6-38

అర్థము :- పరమాత్మను పొందుటకై కోరుచు ప్రాజాపత్యేష్టి (అనగా యజ్ఞమునేసి యజ్ఞోపవీతము, శిఖలను పరిత్యజించుమన్నది) చేసి, ఆహవనీయము, గార్హపత్యము, దాక్షిణాత్యము అను పేర్లుగల అగ్నులను తనయందే నిల్పుకొని బ్రాహ్మణుడు విద్వాంసుడు నైనవాడు గృహస్థాశ్రమము నుండియే సంన్యాసము తీసికొన వచ్చును. తరువాత మౌనముగా క్షౌరకర్మ చేయునపుడు విడిచిన 5,6 వెంట్రుకల నొక్కొక్కటి మెల్లగా పెరికి, యజ్ఞోపవీతముతీసి చేతితో పట్టుకొని, దోసిలిలో నీరు నింపి—

ఓమాపో వై సర్వా దేవతాః స్వాహా - ఓం భూః స్వాహా.

అని వెంట్రుకలు, యజ్ఞోపవీతముతో కూడిన దోసిలి యందలి నీటిని జలములో విడువ వలయును. తరువాత ఆచార్యుడు శిష్యుని మొలలోతు జలమునుండి బయటకు తీసికొని వచ్చి కాషాయరంగుగల గోచి, మొలకు చుట్టుకొను వస్త్రము పైన వేసికొను వస్త్రము (అంగవస్త్రము) ప్రీతితో నీయవలెను.

ఓం యో మే దండః పరాపతద్వైహాయసోఽధి భూమ్యామ్,
తమహం పునరాదద ఆయుషే బ్రహ్మణే బ్రహ్మవర్చసాయ.

అను మంత్రమును పఠించి దండము ధరించి ఆత్మయందు ఆహవనీయాది అగ్నులను ఆరోపించుకొని గృహమునుండి వెడల వలయును. గ్రంథ విస్తర భీతిచే సంక్షిప్తము చేయబడినది.

సమాప్తము

………………

# అంత్యేష్టి - సంస్కారము

ఓ3మ్

- అథ అంత్యేష్టి విధిం వక్ష్యామః -

- తదుపరి అంత్యేష్టివిధిని చెప్పుచున్నాము -

శరీరము యొక్క యంతిమ సంస్కారము అన్త్యేష్టి యనబడును. దీని తరువాత శరీరమునకు మఱియొక సంస్కారము లేదు. దీనిని నరమేథము, పురుషమేథము, నరయాగము, పురుష యాగము, అనియు నందురు.

"భస్మాంతగ్ం శరీరమ్" యజు. 40-అ-15.
నిషేకాది శ్మశానాంతో మంత్రైర్ యస్యోదితో విధిః. మను. 2,16.

ఈ శరీరమునకు అంతిమ సంస్కారము భస్మము చేయుటయే.

ఈ శరీరమునకు మొదటి సంస్కారము ఋతుదానము - గర్భాధానము, చివరి సంస్కారము శ్మశానము - భస్మము చేయుట. అని మంత్రములచే చెప్పబడిన విధి.

ప్రశ్న :- గరుడ పురాణాదులందు వ్రాయబడిన దశగాత్రము, ఏకాదశాహములు, ద్వాదశాహములు, సపిండీకర్మ, మాసిక, వార్షిక, గయాశ్రాద్ధాది క్రియలు అన్నియు అసత్యములా?

ఉత్త :- అవును, అసత్యములే. ఏలయన వేదములం దీ కర్మల విధానము లేదు. కావున నివి చేయరాదు. చనిపోయిన జీవునకు పూర్వబంధువులతోగాని జీవించియున్న బంధువులతో కాని యతనికి నెట్టి సంబంధము నుండదు. ఆజీవుడు తనకర్మల ననుసరించి మఱియొక జన్మము బొందును.

ప్రశ్న :- మరణించిన తరువాత జీవుడెక్కడకు బోవును ?

ఉత్త :- యమాలయమునకు.

ప్రశ్న :- యమాలయ మని దేని నందురు ?

ఉత్త :- వాయు వాలయమును.

ప్రశ్న :- వాయు వాలయ మెయ్యది ?

ఉత్త :- అంతరిక్షము. ఈ కనబడు బయలు.

ప్రశ్న :- గరుడ పురాణమున వ్రాసిన యమలోకము అబద్ధమా ?

ఉత్త :- అవును.

ప్రశ్న :- అటులయిన నెల్లరు నేల యంగీకరించుచున్నారు. ?

ఉత్త :- వేదము నెఱుగరు. వారికి నుపదేశించువారు లేనందున. పురాణమున వ్రాయబడిన యముని కథ యంతయు నసత్యము. కారణమేమన యమశబ్దమున కిన్ని యర్థములున్నవి చూడుడు.

1) షళిద్ యమా ఋషయో దేవజా ఇతి. ఋ. 1-164-15.
2) శకేమ వాజినో యమమ్. ఋ. 2-5-1.
3) యమాయ జుహుతా హవిః, యమం హ యజ్ఞో గచ్ఛ త్యగ్నిదూతో అరంకృతః. ఋ. 10-14-13.
4) యమః సూయమానో విష్ణుః, సంభ్రియమాణో వాయుః పూయమానః. యజు. 8-57.
5) వాజినం యమమ్. ఋ. 8-24-22.
6) యమం మాతరిశ్వాన మాహుః. ఋ. 1-164-46.

అర్థములు :-

1) ఋతువులకు యముడని పేరు.
2) పరమేశ్వరుడు యముడు.
3) ఈ మంత్రమున అగ్నికి యముడని పేరు.
4) ఇందు యముడన వాయువు, విద్యుత్తు, సూర్యుడును.
5) వేగముగల వాడగుట వలన వాయువు యముడు.
6) పరమేశ్వరుడు యముడు.

ఇట్టి పదార్థములకు వేదమున యముడని పేర్లు. కావున పురాణములలోని కల్పన యసత్యమే.

# అంత్యేష్టి విధి

1) విధి - సంస్థితే భూమిభాగం ఖానయేద్ దక్షిణ పూర్వస్యాం దిశి, దక్షిణాపరస్యాం వా.
2) దక్షిణా ప్రవణం, ప్రాగ్దక్షిణా ప్రవణం వా, ప్రత్యగ్ దక్షిణా ప్రవణ మిత్యేకే.
3) యావానుద్బాహుకః పురుషస్తావ దాయామమ్ (వ్యామమాత్రంతిర్యక్)
4) వితస్త్యర్వాక్
5) కేశశ్మశ్రు లోమ నఖానీత్యుక్తం పురస్తాత్.
6) ద్విగుల్ఫం బర్హిరాజ్యం చ.
7) దధన్యత్ర సర్పిరానయం త్యేతత్ పిత్ర్యం పృషదాజ్యమ్
8) అథైతాం దిశమగ్నీన్ నయన్తి యజ్ఞపాత్రాణి చ.
   ఆ.గృ. 4-1-6 నుండి 10,15,16,17.

ఒకవ్యక్తి మరణించి నపుడతడు పురుషుడైనచో పురుషులు, స్త్రీ యైన స్త్రీలును ఆశవమునకు స్నానము చేయింపవలయును. తదుపరి మంచి గంధము మున్నగు సుగంధ ద్రవ్యముల నాశరీరమునకు పూసి, నూతన వస్త్రమును ధరింప జేయవలయును. ధనవంతులైనచో శరీరభారమునకు మించి కూడ నేయి వాడవచ్చును. చనిపోయిన వ్యక్తి మిక్కిలి దరిద్రుడో, భిక్షుకుడో యయినచో - శ్రీమంతుడో, యితరులు పలువురు కలిసియో అర్ధమణుగునకు తక్కువ లేకుండ నేయి సంపాదింప వలయును. శ్రీమంతులు శవమెంత బరువుండునో యంతబరువు చందనపు కట్టెలు సంపాదింపనగును. ఒక్కసేరు నేతిలో ఒక "రతి" కస్తూరి, ఒక మాషపు బెత్తు కుంకుమ పువ్వు చొప్పున కలుపవలయును. మణుగున కొక్కసేరు వంతున అగరు, తగరు, చందనచూర్ణము, యథాశక్తి కర్పూరము ఆ నేతిలో కలుపవలయును. తగినన్ని కట్టెలు, శరీరభారమునకు రెట్టింపు సామగ్రి, అంతయు శ్మశానమునకు ముందే చేర్పవలయును. తరువాత శవమును గొనిపో వలయును.

శ్మశానమున బూర్వమే వేదిక సిద్ధముచేసి యుంచిన దానిపైన గాని, లేనిచో క్రొత్తగా భూమిని త్రవ్వి వేదిక సిద్ధముచేసి దానిపైన శవము నుంచవలయును.

శ్మశాన స్థానము బస్తీకి దక్షిణ దిశయందో, ఆగ్నేయ నైఋతి కోణములందో యుండవలయును. శవము పాదము దక్షిణమునకో లేక ఆగ్నేయ నైఋతి కోణముల నైపునకో యుంచవలయును. శిరస్సు ఉత్తర, ఈశాన్య దిశల నైపునకో, వాయవ్య కోణము నైపునకో యుంచవలయును. (1)

శవము తల వేదికమీద కొంచె మెత్తుగాను, పాదములు కొంచెము తలకంటె తక్కువ యెత్తుగాను నుంచవలయును. (2)

వేదిక పరిమాణము – పురుషుడు నిలబడి చేతులు పైకెత్తిన నెంత కొలతయుండునో యంత పొడవుండవలయును. మనుజుని బార యెంత కొలతయుండునో యంత వెడల్పు వేదిక పై భాగముండవలయును. మనుజుని బొమ్మబెత్తు లోతు ఉండవలయును. వేదిక యిట్టి కొలతలు గలిగి యుండునట్లు త్రవ్వవలయును. (3)

వేదిక క్రింది కొలత వెడల్పు (1/2 గజము), పొడవు పైభాగమంతయుండనగును. (4)

తరువాత శవమునకు క్షౌరము చేయింప వలయును. తలవెంద్రుకలు, గడ్డము, మీసములు, గొరిగింప వలయును. (5)

శరీరభారమునకు సమానమైన బరువుగల నేయి, ఇతర సుగంధాది పదార్థములు యథాశక్తి సంపాదించి వానిని శుద్ధముచేసి యుంచవలయును. కనీసము ఇరువది సేర్ల ఘృతము నుపయోగింప వలయును. (6)

పెరుగులో నేయి కలిపిన నది పితృ్యపృషదాజ్య మనబడును. (7)

తరువాత శవమును చితిపైనుంచి అగ్నిని రగుల్ప జేయునది. చనిపోయిన వ్యక్తి అగ్నిహోత్రి యగు నెడల యజ్ఞపాత్రలను సూత్రమున జెప్పిన రీతిని ఆయా అంగములపై (శవము యొక్క) ఉంచవలయును. (8)

చితి పేర్చవలసిన వేదిక క్రింది భాగమును, లోపలి భాగములును గోమయముతో నలుకవలయును. లేక కొంచెము నీరు చల్లి తడుపవలయును. అ

వేదిక యందు క్రిందినుంచి సగభాగము వఱకు కట్టెలను పేర్చవలయును. ఆ కట్టెలకు మధ్య మధ్య అక్కడక్కడ కర్పూరము నుంచవలయును. చితికి నలువైపుల వేదికలో ఖాళీయుండవలయును. శవము పైన మరల మిగిలిన గంధపు చెక్కలు మున్నగు కట్టెలను పేర్చవలయును. వేదికపైన నొక జేనెడు ఎత్తువఱకు కట్టెలు పేర్చవలయును.

ఇంతలో వేఱుగా నొకచోట అగ్నిని రగుల్పజేసి నేతిని కరగబెట్టి శుద్ధముచేసి వేఱుపాత్రలలో నుంచునది. దానిలో కర్పూరము మున్నగు సుగంధ ద్రవ్యములను కలుపునది. పొడవైన కఱ్ఱలకు నాలుగు గరిటెలు సువర్ణాది ధాతువులతో చేయబడినవి కాని, కొయ్యవికాని గట్టిగా కట్టియుంచవలయును. ఆ గరిటలలో అర్ధ చటాకుకు తక్కువ గాకుండ (ఒక చటాకుకు 5 తులములు) ఎక్కువ ఘృతము పట్టవలయును. తదుపరి నేతితో దీపము వెలిగించి దానితో శవము శిరస్సుదగ్గఱ నుంచిన కర్పూరమును వెలిగించి అగ్నిని రగుల్ప జేయునది. ఇట్లు అగ్నిని రగుల్పజేసి–

(1) ఓమ్ అగ్నయే స్వాహా (2) ఓమ్ సోమాయ స్వాహా
(3) ఓమ్ లోకాయ స్వాహా (4) ఓమ్ అనుమయతయే స్వాహా
(5) ఓమ్ స్వర్గాయ లోకాయ స్వాహా - ఆ.గృ. 4-3-25, 26.

ఈ యైదు మంత్రములతో నైదు నేతితో నాహుతులు వేసి అగ్నిని ప్రజ్వలింప జేయునది. తదుపరి నలుగురు మనుష్యులు చితికి చుట్టును నాలుగు ప్రదేశములందు దూరదూరముగ నిలబడి యీ క్రింది వేదమంత్రములతో నాహుతుల నిచ్చుచుండ వలయును. స్వాహా యనినపుడు ఆహుతి నియ్యవలయును.

### (వేదమంత్రములు)

1. ఓం సూర్యం చక్షుర్ గచ్ఛతు, వాతమాత్మా ద్యాం చ
గచ్ఛ, పృథివీం చ ధర్మణా, ఆపోవా గచ్ఛ, యది తత్ర
తే హిత మోషధీషు ప్రతితిష్ఠా శరీరైః స్వాహా.

2. ఓం అజో భాగస్తపసా, తంతపస్వ, తంతే శోచిస్తపతు
తం తే అర్చిః, యాస్తే శివా స్తన్వో జాతవేదస్తాభిర్
వహైనం సుకృతాములోకం స్వాహా

3. ఓం అవసృజ పునరగ్నే పితృభ్యో యస్త ఆహుత శ్చరతి స్వధాభిః, ఆయుర్వసాన ఉపవేతు శేషః సంగచ్ఛతాం తన్వా జాతవేదః స్వాహా.

4. ఓం అగ్నే ర్వర్మ పరిగోభిర్ వ్యయస్వ సంప్రోర్ణుష్వ పీవసా మేదసా చ, నేత్వా ధృష్ణుర్హరసా జర్ హృషాణో దధృగ్ విధక్ష్యన్ పర్యంఖయాతే స్వాహా.

5. ఓం యం త్వమగ్నే సమదహస్తము నిర్వాపయా పునః కియామ్బ్వత్ర రోహతు పాకదూర్వా వ్యల్కశా స్వాహా- ఋ. మం. 10- సూ. 16, మం. 3,4,5,7,13.

6. ఓం పరేయివాంసం ప్రవతో మహీరను బహుభ్యః పంథామనుపస్పశానమ్, వైవస్వతం సంగమనం జనానాం యమం రాజానం హవిషా దువస్వ స్వాహా.

7. ఓం యమో నో గాతుం ప్రథమో వివేద
నైషా గవ్యూతి రపభర్త వాఉ,
యత్రా నః పూర్వే పితరః పరేయు రేనా
జజ్ఞానాః పథ్యా అనుస్వాః స్వాహా.

8. ఓం మాతలీ కవ్యైర్ యమో అఙ్గిరోభిర్
బృహస్పతిర్ ఋక్వభిర్ వావృధానః,
యాంశ్చ దేవా వావృధుర్ యే చ దేవాన్
త్స్వాహాన్యే స్వధయాన్యే మదన్తి స్వాహా.

9. ఓం ఇమం యమ ప్రస్తరమా హి సీదాం
గిరోభిః పితృభిః సంవిదానః,
ఆత్వా మంత్రాః కవిశస్తా వహం త్వేనా
రాజన్ హవిషా మాదయస్వ స్వాహా.

10. ఓం అంగిరోభి రాగహి యజ్ఞి యేభిర్
యమ వై రూపైరిహ మాదయస్వ,
వివస్వంతం హువే యః పితా తేऽస్మిన్
యజ్ఞే బర్హిష్యా విషద్య స్వాహా.

11. ఓం ప్రేహి ప్రేహి పథిభిః పూర్వ్యేభిర్
యత్రా నః పూర్వే పితరః పరేయుః,
ఉభా రాజానా స్వధయా మదన్తా
యమం పశ్యాసి వరుణం చ దేవం స్వాహా.

12. ఓం సంగచ్ఛస్వ పితృభిః సంయమే
నేష్టాపూర్తేన పరమే వ్యోమన్,
హిత్వా యావద్యం పునరస్తమేహి
సంగచ్ఛ స్వ తన్వా సువర్చాః స్వాహా.

13. ఓం అపేత వీత విచ సర్పతాతోऽస్మా
ఏతం పితరో లోక మక్రన్
అహోభిరద్భి రక్తుభిర్ వ్యక్తం
యమో దదా త్యవసాన మస్మై స్వాహా

14. ఓం యమాయ సోమం సునుత యమాయ జుహుతాహవిః,
యమం హ యజ్ఞోగచ్ఛత్యగ్ని దూతో అరంకృతః స్వాహా.

15. ఓం యమాయ ఘృతవద్ధవిర్ జుహోత ప్రచ తిష్ఠత,
స నో దేవేష్వాయవద్దీర్ఘ మాయుః ప్రజీవసే స్వాహా.

16. ఓం యమాయ మధుమత్తమం రాజ్ఞే హవ్యం జుహోతన,
ఇదం నమ ఋషిభ్యః పూర్వజేభ్యః పూర్వేభ్యః
పథికృద్భ్యః స్వాహా. ఋ. 10-14.

17. ఓం కృష్ణః శ్వేతోऽరుషో యామో అస్య బ్రధ్న ఋజ్ర
ఉతశోణో యశస్వాన్, హిరణ్యరూపం జనితా జజాన
స్వాహా. ఋ. మం. 10-20-9.

ఋగ్వేద మంత్రములతో నలుగురు మనుష్యులు (17) పదునేడు నేతి ఆహుతుల నిచ్చి, యీ క్రింది మంత్రములతో గూడ నట్లే ఘృతాహుతుల నీయవలయును.

| | | | |
|---|---|---|---|
| 1) | ప్రాణేభ్యః సాధిపతికేభ్యః స్వాహా | 2) | పృథివ్యై స్వాహా |
| 3) | అగ్నయే ,, | 4) | అంతరిక్షాయ ,, |
| 5) | వాయవే ,, | 6) | దివే ,, |
| 7) | సూర్యాయ స్వాహా ,, | 8) | దిగ్భ్యః ,, |
| 9) | చంద్రాయ స్వాహా ,, | 10) | నక్షత్రేభ్యః ,, |
| 11) | అద్భ్యః స్వాహా ,, | 12) | వరుణాయ ,, |
| 13) | నాభ్యై స్వాహా ,, | 14) | పూతాయ ,, |
| 15) | వాచే ,, | 16) | ప్రాణాయ ,, |
| 17) | ప్రాణాయ ,, | 18) | చక్షుషే ,, |
| 19) | చక్షుషే ,, | 20) | శ్రోత్రాయ ,, |
| 21) | శ్రోత్రాయ ,, | 22) | లోమభ్యః ,, |
| 23) | లోమభ్యః ,, | 24) | త్వచే ,, |
| 25) | త్వచే ,, | 26) | లోహితాయ ,, |
| 27) | లోహితాయ ,, | 28) | మేదోభ్యః ,, |
| 29) | మేదోభ్యః ,, | 30) | మాగ్ంసేభ్యః ,, |
| 31) | మాగ్ంసేభ్యః ,, | 32) | స్నావభ్యః ,, |
| 33) | స్నావభ్యః ,, | 34) | అస్థభ్యః ,, |
| 35) | అస్థభ్యః ,, | 36) | మజ్జభ్యః ,, |
| 37) | మజ్జభ్యః ,, | 38) | రేతసే ,, |
| 39) | పాయవే ,, | 40) | ఆయాసాయ ,, |

| | | | | | |
|---|---|---|---|---|---|
| 41) | ప్రాయాసాయ | ,, | 42) | సంయాసాయ | ,, |
| 43) | వియాసాయ | ,, | 44) | ఉద్యాసాయ | ,, |
| 45) | శుచే | ,, | 46) | శోచతే | ,, |
| 47) | శోచమానాయ | ,, | 48) | శోకాయ | ,, |
| 49) | తపసే | ,, | 50) | తప్యతే | ,, |
| 51) | తప్యమానాయ | ,, | 52) | తప్తాయ | ,, |
| 53) | ధర్మాయ | ,, | 54) | నిష్కృత్యై | ,, |
| 55) | ప్రాయశ్చిత్యై | ,, | 56) | భేషజాయ | ,, |
| 57) | యమాయ | ,, | 58) | అన్తకాయ | ,, |
| 59) | మృత్యవే | ,, | 60) | బ్రహ్మణే | ,, |
| 61) | బ్రహ్మహత్యాయై | ,, | 62) | విశ్వేభ్యో దేవేభ్యః | ,, |
| 63) | ద్యావాపృథివీభ్యాగ్ం | ,, | | -యజు. 39 అ. | |

ఇట్లు 63 ఆహుతులు వేలు వేలుగా నిచ్చి క్రింది మంత్రములతో వాహుతుల నియ్యనగును.

1) ఓం సూర్యం చక్షుషా గచ్ఛ వాత మాత్మనా
దివం చ గచ్ఛ పృథివీం చ ధర్మభిః,
అపో వా గచ్ఛ యది తత్ర తే హిత
మోషధీషు ప్రతితిష్ఠా శరీరైః స్వాహా.

2) ఓం సోమ ఏ కేభ్యః పవతే ఘృతమేక ఉపాసతే,
యేభ్యో మధు ప్రధావతి తాంశ్చిదేవాపి గచ్ఛతాత్ స్వాహా.

3) ఓం యేచిత్ పూర్వఋతసాతా ఋతజాతా ఋతావృధః,
ఋషీంస్తపస్వతో యమ తపోజాం అపిగచ్ఛతాత్ స్వాహా.

4) ఓం తపసా యే అనాధృష్యా స్తపసా యే స్వర్యయుః,
తపో యే చక్రిరే మహస్తాంశ్చి దేవాపి గచ్ఛతాత్ స్వాహా.

5) ఓం యే యుధ్యన్తే ప్రధనేషు శూరాసో యే తనూత్యజః
యే వా సహస్ర దక్షిణాంస్తాంశ్చి దేవాపి గచ్ఛతాత్ స్వాహా.

6) ఓం స్యోనాస్మై భవ పృథివ్యనృక్షరా నివేశనీ,
యచ్ఛాస్మై శర్మ సప్రథాః స్వాహా.

7) ఓం అపేమం జీవా అరుధన్ గృహేభ్య
స్తం నిర్వహత పరిగ్రామాదితః,
మృత్యు ర్యమస్యాసీద్దూతః ప్రచేతా అసూన్
పితృభ్యో గమయాంచకార స్వాహా.

8) ఓం యమః పరో వరో వివస్వాం స్తతః
పరం నాతి పశ్యామి కించన.
యమే అధ్వరో అధి మే నివిష్టో
భువో వివస్వా నన్వాతతాన స్వాహా.

9) ఓం అపాగూహన్నమృతాం మర్త్యేభ్యః
కృత్వా సవర్ణా మదధుర్ వివస్వతే,
ఉతాశ్వినావభరద్యత్తదాసీ
దజహా దుద్వా మిథునా సరణ్యూః స్వాహా.

10) ఓం ఇమౌ యునజ్మి తే వహ్నీ అసునీతాయ వోఢవే,
తాభ్యాం యమస్య సాదనం సమితీశ్చావగచ్ఛతాత్ స్వాహా.
అథ. 18 కాం. 2 సూ.

ఈ మంత్రములతో నాహుతులిచ్చి-

1) ఓం అగ్నయే రయిమతే స్వాహా
2) ఓం పురుషస్య సయావర్య పేదఘాని మృజ్మహే,
యథా నో అత్ర నాపరః పురా జరస ఆయతి స్వాహా
తై.ఆ. 6-1.
3) ఓం య ఏతస్య పథో గోప్తారస్తేభ్యః స్వాహా
4) ఓం య ఏతస్య పథో రక్షితార స్తేభ్యః స్వాహా

5) ఓం య ఏతస్య పథోzభిరక్షితారస్తేభ్యః స్వాహా
6) ఓం ఖ్యాత్రే స్వాహా 7) ఓం అపాఖ్యాత్రే స్వాహా
8) ఓం అభిలాలపతే స్వాహా 9) ఓం అపలాలపతే స్వాహా
10) ఓం అగ్నయే కర్మకృతే స్వాహా
11) ఓం యమత్ర నాధీమస్తస్మై స్వాహా

12) ఓం అగ్నయే వైశ్వానరాయ సువర్గాయలోకాయ
స్వాహా తై. అ. 6-2.

13) ఓం ఆయాతు దేవః సుమనాభి రూతిభిర్
యమో హ వేహ ప్రయతాభిరక్తా,
ఆసీదతాగ్ం సుప్రయతే హ బర్హి
ష్యూర్జాయ జాత్యై మమ శత్రుహత్యై స్వాహా

14) ఓం యోzస్య కౌష్ఠ్య జగతః పార్థివస్యైక ఇద్వశీ.
యమం భంగ్యశ్రవో గాయ యో రాజాzనపరోధ్యః స్వాహా

15) ఓం యమంగాయ భంగ్యశ్రవో యో రాజాzన పరోధ్యః
యేనాzzపో నద్యో ధన్వాని యేన ద్యౌః పృథివీదృఢా స్వాహా

16) ఓం హిరణ్యకక్ష్యాన్త్సుధురాన్ హిరణ్యాక్షా నయః
శఫాన్, అశ్వానవః శతో దానం యమో రాజాభితిష్ఠతి స్వాహా.

17) ఓం యమో దాధార పృథివీం యమో విశ్వమిదం జగత్,
యమాయ సర్వమిత్తస్థే తత్ ప్రాణద్వాయు రక్షితం స్వాహా

18) ఓం యథా పంచ యథాషడ్ యథా పంచదశర్షయః,
యమం యో విద్యాత్ స బ్రూయాద్ యథైక ఋషి
ర్విజానతే స్వాహా.

19) ఓం త్రికద్రుకేభిః పతతి షడుర్వీరేకమిద్ బృహత్,
గాయత్రీ త్రిష్టుప్ ఛందాగ్ంసి సర్వా తా యమ ఆహితా స్వాహా

20) ఓం అహరహ ర్నయమానో గామశ్వం పురుషం జగత్,
వైవస్వతో న తృప్యతి పంచభిర్మానవైర్యమః స్వాహా

21) ఓం వైవస్వతే వివిచ్యన్తే యమే రాజని తే జనాః,
యే చేహ సత్యే నేచ్ఛన్తే యఉ చానృతవాదినఃస్వాహా

22) ఓం తే రాజన్నిహ వివిచ్యన్తే ఽథా యన్తి త్వాముప,
దేవాంశ్చ యే నమస్యన్తి బ్రాహ్మణాం శ్చాపచిత్యతి స్వాహా

23) ఓం యస్మిన్ వృక్షే సుపలాశే దేవైః సంపిబతే యమః,
అత్రానో విశ్పతిః పితా పురాణా అనువేనతి స్వాహా

తై. ఆ. 6-5.

24) ఓం ఉత్తేతభ్నోమి పృథివీం త్వత్పరీమం లోకం నిదధన్మో
అహంరిషమ్, ఏతాగ్ం స్థూణాం పితరో ధారయంతు
తేఽత్రా యమః సాదనాత్ తే మినోతు స్వాహా

తై. ఆ. 6-7.

25) ఓం యథాఽహాన్యను పూర్వం భవన్తి యథర్తవ ఋతుభి
ర్యన్తి క్లృప్తాః, యథానః పూర్వమపరో జహాత్యేవా
ధాతరాయూగ్ంషి కల్పయైషాగ్ం స్వాహా.

26) ఓం న హి తే అగ్నే తనువై క్రూరం చకార మర్త్యః
కపిర్బభస్తి తేజనం పునర్జరాయుర్ గౌరివ
ఆప నః శోశుచదఘమగ్నే శుశుధ్యా రయిమ్
ఆప నః శోశుచదఘం మృత్యవే స్వాహా

తై. ఆ. 6-1 నుండి 10.

ఇట్లు (అగ్నయే స్వాహా) అను ఆహుతి మొదలు (మృత్యవే స్వాహా) అను నీచివరి యాహుతి వఱకు అన్నియు గలిపి 121 ఆహుతులగును. నల్గురు వేయుటవలన 484 ఆహుతులగును. ఇద్దఱే ఆహుతులిచ్చిన 242 ఆహుతులగును.

నేయి యధికముగా నున్నచో మరల పైమంత్రములనే చదివి యాహుతులీయవలయును. ఇట్లు శరీరము భస్మమగు వరకు నాహుతు లీయవలయును.

శరీరము భస్మమైన పిమ్మట శ్మశానమునకు వెళ్ళిన వారెల్లరు స్నానము చేయవలయును. చనిపోయిన యింట్లోవారు లేనివారలతో శుద్ధిచేసి యావలనుండి యుందు ఈశ్వరస్తుతి ప్రార్థనో పాసనాదులొనర్చి, స్వస్తివాచన, శాంతికరణ మంత్రములతో యజ్ఞముచేయవలయును. స్వస్తివాచనాది మంత్రముల చివర స్వాహా పదము చేర్చి సుగంధ ద్రవ్యములతో బాటు నెయ్యాహుతుల నిచ్చి యిల్లు శుద్ధి చేయవలయును. అగ్నిహోత్రము చేసినందున యింటిలోని అశుద్ధవాయువు బయటకుపోయి, బయటి శుద్ధ వాయువు యింటిలో చేరును. చిత్తము ప్రసన్నమగును. చనిపోయిన రోజు దాహ సంస్కారము చేయుటలో నాలస్యమై రాత్రి యైనపక్షమున మఱునాడు ఉదయముననే స్వస్తివాచన శాంతికరణ మంత్రములతో నాహుతుల నీయవలయును.

తదుపరి దహనమైన మూడవ రోజున చనిపోయినవాని బంధువులలో నొకరిద్దఱు శ్మశానమునకు వెళ్ళి భస్మము ప్రోవుచేసి యందులో నెముకలున్నచో వానిని ఒక పాత్రలో పెట్టి ఆపాత్రను భూమిలో లోతుగా పూడ్చిపెట్టవలయును. మిగిలిన బూడిదను పూడ్చుటయో చెట్ల మొదళ్ళలోనో లేక యాశ్మశానములోనే యొకచోట పోయవలయును. తదుపరి చనిపోయిన వానిని గూర్చి చేయవలసిన దేమియు లేదు. కారణమేమన "భస్మాంతగ్ం శరీరమ్" అను యజుర్వేద మంత్రము వలన మృతుని శరీరము దాహముచేసి భస్మమొనర్చి పోయుటకు మించి చేయవలసిన దేమియు లేదని తెలియుచున్నది. చనిపోయినవ్యక్తి సంపన్నుడైనచో నతడు బ్రతికి యుండగా గాని చనిపోయిన యనంతరము కాని యతని బంధువులు ధనమును ధర్మప్రచారమునకో, అనాథాలయములను స్థాపించుటకో, వేదధర్మ ప్రచారమునకో వినియోగించుట మంచిది.

ఓం శాంతిః శాంతిః శాంతిః

మృతక సంస్కారవిధి సమాప్తము

# "కళాప్రపూర్ణ" పండిత గోపదేవశాస్త్రి

జననము : క్రీ.శ. 1896

జన్మస్థలము : కూచిపూడి, తెనాలి తాలూకా

జననీజనకులు : అంబమాంబా రామయార్యులు

విద్యాభ్యాసము : కూచిపూడి, అమృతలూరు, కాశ్యాదిపీఠములు, సంస్కృతాంధ్ర హిందీ సాహిత్యములు

వృత్తి : వైదిక ధర్మ ప్రచారము, వైదిక సంస్కార వ్యాపకత

అభిమాన విషయములు : షడ్దర్శనములు, నైష్ఠిక బ్రహ్మచర్యము, యోగమార్గప్రావీణ్యము.

స్థాపకులు : అంబా దర్శన గ్రంథమాల, కూచిపూడి, అంబా రామార్య సత్యార్థ ప్రకాశ ట్రస్టు, సికింద్రాబాద్ మరియు ఎన్నో ఆర్యసమాజములు.

సమ్మానములు :

1. "కళాప్రపూర్ణ" - ఆంధ్ర విశ్వవిద్యాలయం, విశాఖపట్టణం.
2. రూ. 10,000/- "మహర్షి దయానంద సరస్వతి నిధి పురస్కార్" వ్యాస్, ఆర్యసమాజం, ఫులేరా.
3. రూ. 5,001/- ఆర్యప్రతినిధి సభ, ఆంధ్రప్రదేశ్, సుల్తాన్ బజార్, హైదరాబాద్.
4. రూ. 25,000/- వేదవేదాంగ పురస్కార్, ఆర్యసమాజము, శాంతాక్రూజ్, బొంబాయి.
5. రూ. 1,00,000/- శతజయంతి సందర్భముగా "దర్శన తత్త్వవేత్త" బిరుదు - శతజయంతి ఉత్సవ సమితి, సికింద్రాబాద్, 30-7-95.

రచనలు, అనువాదములు : సత్యార్థ ప్రకాశము, ఋగ్వేదాది భాష్యభూమిక, నిరుక్తము, ఋగ్వేద భాష్య భాస్కరము I, II, III, వైదిక వినతి I, II, వైదిక దినచర్య, న్యాయ, వైశేషిక, సాంఖ్య యోగ, వేదాంత దర్శనములు; ఈశ, కేన, కఠ, ప్రశ్న, ముండక, మాండూక్య, ఐతరేయ, తైత్తిరీయ, శ్వేతాశ్వతర, ఛాందోగ్య, బృహదారణ్యకోపనిషత్తులు; ఆస్తికవాదము, ఆర్యధర్మ మీమాంస, సంస్కారవిధి, భగవద్గీత, ఏసుక్రీస్తు రహస్యజీవనము, పూనా వైదికప్రవచనపద్ధతి, అనటూద్రాధికరణము మొదలగునవి చిన్న గ్రంథములు 25(నాలుగు భాగాలలో) చిన్నవి, పెద్దవి కలిపి అరువదికి పైగా వైదిక గ్రంథములు తెలుగులో రచించినవారు పేరొక్కరే.